1993-2013 నడుస్తున్న చరిత్ర

సంపుటి : 2
సంచిక : 6
రు.20/-లు
తెనాలి



తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

ఆగస్టు 2016



ఆగస్టు 29 : గిడుగు జయంతి
**తెలుగుభాషా దినోత్సవం**

తెలుగుజాతికి
మరపురాని
సేవలనందించిన
చరిత్రకారుడు,
శాసన పరిశోధకుడు,
గ్రంథకర్త
పుచ్చా వాసుదేవ
పరబ్రహ్మశాస్త్రి గారు
కనుమరుగయ్యారు.

**విద్య, పాలనా మాధ్యమంగా తెలుగు : రెండు తెలుగు రాష్ట్రాల ప్రజలకు బహిరంగలేఖ**



## ఉద్యమమే గతి!

కీ.శే.భద్రిరాజు కృష్ణమూర్తి, భాషా శాస్త్రవేత్త
హైదరాబాద్ విశ్వవిద్యాలయ
మాజీ ఉపాధ్యక్షులు

హైస్కూలు స్థాయిదాకా తెలుగునే ఉంచి, ఇంటర్ నుంచి ఇంగ్లీషులోనే చదవాలని చెప్పాలి. తెలుగు మాధ్యమంలో చదివినవాళ్ళకు ఉద్యోగ అవకాశాలు పెంచాలి. ప్రభుత్వం చొరవ తీసుకుంటే బ్యాంకులు, పరిశ్రమలు, వ్యాపార సంస్థలు కూడా ఫలితాల దృష్టితో (మానవతా దృష్టితో కాదు) ఈ రకమైన పాలసీని అమలు చేసేవి. ఉత్పత్తి సాధనాలు ప్రజల భాషలో ఉన్నపుడే ఉత్పత్తి పెరుగుతుందని అభివృద్ధి చెందిన దేశాల చరిత్రను చూస్తే తెలుస్తుందని నచ్చ చెప్పాలి. ఉద్యోగావకాశాలు ఏ భాషలో చదివితే ఎక్కువగా వుంటాయో విద్యావిధానంలో ఆ భాషకు విలువ వస్తుంది. స్వల్ప ప్రయత్నంతోనే మాతృభాషా మాధ్యమంగా ఉత్తమగుణమున్న విద్యాలయాలు వస్తాయి. ఈ మార్పు ప్రభుత్వ ప్రణాళికలను బట్టి ఉంటుంది. భాషా విషయంలో చట్టాలు, జీవోలు, రూల్సు, ఆలోచించి సంస్కరణలు ప్రజాశ్రేయస్సు దృష్టితో చేస్తున్నట్లు నిరూపిస్తే కోర్టులు ఏమీ చెయ్యలేవు అని జస్టిస్ కృష్ణయ్యర్ ఒక సందర్భంలో నాతో అన్నారు. ఇంగ్లీష్ మీడియం వల్ల దేశాంతర ఉద్యోగాలు వస్తాయని అనుకునేవాళ్ళు ఇంగ్లీషులో జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవచ్చు. మరి మన రాష్ట్రంలో పట్టభద్రులైన వాళ్ళలో నూటికి తొంభైతొమ్మిది మందికి ఇక్కడే ఉద్యోగాలు వస్తాయి. ఏ ప్రభుత్వమైనా వారు రూపొందించే విద్యావిధానం వాళ్ళ కోసమా? పరాయి దేశం వెళ్ళే వాళ్ళ కోసమా? ఆలోచించండి..అటు తెలుగూ ఇటు ఇంగ్లీషూ రాక అన్యాయమవుతున్న పిల్లల భవిష్యత్తు దృష్టితో ప్రభుత్వం తక్షణ కర్తవ్యం ఆలోచించకపోతే సామాన్య ప్రజల్లో మాతృభాషారక్షణ ఒక ఉద్యమరూపం పొందే అవకాశం వుంది.

శాసన పరిశోధనలో
తరతరాలకు మార్గదర్శి, చరిత్రకారుడు,
గ్రంథకర్త, సామాజిక శాస్త్రజ్ఞుడు,
తెలుగుజాతికి చిరస్మరణీయుడు పుచ్చా వాసుదేవ
పరబ్రహ్మశాస్త్రి గారు జులై 27న కనుమరుగయ్యారు.
ఆయనకు శ్రద్ధాంజలి....
5వ పుటలో...




## లోపలి పుటలలో....



కైసేత, ముఖచిత్ర అలంకరణ : **కలిమిశ్రీ**
ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**
రేఖాచిత్రాలు : **బాలి, చిదంబరం** పకపకలు : **సరసి**

రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా
**డాక్టర్ సామల రమేష్‌బాబు**, సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004.
దూరవాణి: కార్యాలయం : 0866-2439466 సంపాదకుడు : 9848016136
e-mail : editorammanudi@gmail.com

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1938 : దుర్ముఖినామ సంవత్సర ఆషాఢ
*(కట్లాపి) బహుళ చతుర్దశి సోమవారం మొదలు శ్రావణ
*(సెవ్వాపి) బహుళ చతుర్దశి బుధవారం వరకు
* కట్లాపి * సెవ్వాపి : తెలుగు నెలలు


## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా


**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగు వారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అనుఫాంట్స్‌లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి editorammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిస్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. **3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.** 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగు వారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను) లకు మించకూడదు.

**నడుస్తున్న చరిత్ర** (2013 నవంబరు వరకు)

**అమ్మనుడి** (2015 మార్చి నుండి...)

**పాత సంచికలు విడిగా గాని,**
**సంపుటి (వాల్యూం) బౌండులుగా గాని**
**కావలసినవారు సంప్రదించండి.**

అమ్మనుడి, జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-4.
ఫోన్ : 98480 13136, 0866-2439466

# తెలుగుజాతికి మరపురాని సేవలనందించిన పుచ్చా వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి గారు



పరబ్రహ్మశాస్త్రి గారు పుట్టి పెరిగింది గుంటూరు జిల్లా పెదకొండూరులో. సేవలనందించింది మొత్తం తెలుగుజాతికి. తెలుగుజాతి చరిత్రలో కీలక ఘట్టాలను తన పరిశోధనతో పునర్నిర్మించిన ప్రజ్ఞాశాలి ఆయన. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చదువుకొని వచ్చిన తర్వాత ఉపాధ్యాయుడిగా మొదలై ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖలో 1959 నుండి 1978 వరకు పూర్తిగా అంకితమై, ధ్యేయనిష్టతో పని చేసి, ఉపసంచాలకులుగా ఉద్యోగ విరమణ చేశారు. ఆయన ప్రాంతీయ భేదాల కతీతంగా పూర్తిగా ఎదిగిన తెలుగువాడు. నీవెవరివో చెప్పవలసి వచ్చినప్పుడు 'నేను తెలుగువాణ్ణి' అని గర్వంగా చెప్పుకోవాలని, తెలుగుదనం తర్వాతే భారతీయత గానీ మరేదైనా గాని అనేది ఆయన సిద్ధాంతం. 'నడుస్తున్న చరిత్ర'కు ఆయన అభిమాన పాఠకుడు మాత్రమే కాదు, ప్రత్యేకమైన వ్యాసాలను ఆ పత్రికలో ఆయన రచించారు కూడా.

'ఇప్పుడు తెలంగాణగా అంటున్న ప్రాంతాన్ని ఆంధ్రమనీ, ఆంధ్రగా చెప్పుకొంటున్న ప్రాంతాన్ని తెలంగాణమనీ చెప్పటానికి చరిత్ర సాక్ష్యంగా నిలుస్తోంది. ఆర్థికంగా, సామాజికంగా చారిత్రక కారణాల వల్ల హెచ్చుతగ్గులుండవచ్చు. వాటి పరిష్కారానికి ప్రత్యేక తెలంగాణ ఏర్పడి వుండవచ్చు. రెండు రాష్ట్రాలూ కలిసి మెలసి తెలుగుజాతి ప్రతిష్టను పెంచేవిధంగా వుండాలి' అని ఆయన నాతో అన్నారు. ఈ అంశాన్ని స్పష్టం చేస్తూ పోయిన ఏడాది ఆయన 'ఆంధ్రజ్యోతి'లో వ్రాసిన పెద్ద వ్యాసం ఆలోచనాపరుల అభిమానాన్ని చూరగొంది.

ఆయనను చూస్తే బక్కగా, ఒంట్లో ఏమీ బలం లేనట్లుండే శరీరం. ఎంతో సాధారణ జీవితం. సాంప్రదాయంగా వచ్చిన నియమనిష్ఠలన్నింటినీ పాటిస్తూనే అత్యంత ఆధునిక విజ్ఞానాన్ని నిరంతరం సంతరించుకునేందుకు చదువుతూ వుండేవారు. ఆయన 95 ఏళ్ళ జీవితం అంతా అధ్యయనం, పరిశోధన. జ్ఞాన, కర్మ, భక్తియోగాలు మూడూ కలిసి ఆయనకు పరిపూర్ణవ్యక్తిగా నిండు జీవితాన్ని ప్రసా దించాయి. ఎప్పుడూ సన్మానాలకు, ప్రశంసలకు దూరంగా వుండే శాస్త్రి గారు మూడేళ్ల క్రితం తన సొంతవూరికి ప్రక్కనే వున్న రామచంద్రాపురంలో భీమిరెడ్డి అంజిరెడ్డి గారు ఎంతో గౌరవంతో చేసిన సన్మానాన్ని మాత్రం స్వీకరించారు. ఆయనకు తోడుగా ఆ సభలో పాల్గొన్న నేను తెలుగుభాష, సంస్కృతి, జాతిచరిత్రలపై ఆయ నతో మాట్లాడి తెలుసుకొన్న అంశాలెన్నో ఉన్నాయి. ఆ సంభాషణలు ఆ తర్వాత కూడా రెండేళ్ళపాటు జరిగాయి. ఇప్పుడాయన లేకపోవడం నాకూ, పత్రికకే కాదు– మొత్తం తెలుగుజాతికి, చరిత్ర పరిశోధన రంగానికి పెద్దలోటుగా మిగిలి పోయింది.

ఆయన చేసిన సేవల గురించి వ్రాస్తే అది పెద్ద జాబితాయే అవుతుంది.

❋ 2000 కు పైగా ప్రాకృత, సంస్కృత, తెలుగు, కన్నడ శాసనాలను పరిష్కరించారు. దీనితో తెలుగుజాతి చరిత్ర విశేషాలు ఎన్నో బయటకు తెలిశాయి.

❋ కాకతీయుల చరిత్రను పరిశోధించి, దాన్ని ఎన్నో కొత్త విషయాలతో పునర్నిర్మించిన ఘనత ఆయనదే. ఆ అంశంపైనే ఆయన పిహెచ్.డి.చేశారు. కాకతీయుల చరిత్ర గురించి సాధికారికతను పరబ్రహ్మశాస్త్రి గారు సాధించారు. రాణి రుద్రమదేవి క్రీ.శ.1290లో చనిపోయారని తేల్చింది ఆయనే.

❋ తెలుగువారి మొట్టమొదటి రాజధాని కోటిలింగాలలో త్రవ్వకాల ఆధారంగా శాతవాహనుల వంశానుక్రమణికను నిర్ధారించించి శాస్త్రిగారే.

❋ ప్రకాశం జిల్లా బచ్చేపల్లి రాగిరేకు శాసనాలను పరిశోధించి, తొలి పల్లవుల వంశవృక్షాన్ని పునర్నిర్మించింది శాస్త్రి గారే.

❋ విజయనగర రాజుల శాసనాలపై పరిశోధించి పుస్తకాలను రచించారు.

❋ భారతీయ ఐతిహాసికమండలి, తెలుగు విశ్వవిద్యాలయం వారి చరిత్ర సంకలన గ్రంథాలు కొన్నింటికి సంపాదకత్వం వహించారు.

ఇవి కొన్ని మాత్రమే. నిజానికి ఎవరైనా పూనుకొని ఆయన జీవితాన్ని పరిశోధనలను గురించిన సమగ్రమైన గ్రంథాన్ని వెలువరిస్తే మున్ముందు యువతకు మార్గదర్శకంగా వుంటుంది. ఇటువంటి పనికి పూనుకోవలసినవారు, సమర్థత గలవారు ఈమని శివనాగిరెడ్డి గారు. ఆయన ఇందుకు సంకల్పిస్తారని ఆశిస్తున్నాను.

1921లో పుట్టి ఈ నెల 27న కనుమరుగైన శాస్త్రి గారికి జీవించివుండగా దక్కవలసిన ప్రభుత్వ మర్యాదలు దక్కలేదు. అయినా తెలుగుజాతి చరిత్రలో ఆయన చోటు పదిలంగా, శాశ్వతంగా వుంటుంది.

**–సామల రమేష్‌బాబు**
సంపాదకుడు

# తెలుగువారిగా మీ ఉనికిని చాటుకొనేందుకు ఈ పాటింపులు తప్పనిసరి

**ఆహ్వాన పత్రికలు** : మీ ఇంట్లో జరిగే పెళ్ళిళ్ళకు, పుట్టినరోజు, షష్టిపూర్తి మొ॥ ఏ వేడుకకైనా పిలుపు (ఆహ్వానం)లను తెలుగులో ముద్రించండి. తెలుగువారు కానివారిని కూడా మీరు పిలుస్తున్నట్లయితే వారి కోసం ఆ ఆహ్వాన పత్రిక మీదే వేరొకవైపు గాని, విడిగా గాని ఆంగ్లంలో లేదా అవసరమైన మరో భాషలో కూడా ముద్రించండి కానీ తెలుగులో ప్రముఖంగా ఉండాలి.

మన ఉనికికి గుర్తులు మన భాష, మన సంస్కృతి మాత్రమే. వాటిని వదలిపెట్టిన తర్వాత మనకు గుర్తింపు, మర్యాద ఉండవు. ఇతర భాషలను, సంస్కృతులను గౌరవిస్తూనే మన ప్రత్యేకతను మనం కాపాడుకొందాం.

మీరెక్కడ నివసిస్తున్నా- తెలుగు ప్రాంతం కానిచోట నివసిస్తున్నా- ఈ సంప్రదాయాన్ని పాటించండి. కంప్యూటర్లలో 'యూనికోడ్'లో ప్రపంచమంతటా తెలుగు అక్షరాలు అందుబాటులో ఉన్నప్పుడు మనకెందుకు చింత!

**విజిటింగ్ కార్డులు..అవి మన గుర్తింపు చీటీలు**

మనం గుర్తింపు చీటీలను -విజిటింగ్ కార్డులను- వేయించుకోవడం ఈ రోజుల్లో పరిపాటి అయింది. ఉద్యోగరీత్యా, వ్యాపార రీత్యా గాని అవి అవసరమవుతాయి. అటువంటి అవసరాలు లేకపోయినా, మన చిరునామా, ఫోన్, ఇ-మెయిల్ వివరాలను తెలుపడానికి గాని- అన్నిటికీ ఈ గుర్తింపు చీటీలు/విజిటింగ్ కార్డులు ఇప్పుడు మన జీవితంలో ఎంతో అక్కరపడుతున్నాయి. వాటిని ఇంగ్లీష్‌లోనే వేయించాలనే 'రూల్' ఏమీ లేదు. తెలుగులో వాటిని ఇవ్వడం మనకు ఆత్మగౌరవం. అవసరమైతే తెలుగు అక్షరాల క్రిందే ఇంగ్లీషులో కూడా ఇద్దాం..లేదా కార్డుకు మరోవైపున ఇద్దాం. ఏమంటారు?

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014). తెలుగు అమ్మనుడిగా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.




**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/-లు | పోషకులు రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/-లు | ప్రోత్సాహకులు రు. 10,000/-లు |

**దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని 'అమ్మనుడి' పత్రికలో ప్రచురిస్తాము.**

**దాతలందరినీ శాశ్వత చందాదారులుగా పరిగణించి పత్రికను ప్రతినెలా పంపిస్తాము. ట్రస్టు ప్రచురించే పుస్తకాలను కూడా ఉచితంగా పంపిస్తాము.**

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.S.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# విద్య, పాలనా మాధ్యమంగా తెలుగు :

## తెలుగు రాష్ట్రాల ప్రజలకు ఓ బహిరంగ లేఖ

**నే**డు తెలుగును గురించి అనేకమంది అనేక సందర్భాలలో తమ ఆవేదనను వెలిబుచ్చుతున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే 'నేటి తెలుగు నడక, రేపటి తెలుగు పడక!' ఈ రెండు వాక్యాలు నేటి తెలుగు దీనస్థితికి అద్దం పడుతున్నాయి. ఇలాంటి పరిస్థితిలో మన ముందున్న కర్తవ్యం ఏమిటి?

మనం ఏం చేయాలి అనేదే పెద్ద ప్రశ్న. ఏం చేయాలో ఆలోచించండి, రాయండి, ఈ విషయమై మీ ఆవేదనను వెలిబుచ్చండి. మీ ఆక్రోశాన్ని వెళ్లగక్కండి, మీ అశాంతిని ప్రకటించండి. మీ కోపతాపాలను ప్రదర్శించండి–మాటల్లో రాతల్లో. అందరం తప్పనిసరిగా ఒక నిర్ణయానికి రావాలి.

ఇవాళ తెలుగు గురించి ఏం జరుగుతోంది?

రాష్ట్రప్రభుత్వాలు పట్టించుకోవడం మానేశాయి.

ఓట్లు అడగడానికి తెలుగు కానీ మిగిలినచోట్ల ఇంగ్లీషు! తెలుగునాట, కేజీ టూ పీజి ఇంగ్లీషంట! రాష్ట్రాలో అధిక శాతం తెలుగువాళ్లు ఉండగా విద్య, పాలనా మాధ్యమంగా తెలుగు కాకుండా ఇంగ్లీషు ఎందుకు?

ఎవరు కోరుకుంటున్నారు? పాలకులు ప్రజలమీద రుద్దుతున్నారా? లేక ప్రజలు కోరుకుంటున్నారా?

ఇంగ్లీషు మాధ్యమంతో వెంటనేగానీ ముందుముందుగానీ అధిక ప్రయోజనాలు ఉన్నాయా?

ఇంగ్లీషు మాధ్యమంలో చదవకపోతే 'పనికి' మాలినవాళ్లు అవుతారా? వాళ్లు పనికిరారా?

ఎవరి పనికోసం మనం? మనరాష్ట్రాలలో మనం, మనందరికోసం మనం.

మనం బతకడానికి తెలుగు కాకుండా ఇంగ్లీషా?

తెలుగు భాష తీయనిది, తేనె లాంటిది, ఇంపైనది, విన సొంపైనది, ఇవన్నీ

తెలుగుపై ప్రేమతో అనేవి, వాటిని కాసేపు కాస్త పక్కనబెట్టండి.

తెలుగులో మాటలు చాలవు, తెలుగు ఇంకా అభివృద్ధి చెందాలి, పారిభాషిక పదాలు కావాలి.

ఆధునిక అవసరాలకు కావలసిన తెలుగును తయారుచేసుకోవాలి.

ఇవన్నీ బండి ముందా, గుర్రం ముందా లాంటి మాటలే.

మానవ పరిణామ క్రమంలో ప్రపంచంలోని భాషలన్నీ పూర్తిగా వికసించినవే. అభివృద్ధిచెందినవే.

ఒక భాష గొప్పదీ మరొక భాష పేదదీ కాదు.

కాకపోతే ఒక భాషలో ఉన్నవి వేరొక భాషలో ఉండకపోవచ్చు. అవసరాన్ని బట్టి అన్నీ సమకూరుతాయి.

ఇక ప్రతి భాషా, ఆ సమాజానికి వేల ఏండ్ల గుప్త నిధి, అదే విజ్ఞానసర్వస్వం.

భాష, నాగరికతకు చిరునామా. భాష జన జీవం. భాష జాతి జీవన ప్రతిబింబం.

ఆలోచించండి, స్పందించండి, ఏం చేద్దామో చెప్పండి.

తెలుగుమాధ్యమ బడులు తగ్గుతూ ఆంగ్ల మాధ్యమ స్కూళ్ల సంఖ్య క్రమేపీ పెరుగుతూ వస్తోంది. గత కొన్ని దశాబ్దాలుగా ప్రభుత్వ నిర్వాకం వల్ల విద్య ప్రైవేటీకరణ పేరుతో, కార్పోరేట్ ఇంగ్లీషు స్కూళ్లు తామరతంపరగా పెరగటం ఆంగ్ల మాధ్యమాన్ని పెంచి పోషించినట్లైంది. ప్రభుత్వ యాజమాన్యంలో సరైన ఉపాధ్యాయులులేకుండా, అరకొర సౌకర్యాలతో నడిచే తెలుగు బడులలో చేరే విద్యార్థుల సంఖ్య తగ్గుతోంది. ఇది, నోట్లో బియ్యం బోసి నెత్తిన మోదినట్లు కాదా? ప్రైవేటు కార్పొరేటు స్కూళ్లలో తెలుగు మీడియం ఎందుకుండదు? ఎందుకంటే వాళ్లకు విధానంకంటే వ్యాపారం ముఖ్యం. ప్రభుత్వ బడులలో ఇంగ్లీషుమీడియం పెడితే ప్రైవేటు కార్పొరేటు స్కూళ్లు ఖాళీ అవుతాయా? కావు. ఎందుకని, ప్రభుత్వబడులలో ఇంగ్లీషు మీడియం ప్రైవేటు కార్పోరేటు స్కూళ్ల ఇంగ్లీషు మీడియంతో పోటీపడలేవు. అలా పోటీపడి నిలబడాలంటే ప్రభుత్వ బడుల యాజమాన్య పద్ధతులు మారాలి. అధిక శాతం ప్రజలు కోరుకొనేది సరైన ఉపాధ్యాయులూ, సరైన వాతావరణం ఉన్న స్కూళ్లు. అంతేకానీ ఇంగ్లీషు మీడియం కాదు.

ప్రజలు ఇంగ్లీషుమీడియంవైపు మొగ్గుజూపడానికి మరో ప్రధాన కారణం తెలుగు చదువుకుంటే ఉద్యోగ భద్రత లేకపోవటమే. మన వాదన అంతా దీనిచుట్టూతానే తిరుగుతోంది. తెలుగు మాధ్యమంలో చదువుతున్నవారికే ఉద్యోగాలు అని చట్టం చేయాలి. అలా చేస్తే తెలుగు బడులకు వచ్చే విద్యార్థుల సంఖ్య పెరుగుతుంది. తెలుగు మాతృభాషగా ఉన్నవారు 85–90% ఉన్నచోట తెలుగు మాధ్యమంలో విద్యాబోధన లేకపోవడం మన మానసిక దౌర్బల్యమూ, హేతుబద్ధంకాని నిర్ణయాలే కారణం. ఇది కొత్త వలసవాదం లో భాగమే. వీటి వలనే రోజూ మనం వింటున్న హత్యలూ ఆత్మహత్యలూ, మనుషులమధ్య అసహనమూ, మానవతా విలువల హననమూను. ఇవే రేపటి సమాజ దుర్గతికి నేటి బాటలు.

ఇంగ్లీషు చదువులద్వారా ఎంతమందికి ఇతర దేశాలలో ఉద్యోగాలు వస్తున్నయ్యో తెలుసుకుంటే మనం ఇంగ్లీషు కోసం ఇంత వెంపర్లాడడం, తాపత్రయపడడం ఉండదేమో! ఇంగ్లీషును ఒకభాషగా నేర్చుకోవడం వేరు, దాన్ని బోధనా మాధ్యమంగా ఎంచుకోవడం వేరు!!

ఈ రోజు ప్రపంచంలో అత్యధికులు మాట్లాడేది ఇంగ్లీషు కాదు గానీ అధిక ప్రాచుర్యం ఉన్న భాషలలో అది ఒకటి అని మనకు తెలుసు. ప్రపంచ జనాభా లెక్కల ప్రకారం ఎక్కువమంది

మాట్లాడేవాటిలో వరుసగా 1. చైనీసు, 2.హిందీ, 3.స్పానిషు, 4.ఇంగ్లీషు, 5.అరబిక్, 6.బెంగాలీ, 14.తెలుగు, 15.వియత్నమీసు, 16.కొరియను, 17.ఫ్రెంచి, మొ.ఉన్నాయి. ఇక అనేక దేశాలలో ఇంగ్లీషుకు ప్రాచుర్యం ఎక్కువే. ఎవరూ కాదనరు. అందుకనే మనం ఇంగ్లీషును ఒక విషయంగా చదువుకుంటాం అనేది. ఈ రోజూ రేపూ అంతర్జాల సౌకర్యాలతో ఇంగ్లీషును ఇంతకుముందు కంటే తేలికగా సులువుగా నేర్చుకోవచ్చు. ఇంగ్లీషును మాధ్యమంగా చేస్తే ఇక తెలుగును నేర్చుకోవల్సిన అవసరం ఎందుకు కలుగుతుంది? ఇంట్లోగూడా అందరూ ఇంగ్లీషే మాట్లాడు కుంటారు గదా. ఉద్యోగాలకు ఇతర రాష్ట్రాలకు వెళ్లేవారు ఎంతమందో తెలుగు రాష్ట్రాలలో ఉద్యోగం చేసేవారు ఎంత మందో లెక్కలు చూడండి. బయట వచ్చే అరకొర ఉద్యోగాల కోసం తెలుగు రాష్ట్రాలలో ఉన్న 90% మందిని బలిపెట్టలేం. ఎంతోమంది ఇంటర్మీడియేట్ వరకూ తెలుగుమాధ్యమంలోనే చదువుకొని ఇతర రాష్ట్రాలలోనూ దేశవిదేశాలలోనూ ఉద్యోగాలు చేయడం లేదా.

ఇక, ఐటీ కోసం ఇంగ్లీషు మాధ్యమం కావాలనే వాదనలో పస లేదు. ఐనా ఐటీ ఒక మాధ్యమరంగం. దానిని ఏ భాషలోనైనా చేయవచ్చు. జపాన్, చైనా, కొరియా, జర్మనీ, ఫ్రెంచి, రష్యను ఇలా ఎన్నో దేశాలవారు ఐటీని, అంతర్జాలం వాడకనూ తమతమ భాషలలోనే చేసుకొంటున్నారు.

ఇక్కడ లేవనెత్తిన అంశాలు సులభంగా తీసిపారేసేవి కావు. సమస్యను గుర్తించి, ఆ సమస్య సమసిపోవడానికి తగిన కార్యాచరణప్రణాళికను ఇప్పటిదాకా చెప్పలేదు. వేదికల్లో పులకరింపజేసే మాటలే కానీ నిజంగా తెలుగుభాష అస్తిత్వాన్ని ఉద్దీపింపజేసే ప్రయత్నాలేవీ జరగడం లేదు. చాలామందికి సరైన భాషాశాస్త్రీయ దృక్పథం, విశ్వజనీన భాషాదృక్పథం, ప్రపంచీకరణ నేపథ్యంలో స్థానికభాషలకు జరుగుతున్న నష్టాలు మొదలైన అంశాలపై లోతైన అవగాహన లేకపోవడం అందుకు కారణం. పైగా ఎదుటివారి అభిప్రాయాలను సాలోచనగా తార్కికంగా స్వీకరించలేకపోవడం, అనవసరమైన భేషజాలు మన భాషకు ఎంతమాత్రమూ మేలు చేకూర్చలేవు. ఈ విషయాన్ని అందరం సరిగ్గా అర్థం చేసుకొని ఒక ప్రణాళికాబద్ధంగా ఇటు ప్రజల్లోనూ అటు ప్రభుత్వంలోనూ తెలిసేలా చేస్తే తప్ప ఈ సమస్యకు పరిష్కారం దొరకదు. ఈ సమస్య ఒక్క తెలుగుదే కాదు. భారతీయ స్థానిక భాషలన్నీ ఇలాగే ఉన్నాయి. ప్రభుత్వాలు తీసుకొనే తప్పుడు నిర్ణయాలు, ఆ ప్రభుత్వాలకు సలహాల రూపంలో తప్పుదారి పట్టిస్తున్న అశాస్త్రీయ నివేదికలు, అవేమీ తెలియని అమాయక ప్రజలు నిజం తెలుసుకొనేలా చేయాల్సి వుంది. ప్రతి ఒక్కరూ ఒక ఉద్యమస్ఫూర్తితో ముందుకు కదలాలి. మనం తలబెట్టిన ఈ భాషామేధోమథనం ఆచరణాత్మకమైన భాషాభివృద్ధి సాధనకు నాంది పలుకుతుందని ఆశిద్దాం.

**ఇంగ్లీషు గురించిన కొన్ని అపోహలు**

**1. ఉద్యోగం, ఉపాధి భరోసా ఇవ్వగలిగేది ఇంగ్లీషు మాత్రమే!** తప్పుడు నమ్మకంపై ఏర్పడిన దురభిప్రాయం. కారణం, ప్రభుత్వ విధానాలూ, భాషావిధానలోపమూ, దీన్ని ముందు సరిదిద్దాలి.

**2. ఆధునిక విజ్ఞానం, సమాచారం అంతా ఇంగ్లీషులోనే ఉంది!** ఇది పూర్తిగా నిజంకాదు. చాలా భాషలలో లభ్యమౌతోంది. ప్రపంచంలో అనేక చోట్ల జ్ఞాన సృష్టి జరుగుతోంది. అదంతా అన్ని భాషలలోకి అవసరం మేరకు కావలసినవారు తెచ్చు కొంటున్నారు. సాంకేతిక సమాచార యుగంలో జ్ఞానాన్ని ఒక భాషనుండి ఒకభాషకు మార్పిడి చేసుకొనే అవకాశాలు ఎన్నో ఉన్నాయి. ఇంకా రోజురోజుకూ ఈ అవకాశాలు పెరుగుతున్నాయి. ఒకే భాషలో ప్రపంచ విజ్ఞానం అంతా ఉండడం నియంత్రణకూ, నియంతృత్వానికి దారితీస్తుంది. మార్కెట్ శక్తుల ప్రాబల్యానికి దారితీస్తుంది. జ్ఞానం అందరికీ అన్ని భాషలలోనూ ఎల్లప్పుడూ అందుబాటులో ఉండాలి. కంప్యూటరు యుగంలో భాషలూ మాండలికాలూ అడ్డంకులూ కానేకావు.

భాషలో రాసినదైనా ఎన్ని వందల పేజీలైనా ఒక్క మీటతో కోరుకున్న మాండలికానికో భాషలోకో తెచ్చే వీలు కలిగిస్తున్న యంత్రాలు వచ్చేస్తున్నప్పుడు మాతృభాషలను వదిలిపెట్టాల్సిన అవసరం ఏమిటి. ఇది ఆంగ్లభాషాధారిత మార్కెట్ శక్తుల అధిపత్య నియంతృత్వం మాత్రమే.

**3. తెలుగును వదిలి చిన్నప్పటినుంచే ఇంగ్లీషును నేర్పితే విశ్వవిఖ్యాత నాగరికతకు వారసులమవుతాం :** తెలుగూ లేక మిగిలిన భారతీయ భాషలను వదిలిపెట్టడం అంటే వేల సంవత్సరాల విజ్ఞానాన్ని వదులుకున్నట్లే. వేల సంవత్సరాల తరబడి వికసిస్తున్న మన సమాజానికి మన భాష ప్రతిబింబం. ఇంట్లోనూ బయటా, చిన్నా పెద్దా, ఆడా మగా మనుషులతో ఎట్లా మెలగాలో చెప్పే మన సాహిత్యాన్ని చదవడం మానివేస్తున్నాం. చిన్నప్పటి నుండి అలవాటు చేయాల్సిన అవసరాన్ని గుర్తించలేకపోతున్నాం. నేటికి నాది నా ఆస్తి నా సంపాదన అనే యువజనాన్ని తయారు చేసే పనిలో పడ్డాం.

**4. సమాజంలో ఉన్నత పదవులకోసం రేపటి సైన్స్ అండ్ టెక్నాలజీకోసం చిన్నప్పటినుంచే ఇంగ్లీషుమాధ్యమం అవసరం!** సమాజాన్ని నియంత్రించేవాళ్లను కాదు, సమాజ హితాన్ని కోరేవాళ్లని తయారు చేయాలి. నేడు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్న హత్యలూ, ఆత్మహత్యలూ, విధ్వంసకాండలూ, అత్యాచారాలూ మనలో సహనం ఓర్పు ఓర్మి తగ్గుతున్న వనడానికి గుర్తులే. రేపటి అశాంతికి ఎవరు బాధ్యత వహిస్తారు? నేటి టెక్నాలజీ ఈ అశాంతికీ, ఓర్పులేమికీ అసహనానికీ కొంత కారణమైనా టెక్నాలజీతోపాటు మానవవిలువలను నేర్చుకోవడం తప్పనిసరి అని తెలుసుకోలేకపోతున్నాం. ముఖ్యంగా టెక్నాలజీ మానవుడి శ్రమను తగ్గిస్తుంది. అన్నిటికీ అందరికీ అందించే ప్రక్రియలకు దోహదం చేస్తుంది. దీనితో మనలో మనం కోరుకోనిది మనసు ఆవహిస్తోంది. మీట నొక్కితే లైటు వెలగాలి, చెయ్యి పెడితే నీళ్లు జలజలా పడాలి, ఇట్లా మనం అనుకొన్నది చూపులతో, స్పర్శతో వెంటనే జరిగిపోవాలి. అట్లా కాకుంటే మనసులో తిట్టుకుంటూ అసహనంతో ఊగిపోతాం. పరికరాలైతే ఫర్వాలేదు. మరి అవతలివాళ్లు మనుషులైతే రెచ్చిపోతాం. దుడుకుతనాన్ని ప్రదర్శిస్తాం. ఇదే పెచ్చుమీరి దురంతాలకు దారితీస్తోంది. వీటిని ఆపడానికి, మన సమాజాన్ని రక్షించుకోవడానికి మాతృభాషలను కాపాడుకోవాలి. ఆలోచించండి.

**–తెలుగు భాషోద్యమ సమాఖ్య**

బోధనా
మాధ్యమం

-డా॥గారపాటి ఉమామహేశ్వరరావు
98661 28846

# భారతీయ భాషలపట్ల ఇంత దురహంకారమా?

## శాస్త్రీయత కొరవడిన ఇంగ్లీషు మాధ్యమ ఉద్యమం

మానవులు విశ్వాంతరాళాలమధ్య రాకపోకలు సాగిస్తున్న ఈ ఆధునిక యుగంలో కూడా కొన్ని స్వార్థ శక్తులు తమ అధికారాన్నీ ఆధిపత్యాన్నీ కండబలంతోనేగాక బుద్ధిబలంతో కూడా సాధించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఇలాంటి కొందరి బుద్ధిబలానికి బలహీనులు మానసిక దోపిడీకి లొంగిపోతారు. ఈ మానసిక దోపిడీ భావదాస్యానికి దారితీస్తుంది. ఈ పరంపరలో భాష ఒక ముఖ్యసాధనం అవుతుంది. ఒకప్పుడు సంస్కృత గుత్తాధిపత్యం నుంచిబైటపడడానికి తెలుగూ తదితర దేశభాషలకు వేయి సంవత్సరాలకు పైగా పట్టింది. యుగం మారినా మళ్లీ అదే బాటా- ఈ మారు సంస్కృతం బదులు ఇంగ్లీషు దాస్యం. ప్రాథమికవిద్యదశలోనే మాతృభాషలకు బదులు ఇంగ్లీషు మాధ్యమాన్ని ప్రవేశపెట్టడం అనాగరికం. పసివయసులో ఇంగ్లీషును రుద్దడమంటే బలవంతాన భావదాస్యంలోకి తోసివేసినట్లే. దూరదృష్టి లోపించిన స్వార్థపరులైన కొందరు ఉద్యోగాలను ఎరచూపి ఇంగ్లీషును ఇట్లా ప్రోత్సహించడం బలహీనులపై చేస్తున్న మానసిక దాడిగాదీనిని గుర్తించాలి.ఇంగ్లీషు మాధ్యమంలో చదివితేనే ఉద్యోగాలూ బతుకుదెరువూ అని నమ్మించడం అమానుషం. ఈ ఇంగ్లీషుతోనే మనం పేదరికంనుండి గట్టెక్కుతామనడం ఒక బానిస భావన. ఈ భావన మన సమాజానికి ఎక్కుతున్న విష సంస్కృతి ప్రభావమే.

నేటి ప్రపంచంలో సుమారు వందకుపైగా దేశాలు మన తెలుగు రాష్ట్రాలకంటే విస్తీర్ణంలో చిన్నవి. ఇక జనాభాలో ఇరవై దేశాలు మాత్రమే తెలుగు రాష్ట్రాల కన్నాఎక్కువలో ఉన్నాయి. ఈ విస్తృతినీ ఈ ఆధిక్యాన్నీ ఎట్లా అర్థం చేసుకోవాలి. ఎంతో విస్తీర్ణమూ అధిక జనాభా, వివిధ భాషలూ, పలు సంస్కృతులూ కలిగిన మన రాష్ట్రాలనూ దేశాన్నీ కొన్ని దేశాల సమాఖ్య (ఫెడరేషన్ ఆఫ్ నేషన్స్) గా చూడాలిగానీ పాలనాపరమైన ఏవో కొన్ని అవసరాల కోసం విభజింపబడ్డ రెవెన్యూ భాగాల సముదాయంగా కాదు. ఇండియాని కొన్ని దేశాలూ జాతుల సమాఖ్యగా చూడలేనివారి ఆలోచనా విధానం అశాస్త్రీయం. ఇట్లాంటి పంథాలోనించి వచ్చిన ఆలోచనలే తెలుగును వదిలి ఇంగ్లీషు భాషను మాత్రమే నేర్చుకోవాలనీ, దీనితో మున్ముందు ఆస్ట్రేలియా, కెనడా, అమెరికాలాంటి దేశాలను మన వలస దేశాలుగా మలచుకోవచ్చనే ఆలోచనలు ఎంత అసంబద్ధమైనవో పునరాలోచించాలి.

ఇంగ్లీషును భారతదేశ ప్రజలపై రుద్దడానికి చేసే దూరదృష్టిలేని దురాలోచనలకు ఆధారాలుగా వలసవాదాన్ని తెరపైకి తీసుకురావడం ఎంత దుర్మార్గమైన ఆలోచనో పరిశీలించండి. ఇట్లాంటి ఆలోచనలతోటే వలసవాదులు వందల ఏండ్లకిందటే అమెరికా, ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండాల ఆదివాసులపై అమలుజరిపిన పైశాచిక దాడులూ, దారుణ మారణకాండలూ జాతులకు జాతులనే తుడిచిపెట్టిన వైనాన్ని మనం మరిచిపోలేదు. ఇట్లాంటి యూరోపియన్ల పైశాచిక ప్రవర్తనలను ప్రశంసించవలసిన అవసరం లేదు. యూరోపియన్ల వలసలకు కారణాలను హేతుబద్ధ తార్కిక పద్ధతిలో ఆలోచించాలి. యూరోపియన్ల వలసలకు ప్రధాన కారణం వారి స్వదేశ వాతావరణం. ప్రపంచంలో బొగ్గు, చమురు, గ్యాసు, విద్యుత్తును కనుక్కోక ముందు యూరోపు దేశాలలో బ్రతకడం మహా దుర్భరంగా ఉండేది. ఒకరకంగా చెప్పాలంటే ఒకప్పుడది శాపగ్రస్తుల ప్రవాస స్థానం. సేద్యానికి అనువైన భూమీ, నీరూ, చాలినంత సూర్యరశ్మి లాంటి వనరులు తక్కువ. సగటున నాలుగు-ఐదు నెలలూ రోజుకు 7-8 గంటలు మాత్రమే ఉండే సూర్యరశ్మిలో తక్కువ వనరులతో పండే చాలీచాలని పంటలూ, మిగిలిన ఏడెనిమిది నెలలు మాంసాహారంపై ఆధారపడే జీవనం. ఆ మాంసాన్ని నిలవచేసుకొనేందుకు తూర్పు దేశాలలో దొరికే సుగంధద్రవ్యాలూ మసాలాదినుసుల వ్యాపారం అవసరం అయింది. వ్యాపారులుగా బయలుదేరినవారు తర్వాత వలసదారులుగా అవతారమెత్తారు. ఐరోపా వలసదారులు కొన్నిసార్లు స్థానికులపై హింసాత్మక చర్యలకు దిగడం, ఆ దేశాల సంపదను దోచుకోవడం, వారి భూభాగాలను ఆక్రమించుకోవడం అడ్డమొస్తే అంతం చేసేందుకు కూడగట్టుకున్న సాయుధ సిబ్బందితో కదిలేవారు. ఐతే క్రమేణా ప్రాకృతిక ఇంధనాలైన బొగ్గూ, పెట్రోలునూ కనిపెట్టడం దానితోపాటే పారిశ్రామికీకరణం కొత్త ఉత్పత్తుల తయారీ వాటి అమ్మకాలకోసం తూర్పు దేశాల అన్వేషణలో వలసవాదానికి ఓ ప్రత్యేక స్థితిని తీసుకువచ్చింది. అంటే కనీస అవసరాలతో మొదలైన యూరోపియన్ల వలసలు వ్యాపార-వాణిజ్యాల ముసుగు వేసుకొని వలస దేశాల రాజకీయ అస్థిత్వానికి చేటుతెచ్చేంతవరకూ వెళ్లింది. సముద్ర యానం భారతీయులకు కొత్తేమీ కాదు. రెండువేల యేళ్లనాడే వేలాది కిలోమీటర్ల మేర విస్తరించిన ఆగ్నేయ ఆసియా దేశాల మొత్తంపై తమ ప్రాభవ ముద్ర వేయగలిగారు. కానీ ఎక్కడా స్థానిక జాతుల్ని తుడిచిపెట్టిన దాఖలాలు లేవు. భారతీయ సంస్కృతీ, భాషల ఆనవాళ్ళు అంతటా కనిపిస్తాయి.

తూర్పు దేశాలు, ప్రత్యేకంగా భారత ఉపఖండం సహజ సిద్ధ వనరులతో సంవత్సరం పొడవునా సేద్యానికి అనువైన భూమీ, తగినంతనీరూ, కావలసినంత సూర్యరశ్మి మొదలైన వనరులు ఎక్కువగా కలిగివుండేవి. గుప్పెడు గింజలు చల్లితే గంపెడంతమందితినేంత పంటదిగుబడి అయ్యే దేశం ఇది.

మన దేశంకన్నా రెండు మూడింతలు పెద్దవైన అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా దేశాలకు వలస పోయేందుకు పనికివస్తుందని మనం మన భాషలను వదిలి ఇంగ్లీషును మాధ్యమంగా ఎంచుకోవాలనడం దారుణం. మన దేశంలో జనాభా సాంద్రత ఎక్కువే. దానిని ఎప్పటికైనా నియంత్రించక తప్పదు. నేడు వనరులు తక్కువగా ఉన్నాయని చెప్పి మన దేశభాషలను వదులుకొని ఇంగ్లీషును మాధ్యమంగా

ఎంచుకోవాలనడం సమంజసం కానేకాదు.

ప్రపంచ దేశాలలో అందుబాటులోవున్న భూమీ మంచినీటి వనరుల నిష్పత్తిలో భారతదేశానిదే పైచేయి. ఉదా. ఐరాస విడుదల చేసిన లెక్కల ప్రకారం వివిధ పెద్ద దేశాల భూవైశాల్యంలో నీటి వనరుల సగటు శాతం వరుసగా ఇట్లా ఉంది: 1. ఇండియా 9.55%, 2. కెనడా 8.93%, 3. అమెరికా సం.రా. 5.3%, 4. ఇండోనేసియా 4.88%, 5. రష్యా 4.21%, 6. కాంగో(డె.రి.) 3.32%, 7. అర్జెంటీనా 1.57%, 8. చైనా 1.41%, 9. మెక్సికో 1.04%, 10. కజఖస్తాన్ 0.92%, 11. ఆస్ట్రేలియా 0.76%, 12. బ్రెజిల్ 0.65%, 13. సౌదీ అరేబియా 0.0%.ఇక, ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ లెక్కల ప్రకారం వివిధ అగ్రరాజ్యాల భూవైశాల్యంలో సాగుభూమి సగటు విస్తీర్ణంలో ఇండియాదే అగ్ర స్థానం: ఉదా.ఇండియా 52.8%, అమెరికా సం.రా. 16.6%, అర్జెంటీనా 14.5%, ఇండోనేసియా13.0%, కజఖస్తాన్10.9%, బ్రెజిల్ 9.1%, రష్యా 7.5%, ఆస్ట్రేలియా 6.0%, కెనడా 5.0%, కాంగో(డె.రి) 3.1%, అల్జీరియా 3.1%, చైనా 3.0%, సౌదీ అరేబియా 1.4%. ఇండియా కంటే కొద్దిగా ముందున్నవి అతి చిన్న దేశాలైన బంగ్లాదేశ్ (59%), డెన్మార్క్(56.7%), ఉక్రెయిన్ (56.2%), మొల్డోవ(55.2%) మాత్రమే. ప్రాణుల జీవనాధారానికీ పంటలు పండడానికీ భూమిమీద ఉన్న నీటివనరులేగాక యేడాది పొడవూతా కురిసే వర్షపాతం కూడా అత్యవసరం. ప్రపంచ దేశాల జాతీయ తలసరి ఆదాయం దీనిమీదే ఆధారపడివుంటుంది. ప్రపంచం మొత్తమ్మీద వైశాల్యంలో అతి పెద్దవైన డజను ప్రధాన దేశాల సాంవత్స రిక సగటు వర్షపాతం : బ్రెజిల్1,761, కాంగో 1,543, ఇండియా 1,083 మి.మీ.తో మొదటివరసలో ఉండగా అమెరికా715, చైనా 645, అర్జెంటీనా 591, కెనడా537, ఆస్ట్రేలియా 534, రష్యా 460 మి.మీ.తో రెండవవరసలోనూ, కజఖస్తాన్ 250, అల్జీరియా 89, సౌదీ అరేబియా 59 మి.మీ.తో అతితక్కువ వర్షపాతంతో అట్ట డుగు స్థాయిలో ఉన్నాయి.

ఇక, ఇతర వాతావరణ అంశాల వంటిదే సూర్యరశ్మి కూడా. మానవజాతి మనుగడకూ వృక్ష సంపద పెరుగుదలకూ ఎండ అవ సరం ఉంది. ఈ భూమిపై వృక్షసంపద పెరుగుదల మొత్తం ఎక్కువగా సౌరశక్తిచే ప్రభావితమైనదే. దీర్ఘసూర్యరశ్మి గలిగిన పగళ్లతో పంటలు వేగంగా పెరుగుతాయి. అతి తక్కువ కాలంలో పరిపక్వతకు చేరు కుంటాయి. ఎండ చాలా తక్కువ కాసే ప్రదేశాలలో మొక్కలూ జంతు వులలో వ్యాధులు అధికం. అందువలన, మొక్కలకూ అలాగే మానవ కార్యకలాపాల కోసం ఏడాది పొడవునా సూర్యరశ్మి కొంత ఎక్కువగా అవసరం. భారత దేశమంతటా సంవత్సరంలో అధిక భాగం రోజుకు సగటున పన్నెండు గంటలపాటు ఎండకాయడం ప్రకృతి సిద్ధ వనరుల లభ్యతకు నిదర్శనం. సగటు వర్షపాతంలోనూ, సాగునేల విస్తీర్ణం లోనూ, నీటివనరులలోనూ, ఎండకాసే వ్యవధిలోనూ అన్నింటా తక్కువే వున్న అమెరికా, ఆస్ట్రేలియా, కెనడాలు కోట్లల్లో వలసవచ్చే భారత జనాభాను ఆదరించి ఆశ్రయమివ్వగల సత్తా కలిగినవని చెప్పలేము. ఈ గణాంకాలను పరిశీలించినవారు ఎవరైనా హేతుబద్ధ తార్కిక బుద్ధితో ఆలోచించేవారు ఎవరూ మన దుకాణం కట్టేసి వలసపోదాం అనరు.

అమెరికా 1917,1924లోతెచ్చిన నిర్బంధ వలస చట్టాలు, అమెరికా సంయుక్తరాష్ట్రాలకు ఆసియా నుండి సాగే వలసలను నిషేధ స్థాయికి తెచ్చాయి. ఇక భారతదేశం నుండి వలస ఇప్పటికే అతి తక్కువ స్థాయిలోకిచేరింది. ఉదా. **2013 వరకూ అమెరికాకు వలస వచ్చిన 4.5 కోట్ల విదేశీయులలో భారతీయుల శాతం 4.7 మాత్రమే. అంటే షుమారు 21 లక్షలు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు భారతీ యుల పట్ల చూపించే వివక్షకు తార్కాణం ఇది. మిగిలిన 4.30 కోట్లమందిలో ఎక్కువమంది ద. అమెరికా, యూరపు నుండీ కాగా బహు తక్కువమంది మాత్రమే ఆసియా ఆఫ్రికా నుండి. ఎంత వివక్ష! వీళ్ళా మిలియన్లకొద్దీ ఇండియన్లను ఆదరించి ఆశ్రయమిచ్చేవారు. ఇక ఆస్ట్రేలియా కెనడా సంగతులు చెప్పనవసరమే లేదు. ఈ దేశాల వలస చట్టాలు బాహాటంగానే ఆసియా ఆఫ్రికావారిపై నిర్బంధాలను అమలుపరుస్తున్నాయి. మరి ఈ పరిస్థితులలో ఈ అసత్య అశాస్త్రీయ ఆధారాలతో ఇంగ్లీషు మాధ్యమ ఉద్యమ ప్రచారం దేనికోసం. ఏం ఆశించి చేస్తున్నారు. ఎందుకు చేస్తున్నట్టు. ఏ లాభం ఆశించి చేస్తున్నారు.**

భారతదేశానికి అనాది కాలం నుండి అనేక జాతులూ, మతాలూ ఇతర సముదాయాలవారు రావడం, వీలుంటే దోచుకుపోవడం లేదంటే ఇక్కడే తిష్టవేయడానికి ఈ దేశ సహజ సంపదల ఆకర్షణే ప్రధాన కారణం. నేటి పేదల కడగండ్లు, ప్రకృతిక వనరులూ సహజ సంపదలూ లేకకాదు స్వార్థపరుల రాజకీయాలూ కొందరి అంతులేని ధనదాహం వలననే. ఇంగ్లీషు నేర్చుకొని సొంతదంతా వదులుకొని పొట్టచేతబట్టుకొని వలస పొమ్మనడం కంటే ఇంటి సంపదను అంద రికీ అందుబాటులోకి తీసుకురావడం అవసరం. దీనికి ఇంగ్లీషు మాధ్యమ విద్య అవసరం లేదు. వేల యేండ్లకిందటే మనతో పుట్టి, మనమధ్య వికసించి మన జీవితంతో పెనవేసుకొని మన జీవనంలో కలగలిసి మనతో మమేకమైన తెలుగును ఒక్క కలంపోటుతో పక్కన పెట్టి ఇంగ్లీషు మాధ్యమానికి తలవూపడం అవివేకం, అనాలోచితం.

ఇప్పటికే కార్పొరేట్ స్కూళ్లలో ఇంటర్‌లో తెలుగు లేకుండా చేశాం. దీనితో, తెలుగులో చదవడం రాయడం తగ్గడంతో పిల్లలు మన నడత, నడవడిక, మనం బతుకుతున్న వైనం, మన కుటుంబ సభ్యులతో పెద్దా చిన్నా తేడాలతో మెలిగే తీరూ తిప్పలూ తెలియ కుండా పోవడం మొదలైంది. తెలుగులో మన జీవన విధానాన్ని ప్రతిబింబించే రచనలను చదవడం తగ్గడంతో ఒకరితో ఒకరు మెల గడం మసులుకోవడం తెలియకుండా పోతోంది. నేడు మన కళ్ల ముందు జరుగుతున్న ఘోరాలూ నేరాలూ, హత్యలూఆత్మహత్యలూ, హింసా ప్రతిహింసా రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. పిల్లలూ పెద్ద లని తేడా లేకుండా ఓర్పును కోల్పోతున్నాం. తల్లిదండ్రులు కోప్పడి తేనో మార్కులు తక్కువ వచ్చినై అనో పిల్లలు ఆత్మహత్యలు చేసు కోవడం తనను కాదన్న ఆడపిల్లపై అమ్లదాడికి దిగడం మన సమా జంలో తలెత్తుతున్న సహన హననాన్ని తెలుపుతున్నాయి. మాతృ భాషలో మానవీయ విలువలున్న సాహిత్యాన్ని చదివించాల్సిన సమ యాన్ని మనం కుదించివేశాం. నిర్దిష్టమైన ఆశయాలనూ సమాజంలో ఉమ్మడి బాధ్యతలనూ పాఠ్యపుస్తకాలలో విపులంగా చర్చించకుండా తరువాతవచ్చే దుష్పరిణామాలపై తలలుపట్టుకోవడం చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోవడమే ఔతుంది. ఇట్లాంటి సామాజిక




దుష్పరిణామాలను నివారించడానికి మాతృభాషా మాధ్యమం అత్యంత ఆవశ్యకం. పిల్లలకు బడిలో నేర్పినదానికీ ఇంట్లోనూ తన చుట్టూవున్న సమాజంలోనూ తను పాటించాల్సిన మానవీయ విలువలకు పొంతన ఉండాలి. బడిలో ఎంతసేపూ మానవ సంబంధాల బోధనను చులకనచేసి చిన్నచూపు చూస్తూ సమాజంతో మంచిగా మెలగాలని కోరుకోవడం ఒక భ్రమే ఔతుంది. **మన సమాజంలోనూ కుటుంబాల లోనూ వ్యక్తుల హక్కులనూ సామాజిక బాధ్యతలనూ గుర్తిస్తూ మాన వీయ విలువలను పాటించే ఓర్పునూనేర్పునూ మాతృభాషద్వారానే నేర్పించాలి. ఇది తల్లి ఒడిలోనే మొదలౌతుంది. మధ్యలో ఆంగ్లభాష పెత్తనం ఎందుకు?**

ఇక తెలుగువదిలి ఇంగ్లీషు నేర్చుకుంటే ఉద్యోగాలు వస్తాయి ఆర్థిక పరిస్థితులు మెరుగౌతాయి అనడం పచ్చి అబద్ధమే. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా నివేదిక 2014-15 గణాంకాల ప్రకారం భారత స్థూల జాతీయ ఉత్పత్తిలో వ్యవసాయం 17.01%, పరిశ్రమలు 30.02%, సేవలు 52.97% (నిర్మాణం, వాణిజ్య-వ్యాపారాలు, హోటళ్లు-రెస్టారెంట్లు, రవాణా, నిలువలూ, సమాచార ప్రసారం, సామాజిక సేవ, బీమా రంగాలు). ఈ గణాంకాలను ఎలా విశ్లేషిస్తాం. ఉద్యోగ రంగ సమాచార వ్యవస్థ : ఉద్యోగ మంత్రిత్వ శాఖవారు విడుదలచేసిన నివేదికలో భారతదేశంలో 52.85% ప్రజలు వ్యవసాయరంగంలోనూ, 24.08% సేవారంగంలోనూ, 23.07% ఉత్పాదక, అనుత్పాదక నిర్మాణ వాణిజ్య రంగాలలోనూ ఉపాధి పొందుతున్నారు. అంటే వ్యవసాయరంగంలో తెలుగూ తదితర భారతీయభాషలనే గానీ ఇంగ్లీషు వాడరు గదా. సేవారంగంలోనూ భారతీయ భాషలనే ఎక్కువగా వాడతాం, ఇంగ్లీషు వాడకం తక్కువ. మిగిలిన ఉత్పాదక, అనుత్పాదక నిర్మాణ రంగాలలో ఎక్కువ శాతం భారతీయ భాషలను వాడినా చెప్పుకోదగిన స్థాయిలో ఇంగ్లీషు వాడకం ఉంది ఐతే అది పైస్థాయిలలోనే. అంటే మన స్థూలజాతీయ ఉత్పత్తికి ప్రధానాధారం భారతీయ భాషలేగానీ ఇంగ్లీషుకాదు అని తెలుస్తోంది కదా. మరి మన ఉత్పాదక శక్తికి ఆలంబనగా నిలిచి దేశాభివృద్ధికి తోడ్పడే తెలుగూ తదితర భారతీయ భాషలను వదిలివేయాలనే ఆలో చనా సరళి అశాస్త్రీయంగాక ఏమౌతుంది.

ఇక విదేశాలకు వెళ్లిన మనవారు ప్రపంచం నలుమూలలా ఉద్యోగం చేసి సంపాదిస్తున్నది ఎంత? స్థూల జాతీయ ఉత్పత్తికి ప్రవాస భారతీయుల వాటా 4% మాత్రమే. ఇందులోనూ తక్కువ నైపుణ్యాలు ఉన్నవారూ, అర్ధనైపుణ్యంగలవారే ఎక్కువ. మన ప్రవాస భారతీయులు ఎక్కువగా ఆసియా, మధ్యప్రాచ్యదేశాలలోనే ఉద్యో గాలను వెతుక్కొంటున్నారు. అంటే వీరిలో ఎక్కువమందికి ఆంగ్లభాషా మాధ్యమంతో పనిలేదు. ఐతే, ఇంగ్లీషూ ఇతర విదేశీ భాషలు నేర్చు కొనే సౌకర్యం కావాలి.

తెలుగూ తదితర భారతీయ భాషల స్థానే ఇంగ్లీషును ప్రవేశ పెడితే జరిగే ఘోర విధ్వంసానికి గురయ్యేది సినిమా పరిశ్రమ, ఇంకా దాని ఆధారంగా చేసుకొని నడుస్తున్న బుల్లితెర పరిశ్రమ. సంవత్సరానికి 16,250 కోట్ల వ్యాపారానికి చేరిన సినిమా పరిశ్రమ లక్షలాది మందికి ఉపాధి కల్పిస్తోంది. భారతీయ సినిమా పరిశ్రమలో ఎక్కువ సినిమాలతో, ఎక్కువ థియేటర్లతో ప్రపంచంలోనే ముందున్నది తెలుగు సినిమా. తెలుగును పక్కనబెడితే తెలుగు సినిమా పరిశ్రమను

# మూలకణం అమూల్యవరం

పుట్టిన ప్రతి శిశువు మూలకణాలను భద్రపరచటం వారి జీవితానికి ఆరోగ్యానికి ఎంతో అవసరం.

ఇవి ఇప్పటి వైద్యశాస్త్ర పరంగా తాజాగా వినిపిస్తున్న విషయాలు. అసలు మూలకణం అంటే ఏమిటో? అవి ఎక్కడుంటాయో? ఎక్కడి నుంచి తీసి భద్రపరచాలో ఇవన్నీ మన ముందుతరాల వాళ్లు మనకంటే విజ్ఞానశాస్త్ర వేత్తలకంటే వైద్యుల కంటే ముందే గ్రహించి భద్రపరచి చూపారు.

నవజాత శిశువు బొడ్డుకోయగానే అందులోని కణాలను తీసి నిల్వచేయటం ప్రస్తుతం ప్రతి ఆసుపత్రిలోనూ జరుగుతున్న ప్రక్రియ. అందుకోసం ప్రత్యేక పద్ధతులు గదులు రసాయనాలు ఏవేవో వాడుతున్నారు ఆధునిక పద్ధతిలో.

ఇవేవీ తెలియని రోజుల్లోనే మన తాతయ్యలు మామ్మలు ఇంటిలోనే తెలియని రోజుల్లోనే మంత్రసాని చేత ప్రసంగాలు చేయించిన కాలంలోనే, బిడ్డ బొడ్డు కోశాక ఒక అంగుళం మేర శిశువుకి వదిలివేసేవారు. ఆ బొడ్డు కొన్నాళ్లయ్యాక వారం పదిరోజులలో వాడి ఊడిపోతుంది. ఈ ఊడిపోయిన బొడ్డు తీసి పసుపు, తులసి ఆకు రసం, పచ్చకర్పూరం (కొందరు) కలిపిన లేపనం పట్టించి వెండి, లేదా రాగి గొట్టంలో ఉంచేవారు. అది జీవకణం కాబట్టి ప్రాణాధారమైన అక్షతలు (బియ్యపు గింజలు) కొన్ని వేసి మరీ ఉంచేవారు. దానిని ఆబిడ్డ మొగబిడ్డ అయితే మొలత్రాటికి, ఆడపిల్లయితే ఒక ఎర్రని నూలు లేదాపట్టు దారానికి "తాయెత్తు" రూపంలో వ్రేలాడదీసి ఉంచేసేవారు ఆ బొడ్డుగల వ్యక్తికి ఏదైనా తీవ్ర అనారోగ్యం కలిగినా లేదా ఆ ఊరిలో అంటువ్యాధులు మశూచి, కలరా, టైఫాయిడు, అమ్మవారు వంటివి వ్యాపించినపుడు ఆ తాయెత్తులో ఉన్న బొడ్డును తీసి కాచిచల్లార్చిన నీటిలో కాసేపు వేసి మళ్లీ దానిని యధావిధంగా తాయెత్తులో ఉంచేవారు. ఆ నీటిని ఆ బిడ్డకు తాగించేవారు. ఏవ్యాధీ దరిచేరదని, ఒకవేళ వ్యాధిగ్రస్తులైతే కోలుకుంటారనే విశ్వాసంతో అలా చేసేవారు. "వెండి" ఉష్ణోగ్రతను నిలుపుకునే శక్తిగల లోహం. అదేవిధంగా పసుపు, తులసిలలో ఉన్న పవిత్ర ఔషధ గుణాలు మనకి తెలుసు. పచ్చకర్పూరం వ్యాధి నిరోధకతకు చక్కగా పనిచేస్తుందని ఆలయాలలో తీర్థంలో అందుకే వాడతారని ఈమధ్యనే శాస్త్రజ్ఞులు అంగీకరించారు.

ఈ కారణాల చేత మూలకణాన్ని భద్రపరచేందుకు ఈ మూడింటిని మన పూర్వీకులు ఉపయోగించేవారు. మరి పాత పద్ధతులను చాదస్తమని కొట్టిపారేసే వారికి ఈ విషయం అర్థమవుతుందో లేదో?

భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలలో అవి అచ్చంగ పట్టుకుని పాటించే తెలుగు లోగిళ్లలో ఎన్ని విజ్ఞాన విశేషాలున్నాయో తెలుపుటకే ఈ విషయాన్ని వివరంగా వ్రాశాను.

**–కోడూరు సుమన,** 94904 01968

ఘోర విధ్వంసానికి గురిచేసినట్లే. తెలుగు సినిమాను నాశనంచేసి ఇంగ్లీషు సినిమాలను తీసుకువచ్చే ప్రయత్నం వెనుక ఓ అంతర్జాతీయ కుట్రఉండివుండాలి. ఇది చిత్రపరిశ్రమపై ఆధారపడి జీవించే లక్షలాదిమంది జీవితాలను తొక్కివేసినట్లే. వేలాదిమంది కళాకారులూ సాంకేతికనిపుణులూ శ్రామికులూ రోడ్డునబడతారు.

ఈ విధ్వంసం ఇక్కడితో ఆగదు. భారతీయ ముద్రణా పరిశ్రమ వ్యాపారం యేడాదికి దాదాపు 25వేలకోట్లకు చేరుకుంది. ప్రపంచం లోనే ఎక్కువ అచ్చుయంత్రాలు ఉన్న దేశంమనది. దీనిద్వారా షుమారు 25లక్షలమంది ఉపాధి పొందుతున్నారు. ముందుముందు ప్రపంచంలోనే మొదటిస్థానానికి చేరుకోబోతున్న పరిశ్రమ ఇది. ఇక ఇంగ్లీషు మాధ్యమం వస్తే వేలాది రచయితలూ, లక్షలాది ఉద్యోగులూ పనిలేక మూలన కూర్చోవలసిందే. అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా మొదలైన దేశాలలో కుర్చొని రాసిందే అచ్చుయ్యి మనముందుకు వస్తుంది. మన జనవిధ్వంసానికి ఇంతకన్నా ఏంకావాలి. ఇంగ్లీషు మీడియం భారతదేశానికి అణుబాంబే. దానితో ఎన్నో దేశీయ పరిశ్రమలు మూలబడతాయి. లక్షలాదిమంది ఉద్యోగస్తులు ఉపాధి కోల్పోతారు. ఈ జీవ విధ్వంసాన్ని ఎలాగైనా ఆపాలి.

**మాధ్యమిక స్థాయి వరకూ విద్య పూర్తిగా ప్రభుత్వ అజమాయిషీలో ఉచిత విద్యావిధానంలో నడవాలి. తెలుగు మాధ్యమంలోనే ఉండాలి. దీనివలన పసివయసులో విద్యార్థులమధ్య ప్రభుత్వ బడుల విద్యార్థులనీ కార్పోరేట్ బడుల విద్యార్థులనే భేదభావం రాదు. సమాజంలో చిన్నతనం నుండే ఏర్పడే వైరుధ్య భావాలను కొంత వరకైనా నివారించినవాళ్లం ఔతాం. జపానూ చైనాలు ఇట్లాంటి విద్యావ్యవస్థనే నడుపుతున్నాయి. ఒకవేళ మైనారిటీ సముదాయాల వారూ ఇతర ప్రైవేటు విద్యాసంస్థలూ ఇలాంటి బడులు నడపాలంటే ప్రభుత్వ గుర్తింపుతో నడపవచ్చు కానీ విద్యార్థులనుండి ఎలాంటి రుసుమునూ వసూలు చేయరాదు. ఇంగ్లీషూ తదితర భాషలు ప్రత్యేక విషయాలుగా మాత్రమే ఉండాలి. ప్రతి స్కూలులోనూ అది ఉన్న స్థానిక జనాభా ప్రాతిపదికన మాత్రమే తెలుగేతర మాధ్యమాన్ని ప్రవేశపెట్టాలి. మనకందరికీ పుట్టుకతో వచ్చి తల్లి ఒడిలోనూ బడిలోనూ మనతో ఉండి మనకు ఇంత మానసిక ధైర్యాన్ని కలిగించి నేర్పినదాన్ని రాయడానికీ చెప్పడానికి వీలు కలిగేది తెలుగులోనే. మాతృభాషలో భావప్రకటన స్వేచ్ఛకు సంకేతం. కొత్త విషయాల ఆవిష్కరణకు మాతృభాష చిరునామా.** ❋

రచయిత భాషాశాస్త్ర ఆచార్యులు, హైదరాబాద్ విశ్వవిద్యాలయం

*(ఇందులో ఎక్కువభాగం ఆంధ్రజ్యోతి దినపత్రికలో జులై 10వ తేదీన ప్రచురించారు. వారికి ధన్యవాదాలతో..)*

-సింగమనేని నారాయణ
94934 23442

# మాతృభాష-ప్రపంచీకరణ

**"ప**ల్లె కన్నీరు పెడుతోంది... కనిపించని కుట్రల-" అన్న గోరటి వెంకన్న పాటను మనమందరం ఎన్నోసార్లు విన్నాము. ఈ పాట చరణం మన విద్యారంగానికి కూడా వర్తిస్తుంది. "విద్యారంగం కన్నీరు పెడుతోంది-కనిపించని కుట్రల" అన్న మాటను ఈనాడు పాటగా పాడుకోవాల్సి వస్తున్నది! విద్యారంగం కన్నీటి వెనుక కూడా ఒక కుట్ర ఉన్నది. ఏమిటా కుట్ర? ఎవరా కుట్రదారులు? ఆ కుట్ర వల్ల ప్రయోజనం పొందుతున్నది ఎవరు?

* * *

"ప్రపంచీకరణ" అనే మాటను గత రెండు దశాబ్దాలుగా మనం ఎక్కువగా వింటున్నాము. నిజానికి "ప్రపంచీకరణ" అనేది ఇప్పుడిప్పుడే మొదలైనదేమీ కాదు. "మితిమీరిన ఉత్పత్తి అనే అంటు జాడ్యం" ఈ ప్రపంచీకరణకు మూలం! సరుకుల ఉత్పత్తిదారులైన పెట్టుబడిదారులకు, తమ మితిమీరిన ఉత్పత్తులను అమ్ముకోవడం కోసం, నిరంతరం పెరుగుతూవుండే 'మార్కెట్' అవసరం! "ఆ అవసరం అతడిని, ప్రపంచంలోని అన్నిదేశాలకూ తరుముతుంది. అది ప్రతిచోటా తిష్ఠవేయాలి. ప్రతిచోటా కాలుపెట్టాలి. ప్రతిచోటా సంబంధాలు పెంచుకోవాలి" పెట్టుబడిదారీ విధానానిది విశ్వవ్యాప్తమైన ఉత్పత్తి గనుక, అది పెట్టుబడిదారీ సంస్కృతిని కూడా ప్రపంచవ్యాప్తం చేస్తుంది.

గడిచిన రెండు దశాబ్దాలకాలంలోనూ ఉత్పత్తుల సంబంధాల వల్ల కలిగిన మార్పులు మరింత వేగవంతమైనాయి. 1991వ సం॥లో దేశంలో ప్రవేశపెట్టబడిన సరళీకృత ఆర్థిక విధానాలు, సమాజంలో పెనుమార్పులను తీసుకువచ్చాయి. ప్రపంచీకరణ పేరుతో ఒక నూతన ఆర్థిక వలసవాదం దేశంలోకి చొరబడింది. యావత్ప్రపంచాన్ని ఒకే ఒక్క స్వేచ్ఛాయుత మార్కెట్‌గా మార్చడం దీని లక్ష్యం! అభివృద్ధి చెందుతున్న దేశాల మార్కెట్లకు ద్వారాలు తెరిపించడం, ప్రపంచీకరణ మొక్క అంతస్సారం! దైనందిన జీవిత యథార్థాల నుండి ప్రజలను పక్కదోవ పట్టించడం దీని ధ్యేయంగా ఉంటుంది. ప్రసార మాధ్యమాలు ఈ ప్రక్రియను తీవ్రతరం, శీఘ్రతరం, సులభతరం చేశాయి. ప్రజల మెదళ్లలో మార్కెట్‌ను నింపటాన్ని ఇవి టార్గెట్ చేసుకుంటాయి.

"సామ్రాజ్యవాదులు తమ సరుకులను, పెట్టుబడులనూ ఇతర దేశాల్లోకి స్వేచ్ఛగా ఎగుమతి చేసుకోటానికి, తద్వారా లాభాలు గడించటానికి ఆయా ప్రభుత్వాల మీద ఒత్తిడి తెచ్చి చట్టాలు చేయించగలరు. ఆయా దేశాల ఆర్థికవ్యవస్థల ద్వారాలు తెరిపించగలరు. కాని ప్రజల చేత తమ సరుకులను కొనిపించాలంటే, చట్టాలు, ఒత్తిళ్లు వల్ల అయ్యే పని గాదు. ప్రజల అలవాట్లు, ఆచారాలు మార్చివేయాలి. తమ సరుకులను కొనేట్టు చేసే మానసిక పరిస్థితిని వారిలో సృష్టించాలి.



అంటే వారి సంస్కృతిని మారిస్తేగాని వారి చేత సామ్రాజ్యవాదులు తమ వస్తువులు కొనిపించలేరు. అందుకే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ముందుగా సాంస్కృతిక ప్రపంచీకరణతో తమ పని ప్రారంభిస్తుంది. ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను తనకు అనుకూలంగా మార్చాలంటే ఆయా సమాజాల్లోని ప్రజల దేశీయ భాషలను, సంస్కృతీ సంప్రదాయాలను రూపాంతరం చెందించి తనకు అనుకూలంగా మార్చుకోవాలి" ('ప్రజాశక్తి' ప్రచురణల నుండి)

ఆ పని ఎలా జరుగుతుంది?

ఏ దేశ సంస్కృతి అయినా, అది ఆ దేశపు మాతృభాషను ఆవరించుకొని ఉంటుంది. అందువల్ల ఈ దేశపు సంస్కృతిని దెబ్బ తీయాలంటే మొట్టమొదటి వేటు ఆ దేశాల 'మాతృభాషల' మీద పడాలి. మాతృభాషల స్థానంలో ఇంగ్లీషును నింపాలి. తమ మాతృభాషను, తమ ఆచార వ్యవహారాలను, కట్టుబాట్లను, తిండితీర్థాలను, ఆ దేశప్రజలు తక్కువగా చూసేలా, వాళ్ల మనస్తత్వాన్ని మార్చాలి. ఇందుకు మార్కెట్ భాష అయిన ఇంగ్లీషును, మాతృభాషల స్థానంలో ప్రవేశపెట్టాలి. ప్రభుత్వాల ద్వారా ఈ పని జరిపించాలి. విద్యారంగంలో మొట్టమొదట ఈ పనిని ప్రారంభింపచేయాలి. చాలా జాగ్రత్తగా గమనిస్తే, ఈ పని, దేశంలో సరళీకృత ఆర్థికవిధానాలు ప్రారంభమైన తర్వాతనే మొదలు పెట్టారు అని మనకు అర్థమవుతుంది. అంతవరకూ ఇంగ్లీషు మాధ్యమం స్థానంలో మాతృభాష మాధ్యమాన్ని అమలుపరుస్తున్న ప్రభుత్వాలు అకస్మాత్తుగా మాతృభాషా మాధ్యమం స్థానంలో, ఇంగ్లీషును బలవంతంగా రుద్దటానికి గల కారణం, ఆర్థిక విధానాలలో చోటు చేసుకున్న మార్పులే, మాతృభాషా మాధ్యమాన్ని నీరసపరచి, ఆంగ్లభాషా మాధ్యమాన్ని ప్రోత్సహించే కుట్రలో భాగంగానే, వేలాది ఇంగ్లీషు మీడియం పాఠశాలలకు ప్రభుత్వం ఉదారంగా లైసెన్స్‌లు ఇచ్చేసింది! ఇంగ్లీషు భాష ఒక్కటే గొప్ప భాష అనీ, అది నేర్వనివాడు వెధవై పోతాడనీ, ఏ ఉద్యోగానికైనా, ఇంగ్లీషు తప్పక వచ్చి ఉండాలని, ఒక మిథ్యావాదనను క్రమంగా ఈ పాతికేళ్లలో ప్రచారం చేసి, ప్రజల మెదళ్లలోకి బలవంతంగా చొప్పించింది. ఆ కారణంగానే ప్రభుత్వ పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులే, తమ పిల్లలను ప్రైవేట్ ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో చదివిస్తున్నారంటే ఇక సాధారణ ప్రజల గురించి చెప్పాల్సిన పని లేదు.

ఎప్పుడైతే మాతృభాషా మాధ్యమం నీరసించి, ఆంగ్లభాషా మాధ్యమం విద్యాబోధనలో చోటు చేసుకుందో, అప్పటి నుండే, దేశీయమైన సంస్కృతి క్రమంగా బీటలు వారటం మొదలైంది. దాని స్థానంలో మార్కెట్ సంస్కృతి కొత్తతరం మెదళ్లలో భూతమై కూచుంది. ఎల్.కె.జి నుండీ ఆంగ్లభాషా మాధ్యమంలో చదివే పిల్లల ఆలోచనా విధానమే మారిపోయింది. వాళ్లకు కుటుంబ సంబంధాల పట్ల ఆసక్తి ఉండదు. బూట్లతో, టైలతో, బండెడు పుస్తకాలతో ప్రారంభమయ్యే వాళ్ల చదువు సహజంగానే వాళ్ల ఆసక్తులను మార్చివేసింది. చదువంటే ఇంగ్లీషేననీ, చదువనేది సంపాదన కోసమేననీ, సంపాదన అనేది, మార్కెట్‌ను ఇంట్లో నింపుకోటానికేననే భావజాలం చాలా చిన్నవయసులోనే వాళ్ల మనసుల్లో నాటుకు పోయింది. సహజంగానే మాతృభాష పట్ల చిన్నచూపు ఆ పిల్లలకు ఏర్పడుతుంది. ఆ చిన్న చూపే మాతృభాషల చుట్టు ఆవరించుకొని వున్న సంస్కృతిపై కూడా పడుతుంది. వాళ్లు చదివే ఇంగ్లీషు భాష వాస్తవంకాని ఆశలను వాళ్లలో రేకెత్తిస్తుంది. పదేళ్లకే సెల్‌ఫోన్లూ, 15 ఏళ్ళకే ద్విచక్ర వాహనం, బోలెడు డ్రస్సులూ, అలంకార సామగ్రీ, మోజూ, లగ్జరీ గూడ్సూ, యివే ప్రపంచంగా ఒక నూతన యువతరం తయారుకావటం వెనుక దాగి వున్నది ప్రపంచీకరణ మార్కెట్ కుట్రే!

తల్లిదండ్రుల్లో కూడా తమ పిల్లలు ఇంగ్లీషు పిల్లలు కావటమే ఇష్టంగా ఒక కుహనా భావజాలం, ఇదే సందర్భంలో రూపుదిద్దుకుంటుంది. చిన్నప్పట్నుంచే పిల్లల్ని మాతృభాషకు దూరంచేయటం వల్ల తమకు తెలియకుండానే ఒక సాంస్కృతిక ద్రోహానికి పాల్పడుతున్నారు. చిన్నప్పట్నుంచే తమ పిల్లల్ని మార్కెట్ దాసులుగా తయారుచేయటం ఇక్కడి నుండే ప్రారంభమైతుంది. పెద్దపెద్ద చదువులు, పెద్దపెద్ద ఉద్యోగాలూ, పెద్దపెద్ద సంపాదనలు, పెద్దపెద్ద హోదాలు, పెద్దపెద్ద వస్తువ్యామోహ సంస్కృతితో జీవించాలనుకోవడం ఇవన్నీ కార్పొరేట్ విద్యావిధానం నేర్పే కుహనా విలువలు. ఈ విలువలతో ప్రారంభమైన వీళ్ల భవిష్యత్తు, అంతిమంగా, మానవసంబంధాలన్నీ మార్కెట్ సంబంధాలుగా ఘనీభవింపజేస్తుంది.

మాతృభాషను హతమారిస్తే తప్ప, దేశీయమైన సంస్కృతి నాశనంగాదు. దేశీయమైన సంస్కృతిని నాశనంచేస్తే తప్ప మార్కెట్ సంస్కృతి మెదళ్లలో చోటు చేసుకోదు. ప్రపంచీకరణ కుట్ర ఇది! కంటికి కనిపించని కుట్ర ఇది! చాలా జాగ్రత్తగా గమనిస్తే తప్ప అర్థం గాని కుట్ర ఇది! ప్రభుత్వాలను లొంగదీసుకొని ప్రభుత్వాలతో చట్టాలు చేయించి, విద్యారంగంను నాశనంచేస్తున్న కుట్ర ఇది. బిచ్చికంగా ప్రజల మనసుల్ని లొంగదీసుకొనే కుట్ర ఇది! ఆ కుట్ర మొదట విద్యారంగంలో ప్రారంభమౌతుంది. మాతృభాషల నాశనంతో ప్రారంభమౌతుంది.

ఈ కుట్రను భగ్నం చేస్తే తప్ప విద్యారంగం బాగుపడదు. దీన్ని ఎదిరిస్తే తప్ప, మాతృభాషలు బతకవు. దీన్ని నిలవరిస్తే తప్ప దేశీయమైన సంస్కృతి బతకదు.

అన్ని ఉపాధ్యాయ సంఘాలూ, విద్యార్థి సంఘాలూ, ప్రజా సంఘాలూ, ప్రజల మేలు కోరే రాజకీయ పార్టీలూ సంఘటితమై, ఒక త్రాటి మీది కొచ్చి పోరాటం చేసినప్పుడే, మాతృభాషా మాధ్యమాన్ని బతికించకోగలుగుతాము. ప్రపంచీకరణ కుట్రను భగ్నం చేయగలుగుతాము.

(జనసాహితి ప్రచురణ–
"మాతృభాషా మాధ్యమమే ఎందుకు, మరి మూడు వ్యాసాలు" పుస్తకం నుండి..ధన్యవాదాలతో..

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి–2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ–520 004.

ఇ–మెయిల్ : *editorammanudi@gmail.com*

-డా॥ మధురాంతకం నరేంద్ర
98662 43659

# ప్రాంతీయత-కొన్ని పరిమితులూ, మరికొన్ని ప్రశ్నలూ...

ఇటీవల అనంతపురం జిల్లా రచయితల సంఘం రాయలసీమ అస్తిత్వం గురించిన సమావేశమొకటి నిర్వహిస్తూ, ఆ దృక్పథంలోంచి రాయలసీమ కథానికను గురించి మాట్లాడమంటూ నన్ను ఆహ్వానించింది. ఆ సందర్భంలో మళ్ళీ ఓసారి ప్రాంతీయ అస్తిత్వాల గురించి ఆలోచించినప్పుడు, రాయలసీమ ప్రాంతపు కథానికలలో వ్యక్తమయిన అస్తిత్వ స్పృహ గురించి అధ్యయనం చేసినప్పుడు నాకు కొన్ని విషయాలు స్ఫురించాయి, అర్థమయ్యాయి.

ఆంధ్రప్రదేశ్ అంటే కోస్తా, రాయలసీమ, తెలంగాణా అనే మూడు ప్రాంతాల సమాహారమని అనుకుంటూ వుండగానే కళింగాంధ్రమంటూ నాలుగో విభాగమూ వచ్చి చేరింది. 1952లో రాష్ట్రావతరణం తరువాత చాలా రోజులపాటూ కలిసి మెలిసే జీవించిన తెలుగువాళ్ళు క్రమంగా ప్రాంతాలవాళ్ళుగా స్థిరపడ్డమూ జరిగింది. తెలుగువాళ్ళ సాంస్కృతిక జీవనంపైన రెండు జిల్లాల గుత్తాధిపత్యం పెరుగుతుందనే ఫిర్యాదులోని సహేతుకతను పరిశీలిస్తూండగానే రాయలసీమ,తెలంగాణా, కళింగాంధ్రల అస్తిత్వస్పృహ గూడా పెరుగుతూ వచ్చింది. తొలిరోజుల్లో కళింగాంధ్ర మాండలికంలో వచ్చిన రచనల్ని ప్రశ్నించని పాఠకలోకం తెలంగాణా, రాయలసీమ మాండలికాల్ని ప్రశ్నించినప్పుడు ఆ ప్రాంతపు రచయితల్లో ఆ స్పృహ మరింతగా పెరిగింది.

ఒక ప్రాంతపు కథలను సంకలనం చేయడమన్నది చాసో గారి 'కళింగ కథ'లతోనే ప్రారంభమైనా, ఒక ప్రాంతపు జీవనాన్ని నిర్దుష్టంగా సంకలనం చేయడం మాత్రం సింగమనేని నారాయణగారి 'సీమకథ'తోనే మొదలయింది. ఈ లోగా తెలంగాణా నుంచీ వార్షిక తెలంగాణా కథలు కూడా సంకలనాలుగా రాసాగాయి. ఈ పరిణామాల నంతా పరిశీలించినప్పుడు ప్రాంతీయ అస్తిత్వ వుద్యమాలు (నిజంగా వుద్యమాలేనా?) ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాల నుంచే పుట్టుకొస్తాయని అర్థమవుతోంది. కళింగాంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు కేవలం ఆర్థికంగా మాత్రమే వెనుకబడినవనీ, 1980లతరువాత గొప్ప కథా సాహిత్యమంతా ఆ మూడు ప్రాంతాల నుంచే ఎక్కువగా వచ్చిందనీ కోస్తా రచయితలూ, విమర్శకులూ గూడా వొప్పుకుంటూ వుంటారు. తొలినుంచీ అప్పుడప్పుడూ, బలహీనంగా వినబడుతూ వచ్చిన తెలంగాణా రాష్ట్ర విభజన ఉద్యమం తీవ్రమై రాష్ట్రం రెండుముక్కలుగా చీలిపోయినప్పుడు అస్తిత్వ ఉద్యమాలు మరింతంగా బలపడ్డాయి. సాంఘిక న్యాయం ఆధారంగా ప్రారంభమైన యీ ఉద్యమాలు, రాజకీయ ఉద్యమాలుగా మారి, సాహిత్య ఉద్యమాలుగా గూడా రూపుదిద్దుకున్నాయి.

రాష్ట్ర విభజన తర్వాత రాయలసీమ రాష్ట్రమనే ఉద్యమం గూడా తలెత్తుతోంది. ఈ పరిణామాల దృష్ట్యా రాయలసీమ అస్తిత్వ స్పృహ గురించిన చర్చ సాహిత్యలోకంలోకి గూడా అడుగుపెట్టింది. ఇంతకూ రాయలసీమ కంతా కలిసి వొకే రకమైన అస్తిత్వ స్పృహ వుందా అన్నది ప్రశ్న.

సమైక్యాంధ్ర ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నప్పుడు కూడా రాయలసీమ నాలుగు జిల్లాలలో రచయితలు భిన్నరీతుల్లో స్పందించడం స్పష్టాస్పష్టంగా కనబడుతుంది. అనంతపురం రచయిత మాకు వేరే రాష్ట్రమే యివ్వండని అడగడం వెనక, ఆ ప్రాంతాన్ని రాజకీయంగా పట్టించుకోలేదనీ, అక్కడి నీటిసమస్య తీవ్రతరమౌతుందనీ నిరసన తెల్పడమే ప్రధానోద్దేశం. చిత్తూరుజిల్లా వాళ్ళు కొందరు తమిళనాడులో చేరిపోతే పోగొట్టుకునేదేముందని వాపోవడానికి గూడా యిటువంటి నిరాదరణే కారణం. కర్నూలుకు తెలంగాణా పక్కనే వుండడంతో ఆ జిల్లాను తెలంగాణాలో కలిపినా బావుంటుందనుకున్నవాళ్ళు అక్కడా వున్నారు. ఎటూ చెప్పలేక మౌనంగా వుండిపోయిన వాళ్ళు కడపజిల్లా వాసులు మాత్రమే. ఈ భిన్న అభిప్రాయాలూ, ఉద్దేశాల వెనక రాయలసీమదంతా అయిన వొకేవొక సారూప్యత కోసం వెతుక్కోక తప్పడం లేదు.

రాయలసీమ సాహిత్యాన్ని సామాజిక ఆర్థిక రాజకీయ పరిశీలన చేసిన వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారు భిన్నమైన రాయలసీమ జిల్లాలనంతా వొక్కటిగా ముడిపెట్టే అంశం అక్కడి వర్షాభావమూ, నీటి సమస్య అని పేర్కొన్నారు. వ్యవసాయమూ, నీటి సమస్యా అన్నవి యిక్కడి నాలుగు జిల్లాల్లోనూ నాలుగు రకాలుగా వున్నాయి.

దేశంలోనే నదిలేని జిల్లా బహుశా చిత్తూరుజిల్లానే అయివుంటుంది. చిత్తూరు జిల్లా వ్యవసాయమంతా చెరువులపైనే ఆధారపడి వుంది. మిగిలిన మూడు జిల్లాలతో పోలిస్తే చిత్తూరుజిల్లాలో కరువు తక్కువే. ఇక్కడి వ్యవసాయం రైతులను పెద్దగా వొరిగించేదీ వుండదు, హింసించేదీ వుండదు. బావులు తవ్వుకోవడం, చెరువులు బాగుచేసుకోవడం యిక్కడి అవసరం. హె.స.భా 'పాతాళగంగ', మహేంద్ర 'ముసలమ్మ మరణం', కేశవరెడ్డి 'మూగవానిపిల్లనగ్రోవి', లంకిపల్లె 'జీవనం' కథలు ఈ విషయాన్నే చెబుతాయి. ఇక్కడి రైతు జీవిత వ్యధ చూసేవాళ్ళకు 'వినోద ప్రదర్శనం' (మధురాంతకం రాజారాం) గానే వుంటుంది. కొన్ని దశాబ్దాల క్రితం యిక్కడి చిన్న చిన్న వంకలకు, వాగులకూ ఆనకట్టలు కట్టడంతో, అవి ఎండిపోయి, వాటి పరీవాహక ప్రాంతాల్లో నీటిసమస్య పుట్టుకొచ్చింది (బంగారు సంకెళ్ళు-పులికంటి కృష్ణారెడ్డి, మునికన్నడి సేద్యం-నామిని)

కడపజిల్లాలో గూడా వ్యవసాయం కొంతవరకూ చెరువులపైన ఆధారపడి వుంది. అక్కడ పెన్న, చెయ్యేరు సంవత్సరానికోసారి మాత్రమే పారతాయి. కేతువిశ్వనాథరెడ్డిగారు 'ఒక్కవాన చాలు' అని కథ రాస్తే సన్నపరెడ్డి వెంకట్రామరెడ్డి వానలు యెక్కువగా కురిసి

నప్పుడు రైతులెలా అవస్థలు పడతారో గూడా కథలుగా రాశాడు. పి.రామకృష్ణారెడ్డి గారి పెన్నేటి కథలు 'నిదానించు యెదన్ పట్టి బదారి తమ్ముడూ!' అనే విద్వాన్ విశ్వం గారి పెన్నేటి పాటనే గుర్తుకు తెస్తాయి.

అనంతపురం జిల్లాది గూడా పెన్నేటిపాటే. అక్కడి రైతు జీవితం అదుసే(సింగమనేని నారాయణ) నీళ్ళు లేని చోట సంస్కృతి మాత్రమే ముంటుందని స్వామి వాపోతారు. అక్కడి రైతు మన్నుతిన్న మనిషి (చిలుకూరి దేవపుత్ర). కె.సి.కెనాలు పారే ప్రాంతాల్లో మాత్రం రైతులు సుఖంగా వున్నారు. ఆ ప్రాంతాల్లో భూములు కొనుక్కుని ధనవంతు లైనవారు కోస్తా వారే గావడం గమనించవలసిన అంశం.

రాయలసీమ జిల్లాల్లో కర్నూలులో మాత్రం రెండు నదు లున్నాయి. తుంగభద్ర, హంద్రీ..పలనాడు నుంచీ వచ్చి చేరిన జిల్లాల్లో వర్షాభావమే వుంది. కర్నూలు వరదల్లో మునిగినపుడు అక్కడి రచయితలు 'ముంపు' గురించి కథలు రాశారు (జి.వెంకటకృష్ణ, హరికిషన్)

చిత్తూరు జిల్లాలో వ్యవసాయం వినోద ప్రదర్శనమూ, అత్యా చారమూ అయ్యాయి. కడపజిల్లాలో నమ్ముకున్న నేల జప్తుగా తయా రయింది. అనంతపురంలో జూదంగా, అరుసుగా, వ్యసనంగా వేధి స్తోంది. కర్నూలు నుంచీ రైతు కథలు తక్కువే వచ్చాయి.

**ప్రపంచ సాహిత్యాల్లోనే రైతుపక్షం వహించి ప్రపంచీకరణకు వ్యతిరేకంగా తెలుగు కథ చేసినంత పోరాటం మరే యితర భాషా సాహిత్యంలోనూ జరిగినట్టు లేదు. తెలుగుకథలోనూ రైతు పక్షం వహించడంలో రాయలసీమదే పైచేయి.** రైతుకు అన్నదాతగా (సుంకోజు దేవేంద్రాచారి) గుర్తించి, అతడికి జరగవలసినంత న్యాయం జరగకపోతే ముప్పు వాటిల్లక తప్పదని హెచ్చరించినవాళ్ళు (ఉత్తీతకథ -గోపిని కరుణాకర్) సీమ కథకులే.

రాయలసీమ లక్షణాల్లో రెండవదిగా యెప్పుడూ పేర్కొనబడేది యిక్కడి ఫ్యాక్షన్లు. ఫ్యాక్షను గొడవలు చిత్తూరుజిల్లాలో బాగా తక్కువ. ఇక్కడి ఫ్యూడల్ కుటుంబాల్లో దుర్మార్గాలూ (అంబపలుకు- మధు రాంతకం రాజారాం) మంచితనలూ (రాతిలో తేమ-మ.రా) కలగా పులగంగా వుంటాయి. వాళ్ళ దౌర్జన్యం బీదలపట్లే గానీ, వాళ్ళలో పరస్పర కీచులాటలు (సరిహద్దు ప్రాంతాల్లో కొన్నిచోట్ల తప్ప) చాలా తక్కువ. (యుగసంధి-మధురాంతకం నరేంద్ర). ఇక్కడి నుంచీ మాత్రమే 'గాలివీడు నుంచీ అమెరికా వరకూ' లాంటి శాంతి సందేశం వెలువడే అవకాశం వుంది.

అయితే అనంతపురం ఫ్యాక్షన్లలో పరస్పర కారణాలుంటాయి. (ఫిరంగిలోజ్వరం- సింగమనేని నారాయణ) అక్కడి గొడవల్లో హరి జనులు మారణాయుధాలుగా మారతారు (ఆయుధం -దేవపుత్ర). కడపలో యిది మరింత తీవ్రతరమై కరువొచ్చే, కచ్చులూ వచ్చె (పి.రామకృష్ణ) అనుకోవాల్సి వస్తుంది. సాధారణ స్త్రీలు గూడా 'వీరనారు'లై కత్తిపైన నడవ్వలసి వస్తుంది. (సన్నపరెడ్డి) (చుక్క పొడి చింది-విశ్వప్రసాద్) ఫ్యాక్షన్ కథలు' అనే సంకలనం యీ జిల్లానుంచీ మాత్రమే రావడం కుదురుతుంది.

అయితే **ఫ్యాక్షన్ల నేపథ్యమంతా వొక్కటే గాదు. ప్రతి ఫ్యాక్షనూ వేరే రకం. వ్యక్తిగత, సాంఘిక, రాజకీయ కారణాల నుంచీ అనేక రకాలుగా కొనసాగే ఫ్యాక్షన్లకు ఏకసూత్రత లేదు. మళ్ళీ వెతికితే వీటి వెనక కనపడే వొకే కారణం కరువే కావచ్చు. కరువుల్లేని, పంటలు పండే కాలంలో రైతులకిలా గొడవలు పడే అవకాశమూ, తీరికా వుండకపోవచ్చు.**

**రాయలసీమ అస్తిత్వానికున్న మరో ముఖ్యమైన కోణం 'మాండ లిక భాష'. అయితే నాలుగు జిల్లాల మాండలికాల్లోనూ స్పష్టమైన తేడా కనపడుతుంది.** ఈ తేడా పరిశీలనగా చూస్తే మిగిలిన రాష్ట్రపు మూడు ప్రాంతాల్లోనూ యిలాంటి తేడాలే వున్నాయి. చాలాకాలం వరకూ తమ మాండలికంలో రాయడానికి సందేహించిన రాయలసీమ రచయితలు కోస్తా తెలుగుపైన ఆధారపడ్డామని వులిక్కిపడ్డారు. సిని మాలూ, పత్రికలూ ఆధారంగా **1950-80 మధ్యకాలంలో వో రక మైన ప్రామాణిక భాష వెలువడింది కానీ అది రెండు జిల్లాల భాషన్న అనుమానంతో రచయితల్లో వ్యతిరేకత గూడా వ్యక్తమయింది. అయితే ఆ ప్రామాణిక భాషలో ఎక్కువశాతం ఆ రెండు జిల్లాల భాషే అయినా, ఆ ప్రాంతపు యాసలు లేకపోవడమూ, భిన్నంగా వుండడమూ మనం గ్రహించనే లేదు. మాండలికాలతో భాషను సుసంపన్నం చేసుకోవడం యెంత అవసరమో, వీరమాండలికాల పేరుతో గోడలు నిర్మించు**

**కోవడం అంతే పొరపాటని గ్రహించితీరాలి.**

భాష గురించి మాట్లాడుకున్నప్పుడల్లా భాషా ప్రయుక్త రాష్ట్రాల నెపంతో తెలుగువాళ్ళు తమ తోటి తెలుగువాళ్ళకు చేసిన దురన్యాయం గుర్తుకొస్తుంది. ఆంధ్రనాటక పితామహుడైన ధర్మవరం కృష్ణమాచార్యులుగారి బళ్లారి యిప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో లేదు. తెలుగువాళ్ళే వున్న హోసూరు, జయపూరు, బరంపురం మొదలైన చోట్లలో యింకా తెలుగువాళ్ళు తమ మాతృభాష కోసం పోరాటాలు చేస్తూనే వున్నారు. ప్రాంతాల పేరుతో గొడవలు పడుతూ మనం తమిళనాడులో 'తెలుగు వాణి' చేస్తున్న ఉద్యమం సంగతిని గమనించలేకపోతున్నాం. **స.వెం. రమేష్ సంపాదకీయంలో వచ్చిన తొండనాడు కథలు, మొరసునాడు కథలు మన రాష్ట్ర విభజన కేవలం రాజకీయ విభజన మాత్రమేననీ, సాంస్కృతిక విభజన కానే కాదనీ నిరూపించాయి. అయితే రాజకీయ విభజనలు తెలుగువాళ్ళ సంస్కృతీ సాహిత్యాల నెంతగా అతలాకుతలం గావించాయో మనం గమనించడమే లేదు.**

రాయలసీమలోని దళిత, స్త్రీవాద, మైనారిటీ రచనలు మిగిలిన రాష్ట్రపు రచయితలకు భిన్నంగా లేవు. బహుజన సంస్కృతిని చిత్రించిన స్వామి 'అవశేషం' కథ ఆయా ప్రాంతాల జీవన మూలాలను వెతుక్కోమని హెచ్చరిస్తోంది. సన్నపరెడ్డి 'అంటు', శాంతినారాయణ 'ఉక్కుపాకం', దేవపుత్ర 'పంచమం', కేశవరెడ్డి నవలలు యీ ప్రాంతపు దళిత జీవితాన్ని సార్వజనీనంగా చిత్రించడమే చేశాయి. ప్రాంతాలు వేరయినా బాధితుల యిబ్బందుల్లో మార్పేమీ వుండదు. రాయలసీమలో హిందూ ముస్లిమ్ బాంధవ్యం ప్రేమపూర్వకంగా ముడివేసుకునే వుంది. కేతు విశ్వనాథరెడ్డి గారి 'అమ్మవారి నవ్వు', షరీఫ్ 'టోపీ జబ్బార్', నరేంద్ర 'ఒక మైనారిటీ కథ', దాదాహయత్ 'మసీదు పావురాలు' వో రకమైన సూఫీ గీతాన్నే వినిపిస్తాయి.

సమైక్యాంధ్ర ఉద్యమ సమయంలో రాయలసీమ నుంచీ సహానుభూతిలో గూడిన కథలే వచ్చాయి. హెచ్చార్కే 'ఆల్‌ఫతా హోటల్' ఆర్తితో వలసలను గురించి వివరిస్తుంది. వెంకటకృష్ణ 'వాకిలి'లో ఆస్తులు పంచుకునే అన్నదమ్ములను ప్రాంతాలకు ప్రతీకగా తెలుగుకు అమ్మను ప్రతీకగా గుర్తించాడు. రాజ్యహింసను గురించీ, ప్రజాస్వామ్యమనే నేతి బీరకాయను గురించీ రాయలసీమ కథకులు మొదటినుంచీ కథలు రాస్తూనే వున్నారు. (మృగతృష్ణ). ఇక్కడి మనుషులు జీవిక కోసం రకరకాల వలసలు వెళ్తున్నారు. (కువైట్ సావిత్రమ్మ–చక్రవేణు, కువైట్ రైలు– విష్ణుప్రియ, చోటు–నరేంద్ర) పల్లెల్లో బ్రతకలేనివాళ్ళు నగరాల్లో కూలీలై పోతున్నారు. నగరాల్లో రియల్ ఎస్టేట్ అనే కొత్త వ్యాపారమూ పుట్టుకొచ్చింది. ఇవన్నీ వేరే రూపాలతో ఇతర ప్రాంతాల్లోనూ జరుగుతున్నాయి. ప్రపంచీకరణ వల్ల రైతులు అన్ని ప్రాంతాల్లోనూ 'తెల్లదెయ్యం' (స్వామి) చేతిలో నలిగిపోతున్నారు. ఈ గొడవలకు తరుణోపాయాన్ని చెప్పిన స్వామికథ 'రంకె' అన్ని ప్రాంతాల రాజకీయ సమస్యలకూ సమాధానాన్ని చెబుతోంది.

అయితే యిటీవల స్వామి రాసిన 'నీళ్ళు' అను గ్రామవివక్ష కథ మాత్రం రాయలసీమదే అయిన నీటి సమస్యకున్న రాజకీయ పార్శ్వాన్ని విప్పి చెబుతోంది. రాయలసీమవే అయిన నీటి వ్యవసాయ సమస్యలకు మార్గాలు వెతుక్కో వలసిన అవసరాన్ని నిరూపిస్తోంది. ఈ సమస్యల పరిష్కారం ప్రత్యేక రాష్ట్ర పోరాటమేనా అన్నది మరో ప్రశ్న.



'తెలంగాణా సాహిత్య అధ్యయనం, పరిచయం, పరిధి, పద్ధతి' అనే వ్యాసంలో కాత్యాయనీ విద్మహే తెలంగాణా కోస్తా ఆంధ్రుల సంస్కృతీ సర్ప పరిష్వంగంలో యెలా విలవిలలాడిందో వివరిస్తూనే చివరిగా ఆ ప్రాంతం నుంచీ వలసలు వెళ్ళిన 'చిలకమర్తి, పానుగంటి, రాచకొండ' వంటి ప్రసిద్ధ కుటుంబాల గురించీ, ఆ ప్రాంతం నుంచి వెళ్ళిపోయిన వావిలాల, కేతవరం వంటి తెలంగాణ్యుల గురించీ ప్రస్తావించారు. **ఏ కుటుంబమూ ఐదు తరాల కాలం ఒకే చోటులో జీవించడం చాలా కష్టమని సాంఘిక శాస్త్రవేత్తలు అంటూంటారు. అందువల్ల ప్రాంతీయత యిప్పుడు జీవిస్తున్న వ్యక్తులను బట్టే గానీ, వాళ్ళ మూలాలను వెతుక్కుంటే నిరూపించబడదు.** ఏదో ఒక ప్రాంతంలో పుట్టి పెరుగుతున్న మాత్రం చేత ఆ వ్యక్తి జీవికకూ, సంస్కృతికీ, అభిరుచులకూ యిబ్బంది కలగకూడదు.

ప్రాంతీయత సాహిత్యానికి పట్టుకొమ్మ. ప్రాంతీయతను విడిచిన రచయితలందరూ నేల విడిచే సాము చేస్తారు. ఆయా ప్రాంతాల సాహిత్యాన్ని అధ్యయనం చేయడం ద్వారానే ఆయా ప్రాంతాల ప్రాంతీయతా లక్షణాలు అవగతమవుతాయి. కేవలం రాజకీయ విభజనతోనూ కొత్తరాష్ట్ర విభజన తోనూ పెద్దగా ఉపయోగాలు చేకూరుతున్నట్లయితే, ఈ ప్రాంతాలన్నీ వొకే దేశంలోనే వున్నాయా అన్న మరో ప్రశ్న ఎదురవుతుంది. రాజకీయ విభజన ప్రాంతీయతకూ, భిన్న సంస్కృతులకూ ఎటువంటి హానీ కలిగించగూడదు. అలా జరుగుతున్నట్టయితే ఆ దేశపు రాజకీయ భూమికలోనే తప్పు వుందని అర్థం. ❋

మాతృభాషల్ని అణచివేసే
ప్రభుత్వాలు ప్రజావ్యతిరేకమైనవి.
అభివృద్ధి నిరోధకమైనవి కూడ.
అలాంటి ప్రభుత్వాలను
అధికారంలో ఉండనీయకూడదు.

–ఒక సామాజిక ఉద్యమనేత

పొరుగు తెలుగు

# మహారాష్ట్రలో తెలుగువారి సాహిత్య ప్రస్థానం

-సంగెవేని రవీంద్ర,
09987145310

**తొలుత షోలాపూర్‌కు వలసవచ్చిన తెలుగువారు ఆ తర్వాత అహ్మద్‌నగర్, పుణే నగరాల గుండా ముంబయికి చేరుకున్నారు. ఏడు దీవులుగా విడివిడిగా ఉండే అప్పటి ముంబయి సముద్రపాయల్ని పూడ్చి ఏకనగరంగా తీర్చిదిద్దిన ఘనత కూడా తెలుగువారిదే. ఆధునిక ముంబయి నిర్మాతలుగా తెలుగువారు చరిత్ర పుటల్లో స్థానం సంపాదించడమే కాకుండా సాహిత్యపరంగా కూడా విశేషంగా కృషి చేశారు. ఆధునిక ముంబయి నిర్మాణం తెలుగువారి వల్లే జరిగిందని మరాఠీ చరిత్రకారులు ధృవీకరించి తెలుగువారికి అపూర్వ గౌరవాన్ని కల్పించారు. ప్రస్తుతం తెలుగు సాహితీవేత్తలు ముంబయిలో తెలుగు సాహిత్య పతాకాన్ని విజయవంతంగా ఎగరవేస్తున్నారు.**

**మహారాష్ట్రకు, తెలుగు ప్రజలకు అవినాభావ సంబంధం ఉంది. ఇది ఈనాడు ఏర్పడ్డ అనుబంధం కాదు. 9వ శతాబ్దం నుండి 14వ శతాబ్దం వరకు మహారాష్ట్ర ప్రాంతాల్ని మౌర్యులు, శాతవాహనులు, చాళుక్యులు పరిపాలించారు. కరివీర్ నగర్, కొల్హాపూర్ లాంటి ప్రాంతాల్లో జరిపిన తవ్వకాల్లో బయల్పడిన నాణాల ఆధారంగా మరాఠీ చరిత్రకారులు దీన్ని ధృవీకరించారు. ఆ కాలంలోనే తెలుగు వారు ఇక్కడకు చేరుకున్నట్టు చారిత్రక ఆధారాలు ఉన్నాయి. వీరిలో తెలంగాణ ప్రాంతానికి చెందిన తెలుగువారే ఎక్కువ. పరాయి పాలనలో తెలంగాణ ప్రాంతంలో విద్యాభ్యాసానికి తగిన ప్రోత్సాహం లేకపోవడం వల్ల మహారాష్ట్రకు వలస వచ్చిన తెలుగువారిలో ఎక్కువ శాతం నిరక్షరాస్యులే. తమ చరిత్రను తాము భద్రపరుచుకునేందుకు తగిన జాగ్రత్తలు తీసుకోకపోవడం వల్ల ఆ కాలం నాటి తెలుగువారి చరిత్ర, సాహితీ సంస్కృతుల వైభవానికి చెందిన ఆధారాలు చాలా తక్కువగా లభ్యం అవుతున్నాయి.**

దేవనాగరి లిపిలో రాసే మరాఠీ భాషకు, తెలుగు భాషకు మధ్య ఎన్నో పోలికలు ఉన్నాయి. తెలంగాణ, మహారాష్ట్రకు చెందిన కొన్ని ప్రాంతాలు కలగాపులగంలా కలిసిపోవడం వల్లనేమో, మరాఠీ సాహిత్యం, తెలుగు సాహిత్యం మధ్య కూడా ఎన్నో సామ్యాలున్నాయి. షోలాపూర్‌కు చెందిన డా॥బొల్లి లక్ష్మీనారాయణ తెలుగు, మరాఠీ భాషా సాహిత్యాలపై పలు తులనాత్మక రచనలు చేశారు.

తొలుత షోలాపూర్‌కు వలసవచ్చిన తెలుగువారు ఆ తర్వాత అహ్మద్‌నగర్, పుణే నగరాల గుండా ముంబయికి చేరుకున్నారు. ఏడు దీవులుగా విడివిడిగా ఉండే అప్పటి ముంబయి సముద్ర పాయల్ని పూడ్చి ఏకనగరంగా తీర్చిదిద్దిన ఘనత కూడా తెలుగు వారిదే. 1664లో ముంబయిని సందర్శించిన డా॥జాన్ ఫ్రెవర్ రాసిన 'ట్రావెల్స్ ఇన్ ఈస్టిండియా అండ్ పర్షియా...' అనే గ్రంథంలో, 1695లో వెలువడ్డ 'డిస్క్రిప్షన్ ఆఫ్ ఇండియా...' అనే పుస్తకంలో, 1889లో బాపూరావ్ నాయక్ సంపాదకత్వంలో వెలువడ్డ 'ముంబయికా వృత్తాంత్' అనే గ్రంథంలో కూడా ఈ విషయాన్ని ధృవీకరించారు. 1757లోనే ఈస్టిండియా కంపెనీ తెలుగువారిని తమ సైన్యంలో చేర్చుకున్నట్టుగా 'రైజ్ ఆఫ్ బొంబై' అనే గ్రంథంలో కూడా పేర్కొన్నారు.

ఆధునిక ముంబయి నిర్మాతలుగా తెలుగువారు చరిత్ర పుటల్లో స్థానం సంపాదించడమే కాకుండా సాహిత్యపరంగా కూడా విశేషంగా కృషి చేశారు. 19వ శతాబ్దంలో మహారాష్ట్రలోని ఏ నగరంలో కూడా తెలుగు ముద్రణాలయాలు ఉండేవి కాదు. అందుకే తెలుగు భాషను దేవనాగరి లిపిలో రాసేవారు. ఇదే పద్ధతిలో తెలుగు పుస్తకాలు, పత్రికలు కూడా ముద్రించేవారు.

తొలి తరం తెలుగు కథారచయిత్రి బండారు అచ్చమాంబ మరాఠీ నేల నుండే తన తొలి కథను రాయడం విశేషంగా చెప్పుకోవాలి. మహారాష్ట్రలో తెలుగు భాషను రక్షించుకునేందుకు అప్పటి తెలుగు ప్రముఖులు పత్రికలను సాధనంగా ఎంచుకున్నారు. 1887 లోనే డా॥ ఈరాల ఇస్తతి సంపాదకత్వంలో 'తెలుగు మిత్ర' అనే పత్రిక వెలువడేది. తెలుగు భాషను దేవనాగరి లిపిలో ముద్రించే ఈ వారపత్రికలో తెలుగు రాజుల చరిత్రల్ని, తెలుగు భాషా సాహిత్యం లాంటి అంశాలపై సవిస్తారంగా వ్యాసాలు ప్రచురించేవారు.

1892లో పడాల ఈరయ్య సంపాదకత్వంలో 'సత్యనిర్ణయ్' అనే పత్రిక వెలువడింది. ఇందులో మహారాష్ట్రలోని తెలుగువారి స్థితిగతులు, తెలుగుప్రముఖుల పరిచయాలు, తెలుగు సాహిత్య విశేషాలు ప్రచురించేవారు. ఈ పత్రికలకు పాఠకుల ఆదరణ బాగా లభించేది.

కాగా, 1915లో ముంబైలో జరిగిన ప్రథమ తెలుగు మహాసభలతో స్ఫూర్తి పొంది, షోలాపూర్‌కు చెందిన జక్కల విఠల్‌రావు తన స్వీయసంపాదకత్వంలో 'తెలుగు సమాచార్' అనే మాసపత్రికను వెలువరించారు. ఈ పత్రిక ఎన్నో సరికొత్త ప్రయోగాలు చేసి పాఠకుల అభిమానాన్ని విపరీతంగా చూరగొన్నది. ఇందులో ఆంధ్రుల చరిత్ర, తెలుగు భాషా సాహిత్యాల ఔన్నత్యం లాంటి అంశాలను మరాఠీలో ప్రచురించేవారు. అప్పుడప్పుడు తెలుగువారికి సంబంధించిన అంశాలను హిందీ, ఇంగ్లీష్‌లో కూడా ప్రచురించేవారు. అయితే ఆర్థిక పరిస్థితుల మూలంగా 1921లో ఈ పత్రిక మూతబడింది.

అయితే 1925లో పుణేలో నిర్వహించిన రెండవ తెలుగు మహాసభల తర్వాత పర్సా శంకర్‌రావు సంపాదకత్వంలో తిరిగి ఈ పత్రిక ముంబై నుండి వెలువడసాగింది.

1926లో సంక్రాంతి సందర్భంగా 'తెలుగు సమాచార్' ప్రత్యేక సంచిక వెలువరించారు. మరాఠీ, ఇంగ్లీష్, తెలుగుభాషల వ్యాసాలతో 295 పేజీలతో దీన్ని విడుదల చేశారు. అప్పట్లో ఇదో పెద్ద సంచ

లనం. సురవరం ప్రతాప్‌రెడ్డి 'గోల్కొండ కవుల సంచిక' తేవ డానికి చేసిన సాహసంతో ఈ తెలుగు సమాచార్ ప్రత్యేకసంచికను పోల్చ వచ్చు. ఈ ప్రత్యేక సంచికలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, డా॥పట్టాభి సీతారామయ్య, మోక్షగుండం విశ్వేశ్వరయ్య, కొండా వెంకటప్పయ్య, బండారు అచ్చమాంబ, కందుకూరి వీరేశ లింగం పంతులు, టంగుటూరి ప్రకాశం తదితర ప్రముఖ తెలుగు రచయిత లతో పాటు బాలగంగాధర్ తిలక్, డా॥ వెంకటేశ్వర్ కేత్కర్, డా॥ బాబాసాహెబ్ అంబేడ్కర్, మహాత్మాగాంధీ లాంటి తెలుగేతర మహా మహుల రచనల్ని కూడా ప్రచురించారు.

1919లోనే ముంబయి నుండి వంజరి సామాజిక వర్గానికి చెందిన కాలేవార్ వినాయక్, కాత్కాడే గణపత్ అనే ఇద్దరు మిత్రులు 'వంజారి త్రైమాసిక పత్రిక'ను వెలువరించడం విశేషం. ఈ పత్రికను మొదటి కుల పత్రికగా పేర్కొనవచ్చు.

జనవరి 1926లో సుప్ప శంకర్రావు సంపాదకత్వంలో 'ఆంధ్ర సేవక్' అనే మాసపత్రికను ప్రారంభించారు. ఈ పత్రికలో ఎన్నో వివాదాస్పద కథనాలు ప్రచురితం అయ్యేవి. వీర్ సావర్కర్‌లాంటి పోరాట యోధులు ఇందులో వ్యాసాలు రాసేవారు.

1925లో కమాటిపురాలోని 'ఆంధ్ర ఆత్మోన్నత మండలి' వారు తమ ఆధ్యాత్మిక విశేషాల ప్రచారం కోసం 'ఆంధ్రవీర్' అనే త్రైమాసిక పత్రికను ప్రారంభించారు. ఇందులో మరాఠీ, తెలుగు భాషలలో ఆధ్యాత్మిక రంగానికి చెందిన పలు మహనీయుల ప్రవచనాల్ని ప్రచు రించేవారు. ఒకరకంగా ఇది మహారాష్ట్రలో తొలి తెలుగు ఆధ్యాత్మిక పత్రికగా చెప్పుకోవచ్చు. 2011లో సంగెవేని రవీంద్ర సంపాద కత్వంలో ఏఎమ్ఆర్ అనే సంస్థ దాదాపు 15 నెలల పాటు 'ముంబయి వన్' అనే పక్షపత్రికను వెలువరించారు. ఈ పత్రిక ఉమ్మడి ఆంధ్ర ప్రదేశ్‌తో పాటు నాలుగు రాష్ట్రాల్లోని తెలుగు పాఠకుల అభిమానాన్ని చూరగొన్నది.

1864లోనే కమాటిపురా, 5వ వీధిలో 'తెలుగు పుస్తకాలయము' అనే గ్రంథాలయాన్ని స్థాపించి, ప్రత్యేకంగా తెలుగు రాష్ట్రాల ప్రముఖ రచయితల నుండి వేలాది పుస్తకాలు సేకరించారు. అదే కమాటి పురాలో 1893లో 'తెలుగు జ్ఞానోత్తేజక పుస్తకాలయం' పేరుతో మరో గ్రంథాలయాన్ని కూడా ప్రారంభించారు.

పత్రికలు, గ్రంథాలయాల సంగతి అలా వుంచితే, మహారాష్ట్రలో ఎందరో తెలుగు సాహితీవేత్తలు తెలుగు భాషాసాహితీ కేతనాన్ని విజయవంతంగా ఎగరవేస్తున్నారు.

1860లోనే జనార్ధన్ రాంచంద్రం అనే రచయిత తెలుగు కవుల చరిత్ర వ్యాసాల సంకలనం 'కవి చరిత్ర' అనే పేరుతో మరాఠీలో రచించారు. ఈ రకంగా తెలుగు కవుల గొప్పదనాన్ని మరాఠీ పాఠకు లకు అందించిన తొలి రచయితగా జనార్ధన్ చరిత్ర పుటల్లో స్థానం సంపాదించుకున్నారు.

1875లోనే వెన్నెల నర్సింగయ్య అనే ఉపాధ్యాయుడు 'ఆంధ్ర చిన్న బాలశిక్ష' 'తెలుగు లెక్కల బాలశిక్ష' అనే రెండు పుస్తకాలను తెలుగు విద్యార్థుల కోసం రాసి ప్రచురించారు. 1886లో ఆయనే 'తెలుగు వ్యాకరణము' అనే పుస్తకాన్ని కూడా ప్రచురించి అప్పటి తెలుగు విద్యార్థులకు ఎంతో సహాయపడ్డారు. కొన్ని దశాబ్దాల పాటు ఆయన రాసిన పుస్తకాలే తెలుగు విద్యార్థులకు పాఠ్యాంశాలుగా ఉండేవి.

ముంబయిలో తెలుగు సాహిత్యం వెల్లివిరియడానికి పర్సా శంకర్‌రావు ఎంతో కృషి చేశారు. 1912లోనే 'ఆంధ్రావాంగ్మయం' అనే 103 పేజీల పుస్తకాన్ని రచించారు. ఇందులో తెలుగు భాషా శబ్దోత్పత్తి, వ్యాకరణ వివరాలు, తెలుగు వర్ణమాల, తెలుగు ఛందస్సు లాంటి వాటిని పరిచయం చేయడమే గాక, నన్నయ, తిక్కన, ఎర్రా ప్రగడ, పోతన, శ్రీనాథుడు, నాచన సోముడు లాంటి కవుల పరి చయాల్ని సవిస్తారంగా ప్రచురించారు. తెలుగులోని నరసింహ శత కాన్ని, మల్లంపల్లి సోమశేఖర శర్మ రచించిన 'ఆంధ్రవీరులు' అనే పుస్తకాన్ని 'ఆంధ్రవీర్ రత్నే' అనే పేరుతో మరాఠీలోకి అనువదించారు.

1949లో కొందరు తెలుగు ప్రముఖులు కమాటిపురాలో 'ఆంధ్ర సారస్వత పరిషత్తు'ను స్థాపించి తెలుగు పాఠ్యపుస్తకాల ప్రచురణను చేపట్టారు. దీంతో వేలాది మంది తెలుగు విద్యార్థులకు ఎంతో వెసులు పాటు లభించింది. ఇదే సంస్థలో సంయుక్త కార్యదర్శిగా పని చేసిన ద్యావరిశెట్టి వెంకటేశ్వర్ అనే యువకుడు శతావధాని కృష్ణమా చార్యులు, మఠం వాసుదేవమూర్తుల ప్రభావంతో ఛందస్సును నేర్చు కొని 1953లో శ్రీవెంకటేశ శతకం, 1954లో అక్షరమాల అనే గ్రంథాలను వెలువరించారు.

మహారాష్ట్ర స్థాయిలో 20వ శతాబ్దానికి చెందిన తొలి తెలుగు గ్రంథకర్తగా ద్యావరిశెట్టి వెంకటేశ్వర్‌ను చెప్పుకుంటారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, అధికార భాషాసంఘం వారు ద్యావరిశెట్టి వెంకటేశ్వర్ తెలుగు భాషకు చేసిన సేవల్ని పురస్కరించు కొని అధికారికంగా సత్కరించారు.

1945లో ఉద్యోగరీత్యా ముంబయికి వచ్చిన సోమంచి యజ్ఞన్న శాస్త్రి అంచెలంచెలుగా ఎదిగి మున్సిపల్ కమీషనర్‌గా పదోన్నతి పొందారు. ఈయనకు తెలుగు సాహిత్యం పట్ల, భాష పట్ల ఎంతో మక్కువ. తెలుగువారంటే విపరీతమైన అభిమానం ఉండేది. ముంబయి తెలుగు వారిలో సాహిత్యాభిమానాన్ని పెంచేందుకు తెలుగుసంస్థల సహకారంతో ఎన్నో కార్యక్రమాలు నిర్వహించేవారు. బహు గ్రంథ కర్త...సామాజిక, హాస్య అంశాలపై ఎన్నో పుస్తకాలు రచించి మహా రాష్ట్రలో తెలుగు సాహిత్య పునాదుల్ని బలోపేతం చేశారు. తనకున్న అధికార పరిధిలో ఎన్నో తెలుగు సంస్థలకు స్థలాలు కేటాయించారు. అందుకే ఇప్పటికీ కూడా ముంబయి తెలుగువారు యజ్ఞన్న శాస్త్రిని 'ఆత్మబంధువు'గా చెప్పుకుంటారు.

షోలాపూర్‌కు చెందిన బొల్లి లక్ష్మీనారాయణ ప్రస్తావన లేకుండా మహారాష్ట్ర తెలుగు సాహితీ చరిత్ర పరిపూర్ణం కాలేదు. చేనేత సామా జిక వర్గానికి చెందిన లక్ష్మీనారాయణ 17 పుస్తకాలు రచించి, తెలుగు, మరాఠీ భాషల అనుసంధానకర్తగా వ్యవహరిస్తున్నారు. ఈయన రాసిన 5 పుస్తకాల్ని కేంద్ర సాహిత్య అకాడెమీ ప్రచురించింది. లక్ష్మీ నారాయణ రచనలు మహారాష్ట్రలోని 8 విశ్వవిద్యాలయాల్లో పాఠ్యాం శాలుగా ఉన్నాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం లక్ష్మీనారాయణకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. లక్ష్మీనారాయణ రచన 'తెలుగు పూలాంచా మరాఠీ సుగంధ్'లో తెలుగు మరాఠీ సాహిత్య స్వామ్యాలను అద్భుతంగా విశ్లేషించారు. 'ఏక్ శాల్యాని' స్వగత కథనంలో మధ్య తరగతి సృజనకారుడు పడే తపన, సంఘ ర్షణను ఎంతో చక్కగా అక్షరబద్ధం చేశారు. వేగవంతమైన ఆధునిక

సమాజంలో సాధారణ ప్రజల వేదన లక్ష్మీనారాయణ రచనల్లో కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తుంది.

దాదాపు 20 నవలలు, కథా సంపుటాలు వెలువరించిన తురగా జయశ్యామల ముంబయి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. ఈమె రాసిన కొన్ని నవలలు సినిమాలకు ఆధారంగా నిలిచాయి. ఎన్నో అవార్డులు అందుకున్నారు. అయితే ఈమె రచనలు సమాజంలోని ఒక వర్గపు పాఠకులను దృష్టిలో పెట్టుకొని రాసిన వినోదాత్మక, సెంటిమెంటల్ సాహిత్యంగానే చెప్పుకోవాల్సి ఉంటుంది. ప్రజాజీవితంలోని నిత్యపోరాటాలు, వ్యవస్థలోని అవస్థలు, వాటి పరిష్కారానికై పడే తపనలు ఎక్కువగా కనిపించవు. అయినా పరాయి రాష్ట్రంలో ఉంటూ సాహితీకృషి చేయడం అభినందనీయమే కదా...!

మిల్లు కార్మికుల కుటుంబ నేపథ్యం నుండి వచ్చిన అంబల్ల జనార్ధన్ తన 43వ యేట కథాప్రపంచంలోకి ప్రవేశించారు. ఈయన రాసిన అంబల్ల జనార్ధన్ కథలు, బొంబాయి కథలు తెలుగు పాఠకులకు ముంబయి మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి జీవితాలను పరిచయం చేశాయి. ఈయన కథల్లో జీవన సంఘర్షణలు ఎక్కువగా కనిపిస్తాయి. తెలుగు కథా ప్రపంచంలో అంబల్ల జనార్ధన్‌కు ప్రత్యేక స్థానం ఉంది.

పెరుగుతున్న సాంకేతిక పరిజ్ఞానం, సోషల్ మీడియాలో వ్యాపిస్తున్న తెలుగు భాష ప్రభావం వల్ల ముంబయిలో కవిత్వం పట్ల సాహిత్యం పట్ల అభిరుచి పెరుగుతోంది. ఎందరో రచయితలు, కవులు వెలుగులోకి వస్తున్నారు. ముఖ్యంగా మచ్చ ప్రభాకర్ ఇప్పటివరకు ఏడు పుస్తకాలు వివిధాంశాలపై వెలువరించారు. అభ్యుదయం ఆయన రచనల్లో కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

నడిమెట్ల యెల్లన్న మూడు కవితా సంపుటాలు వెలువరించారు. యెల్ది సుదర్శన్ పద్మశాలి కూడా కవితా సంపుటాలతో పాటు ఈ మధ్యే ఒక కథా సంపుటి కూడా వెలువరించాడు. ముంబయి సరిహద్దులోని భీవండి నగరం నుండి వడిగొప్పుల శంకర్, బొడ్డు శంకర్, గందూరి లక్ష్మీనారాయణ లాంటివారు ఉత్తమ పద్య కవిత్వాన్ని వెలువరిస్తున్నారు. ఛందోబద్ధమైన కవిత్వాన్ని పెంచి పోషిస్తున్నారు. ఎన్నో కావ్యాలు వెలువరించారు.

గత రెండు సంవత్సరాల నుండి బొంబాయి ఆంధ్రమహాసభ వారు ఈ వ్యాసకర్త సంపాదకత్వంలో, ఉగాది సందర్భంగా మహారాష్ట్ర తెలుగు కవుల సంపుటిని క్రమం తప్పకుండా తీసుకొస్తున్నారు. ఏవీ అనంతరామ్, గాలి మురళీధర్, గొంద్యాల రమేశ్, నాగెళ్ళ దేవానంద్, గుండారి శ్రీనివాస్, యుకే మేఘ, అక్కినపెల్లి దుర్గేశ్, కావలి రాములు, కట్టరాజు ఉశన్న, కట్ట అశోక్ లాంటి శ్రామిక వర్గ ప్రతినిధులు కూడా ఎంతో గొప్ప కవిత్వాన్ని సృజిస్తున్నారు.

ముంబయిలో ప్రస్తుతం తెలుగు వెలుగుల వాతావరణం నెలకొని ఉంది. ఎందరో తెరపైకి వస్తున్నారు. ఆంధ్రమహాసభ, తెలుగు కళా సమితి, తెలుగు సాహిత్య సమితి, అఖిల భారత తెలంగాణ రచయితల వేదిక లాంటి సంస్థలు నూతన రచయితల్ని ఎంతగానో ప్రోత్సహిస్తున్నాయి. మరెన్నో పుస్తకాలు ఆవిష్కరణ కోసం సిద్ధమవుతున్నాయి. ఆధునిక ముంబయి నిర్మాణం తెలుగువారి వల్లే జరిగిందని మరాఠీ చరిత్రకారులు ధృవీకరించి తెలుగువారికి అపూర్వ గౌరవాన్ని కల్పించారు.

ప్రస్తుతం తెలుగు సాహితీవేత్తలు ముంబయిలో తెలుగు సాహిత్య పతాకాన్ని విజయవంతంగా ఎగరవేస్తున్నారు.

అయినప్పటికీ మహారాష్ట్రలో తెలుగువారి వలస వేదనల్ని, క్రియాశీలక పాత్రని, కార్పోరేటర్ కల్చర్ వల్ల చిన్నాభిన్నమవుతున్న తెలుగు కుటుంబాల మానసిక సంఘర్షణని, మసకబారుతున్న మానవ సంబంధాలని ఎత్తిచూపే పలు రచనలు రావాల్సిన అవసరం ఇంకా ఎంతో ఉంది అని చెప్పక తప్పదు.

❊

## తెలంగాణ పాఠశాలల్లో ఇంగ్లీషు మాధ్యమం

హైదరాబాద్, జూన్ 8 (ఆంధ్రజ్యోతి): విద్యార్థుల సంఖ్య తక్కువగా ఉన్న స్కూళ్లను మూసివేయాలనే నిర్ణయం నుంచి తెలంగాణ సర్కారు వెనక్కి తగ్గింది. స్కూళ్లు, టీచర్ల హేతుబద్ధీకరణ (రేషనలైజేషన్)ను వచ్చే ఏడాదికి వాయిదా వేస్తూ సూత్రప్రాయంగా నిర్ణయం తీసుకుంది. దీంతో రాష్ట్రవ్యాప్తంగా 4,481 స్కూళ్లకు మూసివేత ముప్పు తప్పినట్లయింది. అలాగే 10లోపు విద్యార్థులుగల 1,400 ప్రైమరీ స్కూళ్లు, ఎంపిక చేసిన హైస్కూళ్లలో ఇంగ్లిషు మీడియాన్ని ప్రవేశపెట్టాలని సర్కారు నిర్ణయించింది. స్కూళ్ల ఎంపిక, టీచర్లకు శిక్షణ బాధ్యతను జిల్లా కలెక్టర్లకు అప్పగించింది. విద్యావ్యవస్థ సంస్కరణల్లో భాగంగా విద్యార్థులు లేని (జీరో ఎన్‌రోల్‌మెంట్), విద్యార్థుల సంఖ్య తక్కువగా ఉన్న స్కూళ్లను మూసివేయాలని, ఈమేరకు మేనెలలోనే స్కూళ్లు, టీచర్ల హేతుబద్ధీకరణను చేపట్టాలని సర్కారు అప్పట్లో నిర్ణయించింది. ఆ దిశగా రాష్ట్రవ్యాప్తంగా ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలవారీగా విద్యార్థుల ఎన్‌రోల్‌మెంట్‌ను విద్యాశాఖ సేకరించింది. 60లోపు విద్యార్థులున్న ప్రైమరీ స్కూళ్లు 12,178 ఉన్నాయని, వీటి నిర్వహణ కష్టంగా మారిందని తన స్టేటస్ రిపోర్ట్‌లో పేర్కొంది. ఈమేరకు ఒక గ్రామంలోని ప్రైమరీ స్కూళ్లలో తక్కువ విద్యార్థులున్న స్కూళ్లను ఎంపిక చేసిన ఒకే స్కూల్ కిందకు తేవాలని, ఆమేరకు విద్యార్థుల సంఖ్య ఆధారంగా ఉపాధ్యాయులను సర్దుబాటు చేయాలని ప్రతిపాదించింది. ఈ నేపథ్యంలో జీరో నుంచి 20 మందిలోపు విద్యార్థులున్న స్కూళ్లను మూసివేయాలని సూచించింది. కాగా సర్కారు నిర్ణయంపట్ల ఉపాధ్యాయ సంఘాలు ఆందోళన వ్యక్తం చేశాయి. స్కూళ్ల మూసివేత తగదని, విద్యావ్యవస్థలో లోపాలను సరిదిద్ది, ఆంగ్ల మాధ్యమాన్ని ప్రారంభించాలని డిమాండ్ చేశాయి. అటు సుప్రీంకోర్టు కూడా స్కూళ్లను మూసివేయొద్దని, వాటిని బలోపేతం చేసే దిశగా చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి సూచించింది. ఈ నేపథ్యంలోనే స్కూళ్లలో విద్యార్థుల నమోదు పెంచేందుకు 'బడిబాట'ను చేపట్టాలని ఉపాధ్యాయ సంఘాలకు సర్కారు సూచించింది. ఆ తర్వాత విద్యార్థుల ఎన్‌రోల్‌మెంట్ ఆధారంగా స్కూళ్లు, టీచర్ల హేతుబద్ధీకరణను చేపడతామని పేర్కొంది. కాగా మరో నాలుగు రోజుల్లో బడిబాట కార్యక్రమం ముగిసి, స్కూళ్లు ప్రారంభం కానున్నాయి. ఈ నేపథ్యంలో హేతుబద్ధీకరణను వాయిదా వేయాలని విద్యాశాఖ నిర్ణయించింది.

# కొండముది శాసనం

-డా॥ఈమని శివనాగిరెడ్డి
సెల్ : 98485 98446

శ్రీపర్వత విజయపురి (నాగార్జునకొండ) నుంచి పాలించిన ఇక్ష్వాకుల తరువాత ఆంధ్రదేశాన్ని బృహత్పలాయన, తొలి పల్లవులు, ఆనంద గోత్రినులు, విష్ణుకుండినులు, సాలంకాయనులు, మాఠరులు, పితృభక్తులు, వశిష్టులు, తూర్పుగాంగులు పాలించారు. వీరిలో బృహత్పలాయన వంశానికి చెందిన జయవర్మ (క్రీ.శ.292-302) గురించి తెలిపే కొండముది శాసనాన్ని, ఆయన కుదూరు (కొందరు మచిలీపట్నం దగ్గర గూదురు అనీ, మరికొందరు అవనిగడ్డ దగ్గరి కోడూరని అంటున్నారు) నా ఉద్దేశంలో అవనిగడ్డ దగ్గరి కోడూరే, కుదూరు పదానికి దగ్గరగా వుంది. ఈ శాసనంలో జయవర్మను గురించి, 'మహేశ్వర పాదపరిగహితో బృహత్పలాయన గుగోతో రాజా సిరిజయవమ్మో' అనీ, రాగి రేకు ముడిపై 'బృహత్పలాయన సగోత్రస్య మహారాజశ్రీ జయమ్మనః' అని వుంది. 'రాజా', 'మహారాజా', 'మహేశ్వర పాదపరిగ్రహీత' అనే బిరుదులను ప్రస్తావించబడింది.

క్రీ.శ.4 నుంచి 5వ శతాబ్ది దాకా పెదవేగి (వేంగీ) నుంచి పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాల్లోని కొంత భాగం గల ఆంధ్రదేశాన్ని పాలించిన సాలంకాయనుల్లో విజయదేవవర్మ, మొదటి హస్తివర్మ (సముద్రగుప్తుని సమకాలికుడు) నందివర్మ, అచండవర్మ, రెండో హస్తివర్మ, రెండో నందివర్మ, విజయస్కంధవర్మలు క్రీ.శ.360 నుంచి క్రీ.శ.450 వరకూ పాలించారు. ఈ వంశానికి చెందిన 9 రాగిరేకు శాసనాలు, ఒక రాతి శాసనం, పెదవేగి తవ్వకాల్లో వెలుగు చూశాయి. ఇంకా కానుకొల్లు, కొల్లేరు, కంతేరు, పెనుగొండ శాసనాలు కూడా వీరి చరిత్రను తెలియజేస్తున్నాయి. ఈ రాజుల్లో నందివర్మ కానుకొల్లు శాసనంలో 'బప్పభట్టారక పాదపరిగ్గహితస్సమహారాజసిరినంది వర్మస్స' అని, 'మహారాజ కుమార ఖండపొత్తస్స', 'మహారాజ పుణ కొంగల పుత్తో' అని వుంది. అంటే రాజుకు బప్పభట్టారక పాదపరిగ్రహీతుడనీ, మహారాజనీ ఉండగా, ఖండపొత్త(స్కంధపుత్రుడు)నికి 'మహారాజకుమార' అనే బిరుదు ఉన్నట్లు తెలుస్తుంది. ఇదే వంశానికి చెందిన రాజులు కొందరు 'పరమమాహేశ్వర, పరమ భాగవత' అనే బిరుదుల్ని కూడా ధరించారు.

సాలంకాయనులకు సమకాలికులైన ఆనందులు లేక ఆనంద గోత్రినులు కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని కృష్ణా తీర ప్రాంతాలను పాలించారు. వీరి రాజధాని కందరపురం (నాగార్జున యూనివర్శిటీ దగ్గర కంతేరు) అని కొంతమంది, కపోతపురం (చేజర్ల) అని మరికొంతమంది పేర్కొన్నారు. ఈ వంశంలో కందరుడు, అత్తివర్మ, అవనీతలాంతవతి, అత్తివర్మ, సత్యభామల్ల దామోదరవర్మలు క్రీ.శ. 5-6 శతాబ్దాల్లో పాలించారని చేజర్ల, మట్టెపాడు, గోరంట్ల శాసనాలు తెలియజేస్తున్నాయి. దామోదరవర్మ మట్టెపాడు రాగిరేకు శాసనంలో 'సంయక్సంబుద్ధస్య పాదానుద్యాతస్య ....మహారాజశ్రీ దామోదరవర్మ' అని ఉండటాన ఈ వంశీయులు, సంయక్సంబుద్ధ పాదానుద్యాతులనీ, మహారాజశ్రీ అనే బిరుదులను ధరించినట్లు తెలుస్తుంది.

క్రీ.శ.300-630 మధ్యకాలంలో కృష్ణా-గుంటూరు, ప్రకాశం జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలను పాలించారు. ధాన్యకటకం వీరి రెండో

మొదటి రేకు
1. విజయ - వేంగిపురా బప్ప - భట్టారక
2. పాద - పరిగ్గహితస్స మహారాజ
3. సిరి - నందివమ్మస్స వచనేన పి -

ండోరేకు - మొదటివైపు
4. డిహ- గ్గామె ముత్యదప్ప ముఖొగామొ
5. సవ్వ - సమగ్గొ సవ్వాయొగ - పెసన
6. కులపుత్త భడ- మనస్సా భానితవ్వా

రెండోరేకు - రెండోవైపు
7. ఇహహి అంహ ధమ్మాయుబలవద్ధ
8. ణత్థ(ం) బాలక - మహారాజ కుమార
9. ఖండ పొత్తస్స యశత్తి సత్థియనం

మూడోరేకు - మొదటివైపు
10. ఇచ్ఛంతెన మయా ఎతస్స సాపాను
11. గ్గహ - సమత్థాస్స నానాగొత్త-చ
12. రణ - తపస్స (ఝా)య - నిరతస్స

మూడోరేకు - రెండోవైపు
13. అగ్గహార - రథకార - చాతువెజ్జస్స
14. ఏస పిడిహ- గ్గామొ అగ్గహార - ర
15. థకార - విధానేన సంపదత్తొ తస్సయ

రాజధాని. 20 వరకూ గల వీరి శాసనాల్లో మంచికల్లు, మైదవోలు, ఒంగోడు, బచ్చేపల్లి, హరహడమాల్లి, కొప్పరం, బ్రిటీష్ మ్యూజియం, దర్శి, వాయలూరు, కశకూడి, గురవాయపాలెం, వేలూరు పాలయం శాసనాలు ముఖ్యమైనవి.

సింహవర్మ (క్రీ.శ.300) ఈ వంశ మూలపురుషుడు, అతని తరువాత, వీరమార్చవర్మ, విష్ణుగోరు, మొదటి స్కంధవర్మ, మొదటి కుమారవిష్ణు, రెండో స్కంధవర్మ, రెండో కుమారవిష్ణు, బుద్ధవర్మ, వీరవర్మ, మూడో విజయస్కంధవర్మ, యువ మహారాజు విష్ణుగోప, సింహవర్మ, సింహవిష్ణులు రాజ్యం చేశారు. వీరిలో వీరకూర్చవర్మకు 'మహారాజ' (దర్శి) 'విశృతాహ్వయ' అనీ, (వేలూరు పాలయం) 'బుద్ధవర్మ భూమండలాధీశ్వరుడ'నీ, 'చోళసైన్యార్ణవ బడబాగ్ని' అనే బిరుదులున్నట్లు శాసనాల్లో ప్రస్తావించబడింది. పల్లవ శివస్కంధవర్మ మైదవోలు రాగిరేకు శాసనంలో అతనికి 'యువమహారాజ' బిరుదున్నట్లు, (కంచీపురతో యువ మహారాజా భారదాయ సగొత్తో పలవానం శివ ఖంద వమ్మో దమ్నాకడెవాపతం ఆనపయితి) పల్లవ వంశం, భరద్వాజ గోత్రానికి చెందిన 'యువమహారాజు' శివస్కంధవర్మ అని పేర్కొనబడింది. ❋

# పదచిత్రాలు

-గోవిందరాజు చక్రధర్
98498 70250

**ఆ**దిమానవుడు కొండ గుహల్లో తలదాచుకునేవాడు. వేట ఏకైక జీవనాధారంగా మనుగడ సాగించిన రోజులవి. మనసులోని భావాలను ఒకరు మరొకరితో పంచుకోవటానికి భాష లేదు. అప్పుడు అక్కరకొచ్చింది బొమ్మ. గుహలోని గోడలపై ఏ బొగ్గుముక్కతోనో, సుద్దముక్కతోనో బొమ్మగీయటం మొదలు పెట్టాడు. తాను ఆరోజు ఏ జంతువును వేటాడి తెచ్చిందీ చెప్పటానికి బొమ్మ గీసి చూపాడు.

అప్పటినుండి మొదలైన ఈ ప్రస్థానంలో చాలా దూరం ప్రయాణించాం. మనసులోని భావాలను చెప్పుకోవటానికి భాషలు ఏర్పడ్డాయి.

అసలు భాషంటే ఏమిటి?

భాషంటే ఒక నిర్దిష్ట సమూహమో, సమాజమో ఉమ్మడిగా ఏర్పరుచుకున్న కొన్ని సంకేతాలు. ఈ సంకేతాలు చాలా భాషల్లో అక్షరరూపం దాల్చాయి. లిపిలేని భాషలు కూడా మనమధ్యే మనుగడ సాగిస్తున్నాయి. దూరాలు పెరిగిన కొద్దీ, అవసరాలు మారినకొద్దీ వ్యక్తీకరణలు మారాయి. సంకేతాలు మారాయి. కొత్త భాషలు పుట్టుకొచ్చాయి. వివిధ అవసరాలతో పాటే వ్యక్తీకరణలు, అర్థచ్ఛాయా భేదాలు కూడా విస్తరిస్తూ వచ్చాయి. ఒక్కో సమూహపు, సమాజపు సంకేతం వారికే పరిమితం కావడంతో ఆ భాష ఇతరులకు అర్థం కాకుండా పోయింది. అర్థం కావాలంటే ఆ భాషలోని సంకేతం భావమేమిటో తమ సంకేతంతో ముడిపెట్టి చూడాల్సి వచ్చింది.

"అమ్మ అన్నం వండింది, అక్క భోజనం వడ్డించింది"

పై వాక్యంలోని పదాల సంకేతాలు మనందరికీ తెలుసు కనుకే వాక్యాన్ని అర్థం చేసుకున్నాం. అమ్మ అంటే ఎవరో, అన్నం వండటమంటే ఏమిటో, అక్క అంటే ఎవరో, భోజనం వడ్డించటమంటే ఏమిటో వగైరా విషయాల సంకేతాలు ముందుగా మన మెదడులో నిక్షిప్తమై వున్నాయి కనుకనే ఆ సంకేతాల సాయంతో వాక్యాన్ని అవగాహన చేసుకోగలగాలి. ఈ సంకేతాలు మెదడులో నిక్షిప్తం కాని వారికి పై వాక్యం బోధపడదు.

**మనకేనా ఉంది భాష ? :** భాషే మనల్ని మనుషులుగా మలిచిందంటారు. చింపాంజీలకూ కోతులకూ ఆ మాటకొస్తే సృష్టిలోని సర్వ ప్రాణికోటికి భాషలున్నాయి. అవి మన భాషల మాదిరి ఇంతగా ఎదిగి ఉండకపోవచ్చేమో.కానీ ఆయా ప్రాణుల అవసరాలను మాత్రం తీర్చగలుగుతున్నాయి. ఏదో ఒక భావ ప్రసార వ్యవస్థ లేకుండా వన్యప్రాణి మందలుగా సంచరించటం సాధ్యమయ్యేది కాదేమో! ఆకాశంలో ఎక్కడా ఢీ కొనకుండా లయతో తూకంతో పక్షులు గుంపులుగా ఎగరడం సాధ్యమయ్యేది కాదేమో!

తల్లులు బిడ్డలకు జోలపాటలు పాడినట్లు, ముద్దు మాటలు చెప్పినట్లు, పక్షులు కూడా తమ గూట్లోని పిల్లలను జోలపాటలతో లాలిస్తాయని, ముద్దు చేస్తాయని, ఆ పిల్లలు తమ తల్లి గొంతును గుర్తిస్తాయని ఇటీవలి పరిశోధనల్లో వెల్లడైంది.

**కుడ్యచిత్రాల ప్రభావం :** ఆది మానవుడి కుడ్యచిత్రాల ప్రభావం ఇప్పటికీ చెక్కుచెదరకుండా కొనసాగుతూ వస్తోంది. మనం భాషలోని భావాలను దృశ్యరూపంలోకి మలుచుకుని అవగాహన చేసుకుంటున్నాం. లిఖిత రూపమైనా, మౌఖికరూపమైనా అంతిమంగా దానిని బొమ్మల రూపంలోనే మెదడు స్వీకరిస్తుంది. ఈ దృశ్యరూప స్వీకరణ కారణంగానే ఒక విషయాన్ని ఎన్నో ఏళ్ళపాటు జ్ఞాపకాల పొరల్లో నిక్షిప్తం చేసుకోగలుగుతున్నాం.

**మాటకు అదనపు సౌలభ్యం :** మౌఖిక రూపానికి అదనపు సౌలభ్యాలు, ఉపకరణాలు వున్నాయి. మాట్లాడేటప్పుడు ఎదుటివారిని బట్టి వ్యక్తీకరణ పద్ధతిని మార్చుకోవచ్చు. ఒకే విషయాన్ని చిన్నపిల్లలతో ఒక రకంగా, పెద్దవారితో మరో రకంగా, సన్నిహిత మిత్రులతో ఇంకో రకంగా చెప్తాం. అర్థం అవుతున్నదో లేదో మనకు అప్పటికప్పుడే తెలుస్తుంది కనుక అర్థం కాలేదనిపిస్తే వెంటనే మరో పద్ధతిలో అవగాహన అయ్యేట్లు చెప్పవచ్చు. మాటలకు శరీర భాష తోడు నిలుస్తుంది.

'పెద్ద బండరాయితో తల పగలగొట్టాడు' అని చెప్తూ ఆ రాయి ఎంత పెద్దదో చెప్పటానికి రెండు చేతులనూ వీలున్నంత వెనక్కి వంచి సూచించవచ్చు. చేతులే కాకుండా మొత్తం అవయవాల కదలికలు కూడా మాటలకు జతకూడతాయి. కళ్ళు భావాలు పలికిస్తాయి. నాసికాపుటాలు ఛాయాభేదాలు తెలియచేస్తాయి. మాటల మాటున దాగిన వైనాలను పెదవుల దరహాసం చెప్పకనే చెప్తూ వుంటుంది. ఆంగికాభినయం ద్వారా మాత్రమే విషయ ప్రసారమూ సాధ్యమే. రోడ్డుకు ఇవతల మీరు వుండి, అవతల దూరంగా నిలబడిన వ్యక్తికి చేతులతోనే విషయాన్ని చేరవేసేయగలరు. భాషలు రానివారు సైతం శరీర భాషతో ఏదో ఒక మేరకు భావాలను ఇచ్చిపుచ్చుకోవచ్చు.

**శరీర భాష పలికే రసాలు :** హరికథ, బుర్ర కథ, జముకుల కథ వంటి జానపద కళారూపాల్లో కథకుడు ఆయా సందర్భాల్లో కథలోని భావావేశాన్ని, రౌద్రాన్ని పలికించటానికి మాటకు, శరీర భాషను తోడుగా నిలుపుతాడు. ఆయా పాత్రలను రంగస్థలిపై ప్రేక్షకుల కళ్ళకు కట్టిస్తాడు. గద్దర్, గోరటి వెంకన్న వంటి ప్రజాగాయకుల పాటకు ఆట తోడయ్యింది. ప్రజలను కదిలించే ఆవేశాన్నిచ్చింది.

**డ్రైవింగ్‌లో ఫోన్‌లో మాట్లాడితే :** దినపత్రికల్లో 10-6-2016న ఒక వార్త ప్రచురితమైంది. డ్రైవింగ్‌లో ఎలా మాట్లాడినా ముప్పేనని నిర్ధారించిన ఆ వార్తలో ఈ విషయాలను ప్రధానంగా పేర్కొన్నారు.

"చేతిలో ఫోన్ పట్టుకుని మాట్లాడుతూ డ్రైవ్ చేస్తే ఏకాగ్రత చెదిరి ప్రమాదాలకు దారి తీస్తుందన్న సంగతి తెలిసిందే. చేతిలో ఫోన్ పట్టుకోకుండా బ్లూటూత్ వంటి ఉపకరణాన్ని వినియోగిస్తూ డ్రైవ్ చేస్తే పరవాలేదని చాలామంది అనుకుంటారు. కానీ ఇలా చేసినా ఏకాగ్రత చెదిరి రోడ్డు ప్రమాదాల బారిన పడే ప్రమాదం వుందని ససెక్స్ విశ్వవిద్యాలయ మానసిక శాస్త్రవేత్త డా॥ గ్రాహం హోల్ నిర్ధారించారు. సంభాషణలు మెదడులోని దృష్టి ప్రక్రియకు సంబంధించిన వనరుల్ని ఉపయోగిస్తాయి. దీనివల్ల మెదడులోని

ప్రాసెసింగ్ సామర్థ్యం మధ్య పోటీ నెలకొని రహదారిపై ముప్పులను గుర్తించలేకపోయే ప్రమాదం అధికమని తేలింది. సంభాషణలో భాగంగా అవతలి వ్యక్తులు అడిగే సమాచారం, ప్రశ్నలను బట్టి డ్రైవ్ చేసే వారి మెదడులో ఊహలు మారడం వల్ల ఏకాగ్రత దెబ్బతినే ప్రమాదం వుంది".

కారులో ఫోను సంభాషణ అయినా, పక్కసీట్లో కూర్చున్న వారితో మాటలైనా అర్థం చేసుకోవటానికి మెదడులో కొన్ని దృశ్యాలు ఏర్పడ తాయి. ఎదురుగా వచ్చే వాహనాల వేగం, రోడ్డు మలుపులు వగై రాలపై దృష్టి కేంద్రీకరణను, సంభాషణలు దెబ్బతీస్తాయి. డ్రైవింగ్‌కు సంబంధించి మాత్రమే మెదడులో దృశ్యాలు ఉండాల్సిన సమయంలో సంభాషణలకు సంబంధించి ఏర్పడే అదనపు దృశ్యాలు వాటితో పోటీపడి, ఏకాగ్రత చెదిరి ప్రమాదాలకు దారి తీయవచ్చు.

**తరగతి గదిలో పాఠమైనా సరే :** అలాగే తరగతి గదిలో అధ్యాపకుడు చెప్పే పాఠంపై దృష్టి కేంద్రీకరించి విన్నప్పుడే అది మనసు ఎక్కు తుంది. పాఠం నుండి ఏ కొద్దిగా దృష్టి మరో విషయంపైకి మళ్ళినా పాఠంతో లింకు పూర్తిగా తెగిపోతుంది. మళ్ళీ తరగతి గది లోకంలోకి వచ్చినా మధ్యలో కొంత విషయం గల్లంతయింది కనుక పాఠం బోధపడదు.

తరగతి గదిలో అధ్యాపకుడు పాఠం చెప్తూ పోవటానికి, ఆయా విషయాలను బోర్డుపై రాసి చిత్రాల ద్వారానో, ప్రదర్శన పరికరాల ద్వారానో వివరించిన దానికి చాలా తేడా వుంది. మాటతో పాటు బొమ్మ జత కూడితే గ్రహించటం సులువవుతుంది.

పదిరకాల పనులు ఏకకాలంలో చేసే ప్రతిసారీ, పొరపాట్లు దొర్లటానికి కారణం 'దృశ్యాల సంఘర్షణే'నని చెప్పుకోవచ్చు.

విషయాన్ని మనోఫలకంపై నిలపటంలో భావచిత్రాల ప్రాధా న్యాన్ని చెప్పటానికే ఇంత వివరణ.

నాటి నుండి నేటి దాకా కవులు, రచయితలు, పాత్రికేయులు తమ రచనలను ఈ దృశ్యసూత్రాన్నే అన్వయిస్తూ వస్తున్నారు.

*పోతనామాత్యుని ఈ భాగవత పద్యం చదవండి.*

*నల్లనివాడు పద్మనయనంబుల వాడు*
*కృపారసంబు పై జల్లెడి వాడు*
*మౌళి పరిసర్పిత పింఛము వాడు*
*నవ్వు రాజిల్లెడు మోము వాడొకండు*
*చెల్వల మానధనంబు దెచ్చెనో*
*మల్లియలార మీ పొదల మాటున*
*లేడు గదమ్మ చెప్పరే.*

ఇది చదువుతున్నప్పుడు కృష్ణుడు మీ మెదడులో ఎలా ఆకృతి తీసుకున్నాడో గమనించండి. కృష్ణుడి రూపలావణ్య విశేషాలను, వ్యక్తిత్వ లక్షణాలను ఎలా ఫోటో తీసి కళ్ళముందు నిలిపాడో పోతన.

అక్షరాలతో అందమైన కృష్ణుడి బొమ్మను చెక్కిన పోతనామాత్యుని ఊహాశక్తికి రచనా నైపుణికి కోటి దండాలు.

ఆధునిక రచయితలపైనా పోతన గట్టిముద్ర వేశాడు. ముళ్ళ పూడి వెంకటరమణ 'శ్రీకృష్ణలీలలు'ను ఇలా మొదలుపెట్టారు.

*నల్లనివానికి*
*తెల్లని నవ్వుల వానికి*
*చల్లని చూపుల వానికి*
*అల్లరి చేష్టల వానికి*
*దేవుడై పుట్టి మనిషిలా నటిస్తూ*
*మహిమలు చేసిన వానికి...*

కృష్ణుడు కనుక, ఏ కాలం వారైనా ఇలా బొమ్మ కట్టించాడు కానీ అన్ని సందర్భాలకు ఇలా చెప్పడం కుదరదని అనుకోవద్దు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, బ్రిటీషు వారి దోపిడీని ఎంత శక్తిమంతంగా మనసులో నాటారో చూడండి.

*భరతఖండంబు చక్కని పాడియావు*
*హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ*
*తెల్లవారను గడసరి గొల్లవారు*
*పితుకుచున్నారు మూతులు బిగియగట్టి*

ఈ పద్యం చదవగానే మన మనసులో రూపుకట్టిన పదచిత్రాల గురించి వివరంగా చెప్పుకోవలసిన పని లేదు.

జనజీవన అనుభవాల నుంచి రూపు తొడిగిన సామెతలు, జాతీయాలు, పొడుపు కథలు, పలుకుబళ్ళలోను, బహురూపాల్లో భావచిత్రాలు సాక్షాత్కరిస్తున్నాయి.

'నల్లని చెరువులో ఎర్రని తామర'

ఈ పొడుపు కథ అల్పాక్షరాల్లో మన కళ్ళలో కోటి దీపాలు వెలిగిస్తోంది. నల్లని చెరువు– నూనె వున్న ప్రమిదకూ, ఎర్రని తామర –వెలుగుతున్న వత్తికి ప్రతీక.

సామెతలు రూపుదిద్దిన బొమ్మలను, వాటిలో ఇమిడి వున్న లోతయిన భావాలను గమనించండి.

- *అన్నీ ఉన్న విస్తరి అణిగే వుంటుంది. ఏమీలేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది.*
- *ముందు నుయ్యి, వెనక గొయ్యి.*
- *కోడలికి బుద్ధి చెప్పిన అత్త తెడ్డు నాకిందట.*
- *తమలపాకుతో తానిట్లంటే తలుపు చెక్కతో నేనిట్లంటి.*
- *తిండికి ఏనుగు, పనికి పీనుగు.*

ఒక్క సామెతలేనా? నడుం బిగించు, దోబూచులాడు వంటి పలుకుబళ్ళలోనూ బొమ్మలే బొమ్మలు.

బొమ్మల గురించి చెప్పుకుంటూ బాపు గురించి చెప్పుకోకుంటే ఎలా?

సినీ గేయ రచయిత వనమాలి, బాపు గురించి ఇలా బొమ్మ గీశారు.

*ఆ కుంచె కదిలితే చాలు*
*అమ్మాయి కళ్ళు నేరేడు పళ్ళు*
*పలు వరుస దానిమ్మ*
*ముక్కు పేరు కోటేరు*
*మెడ ఒంపు శంఖం*
*సన్నాయి నడుము*
*నాగులైనా జడుసుకునే నల్లని వాల్జడ.*

ప్రతిభామూర్తులైన సినిమా సంభాషణల రచయితలు సైతం అంత పెద్ద దృశ్యమాధ్యమం పైనా సంభాషణల ద్వారాను దృశ్యాల పంట పండిస్తున్నారు.

అ ఆ సినిమాలో త్రివిక్రమ్ రాసిన సంభాషణ :

*రోడ్డు వైడెనింగ్‌లో సగం కొట్టేసిన బిల్డింగ్‌లా అయిపోయింది*

*నా బతుకు. ఉండటానికి పనికి రాదు. వదలటానికి మనసు రాదు.*

సినిమా పాట గురించి సిరివెన్నెల సీతారామశాస్త్రి తన పాటల పుస్తకం సిరివెన్నెల తరంగాలుకు ముందుమాటలో ఎంతగా మాటల గారడీతో మనసుకు హత్తుకుపోయేలా రాశారో చూడండి :

*"పాట అనేది ముఖ్యంగా 'సినిమా పాట' అనేది కాగితపు పొత్తిళ్ళలో కలం ప్రసవించిన నాడున్న రూపంతోనే 'అక్షరాలా' అలాగే అత్తింటికి వెళ్ళదు.*

*పుట్టింతర్వాత దర్శక నిర్మాతల పౌరోహిత్యంలో, బారసాల జరుపుకుని 'ఓకే' అని నామకరణం పొందుతుంది.*

*అటుపైన మ్యూజిక్ డైరెక్టర్ కట్టబెట్టే 'బాణీ' వేసుకుని ఈడేరుతుంది.*

*ఆ తర్వాత రికార్డింగ్ థియేటర్లో 'గౌరీపూజ' చేసుకుని ఆర్కెస్ట్రా మేళతాళాల్ని, కోరస్ చెలికత్తెల్ని వెంటబెట్టుకుని, గాయనీ గాయకుల స్వరాలు సింగారించుకుని, కెమెరా సాక్షిగా, వెండితెర మంటపాన వధువుగా ఒదుగుతుంది".*

* * *

పత్రికా రచయితలు, కాలమిస్టులు కూడా సందర్భం కుదిరిన ప్రతిసారీ పదచిత్రాలను గీస్తూనే వస్తున్నారు.

బెల్లంకొండ రామదాసు గురించి అబ్బూరి వరద రాజేశ్వరరావు కవన కుతూహలంలో ఎలా రాశారో చదవండి :

*ఓ రోజు అతని సెలవు రోజున నేను సమయానికి గదికి రాలేకపోయాను. అతనే ఏకగ్రీవంగా కాలక్షేపం చెయ్యవలసి వచ్చింది. నేను పొద్దుపోయి గదికొచ్చాను. బాగా చీకటి పడింది. మా గది మేడమీద ఉంది. ముందు వరండా. మెట్లెక్కి వరండా లోకి కాలు పెట్టాను. గది గుమ్మం దగ్గర తలుపు కానుకొని రామదాసు చీకట్లో కూచుని ఉన్నాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. నాకు భయం వేసింది. లోపలికి అడుగు పెట్టలేకపోయాను. కాసేపు ఆగి 'రామదాసూ!' అని పిలిచాను. తలెత్తి చూశాడు. కళ్ళు తుడుచుకుంటున్నాడు. నా మనసు నా మనస్సుయింది. 'ఏమిటీ గొడవా?' అన్నాను. అతను మాట్లాళ్లేదు. నేను లోపలకు పోయి దీపం వేశాను.*

నిద్రలేమిపై ఈనాడు ఆదివారంలో వచ్చిన ప్రత్యేక కథనం :

*చీకటి రాకసిలా దూసుకొస్తుంది. నిశ్శబ్దం పిశాచ భాషలో శాపనార్థాలు పెడుతుంది. ఆలోచనలు కొరివి దెయ్యాలై పళ్లికిస్తాయి. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టదు. నిద్రలేమి తీవ్ర సమస్యే. అంతకు మించిన మానసిక హింస.*

ఎన్నికల వేళ ఓటరు దేవుణ్ణి ప్రసన్నం చేసుకునేందుకు ఏం చేసేందుకైనా వెకకాడరన్న వార్తా కథనంలో రచనా విన్యాసం చూడండి:

*దేవతా వస్త్రాలతో వారి బంధం అవినాభావం. వాటిలాగే వారి ఉనికీ సాపేక్షమే. కలలో మాదిరిగా అప్పుడెప్పుడో లీలగా చూసిన గుర్తు. ఉన్నారని చెప్పే వారే తప్ప వారిని నిజంగా చూపగల వాళ్ళు లేనే లేరు. అంతటి ఘనులైన మన నేతాశ్రీలు హఠాత్తుగా మన మధ్యకే ఊడిపడితే? ఎండనకా వాననకా ఊరు వాడా, చేనూ చెలకా ఎడాపెడా చుట్టేస్తుంటే? ముఖమంతా నవ్వుతో, ముద్దుమాటలతో మూటలు గడుతుంటే? హామీల పరంపరతో, వాగ్దానాల వర్షంతో ముంచేస్తుంటే? కన్పించిన వారినల్లా గట్టిగా హత్తుకుని నడుములు విరగ్గొడుతుంటే? ఇంకేముంది...ఎన్నికల కాలం వచ్చిందన్నమాటే.*

ఈ ప్రమాద వార్తలోనూ బొమ్మలు ఎలా సినిమా రీలులా కదలాడుతున్నాయో గమనించండి:

*ఆ బస్సు గంటకు 60 మైళ్ళ స్పీడుతో వెళుతోంది. 14వ కిలోమీటరు రాయి కూడా దాటింది. ప్రయాణీకులంతా నిద్రలో జోగుతున్నారు. అంతలో 'ధాం' అంటూ పెద్ద శబ్దం. ఒక్కసారి నిద్ర మేల్కొన్న ప్రయాణికుల్లో కలకలం. ఏమైందో అర్థం కాలేదు. బాంబే మోనని అనుకున్నారు. బస్సు కీచుమనే శబ్దంతో ఆగింది. 'ముందు టైరు పగిలింది. గాభరా పడకండి' అని డ్రైవర్ భరోసా ఇచ్చాడు. 'హమ్మయ్య' అని ప్రయాణికులు ఊపిరి పీల్చుకున్నారు.*

దైనందిన జీవనం, సంఘటనల సమాహారం అందులోనే బోలెదంత నాటకీయత, ఉత్కంఠ, కథా కథనం ఉంటుంది. రామాయణ, భారత, భాగవతాల నుంచి ఈ కాలపు వార్తలు, టీవీ సీరియళ్ళు, సినిమాల దాకా గూడు కట్టిస్తున్న పుల్లా పుడక ఈ సంఘటనలే.

సంఘటనలను జాగ్రత్తగా ఒడిసి పట్టుకుంటే ఆసక్తిగా చదివించేలా, జరిగిన దాన్ని కళ్ళకు కట్టించేలా రాయవచ్చు. చెప్పవచ్చు. జర్నలిస్టులు యదార్థ సంఘటనలకు వార్తారూపం ఇస్తే, రయితలు ఊహాజనిత సంఘటనలతో పాత్రల మధ్య రచనను చేస్తాడు. సామాజిక అనుభవాలే రచయితకూ ఆలంబన.

**ఉదాత్తత ముఖ్యం :** పదచిత్రాలకున్న ప్రాముఖ్యం రీత్యా, పదాలతో భావచిత్రాలు గీసేటప్పుడు పెడర్థాలు స్ఫురించకుండా, పెడదారి పట్టించకుండా జాగ్రత్త వహించాలి. ఉదాత్తతకు భంగం కలగకుండా శ్రద్ధ చూపాలి.

ప్రేక్షకుల ఉత్తమాభిరుచిని పోషించడంలో అలనాటి సినిమా దర్శకులు ఎలా శ్రద్ధ చూపేవారో చెప్పే సంఘటన ఇది.

జమున, రామారావు నటించిన భాగ్యరేఖ సినిమా లోని ఒక సన్నివేశంలో హీరో హీరోయిన్లు బయటకు వెళ్ళటానికి సన్నద్ధమవుతుంటారు. లోపలి గదిలో హీరోయిన్ ముస్తాబు అవుతుంటుంది. తెరమీద హీరో మాత్రమే కనిపిస్తుంటాడు.

ఆమె కోసం నిరీక్షిస్తున్న హీరో 'ఇంకెంత సేపు అలంకరణ త్వరగా తెములు' అంటాడు.

లోపలి అలంకరణ గది నుండి హీరోయిన్ గొంతు మాత్రమే విన్పిస్తుంది. 'వచ్చేస్తున్నాను. రవిక వేసుకుంటున్నాను' అని సమాధానం.

దర్శకుడు బి.ఎన్.రెడ్డి వెంటనే కట్ చెప్పారు. మాటల రచయితను పిలిచి 'ఇంత అశ్లీలం ధ్వనించే సంభాషణ రాశావేమిటి?' అని ప్రశ్నించి సంభాషణను మార్పించారు.

హీరోయిన్ తెరమీద కన్పించకున్నా ఆ డైలాగ్ వల్ల రవిక లేకుండా ఉన్న హీరోయిన్‌ను ప్రేక్షకుడు ఊహించుకుంటాడు. కనుక వద్దని వారించారు. అదీ సంగతి.

**మరో ఉదాహరణ :** పత్రికలో ఒక వార్త ప్రచురితమైంది. ఓ అమెరికా మహిళ బ్రిటన్‌లో పర్యటిస్తోంది. తన బిడ్డ కోసం ఆమె సీసాలో నింపి తెచ్చిన తల్లిపాలను విమానాశ్రయ అధికారులు పారబోయించారు. ఆ వార్త ఇంగ్లీషు కాపీలో బ్రెస్ట్ మిల్క్ రాయడంతో తెలుగులో రొమ్ముపాలు అని అనువదించారు. రొమ్ము పాలు, చనుబాలు అనేవి బ్రెస్ట్ మిల్క్‌కు సమాన పదాలే కావచ్చు. మనకు తల్లి

పాలు, పోతపాలు అనే మాటలూ ఉన్నాయి. రొమ్ము పాలు బదులు తల్లిపాలు అని రాసి ఉండాల్సింది. రొమ్ముపాలు అని చదవగానే తోచే భావానికి, తల్లిపాలు అని చదవగానే తోచే భావానికీ తేడాను వివరించనక్కలేదు.

రచయితలు, జర్నలిస్టులు పదప్రయోగంలో ఎంత సున్నితంగా ఆలోచించాలో చెప్పటానికే ఈ ఉదాహరణ. విషయం ఎటువంటిదైనా సున్నితత్వం మాత్రం వీడకూడదు. వారంలో పెళ్ళి పీటల మీద కూర్చోవలసిన వాడు పాడె ఎక్కాడు' అని మొరటుగా రాసేస్తున్నారు. ఇది క్షమార్హం కాదు.

**వర్ధమాన రచయితలకు, జర్నలిస్టులకు సూచనలు :**

❋ భాషపై ప్రేమను పెంచుకోండి. అక్షరాలపై మక్కువ పెంచు కోండి. వివిధ రకాల రచనలను చదవడం వల్లనే భాషపై పద ప్రయోగంపై పట్టు వస్తుంది. మంచి పదాన్నో, వాక్యాన్నో, వ్యక్తీకరణనో చదివినపుడు దాన్ని ఏడైరీలోనో రాసుకుని భద్రపరచండి. మీ మన సుకు నచ్చిన వాక్యాలను, విభిన్న శైలీ…అడపా తడపా తిరగేస్తూ అక్షరాల వానలో ఆనందంగా తడిసి ముద్దవండి. మీరూ అంత బాగా రాయటానికి తపించండి.

❋ సమాచార సేకరణకు ఘటనాస్థలికి వెళ్లటాన్ని రిపోర్టర్లు తగ్గిం చారు. చరవాణి అందుబాటులోకి వచ్చాక ఎంత పెద్ద సంఘటన జరిగినా కాలు కదపకుండా సంబంధిత అధికారుల నుంచి వివరాలు సేకరించి వార్త రాస్తున్నారు. సంఘటనాస్థలికి వెళ్ళి అక్కడి పరిస్థితులను స్వయంగా చూసి రాసిన కథనానికి జవం, జీవం వస్తుంది. వార్తకు రంగు, రుచి, వాసనలను జోడించ వచ్చు.

❋ రోడ్డుమీద రిక్షావాలానో, కూరలబ్బో ఎలా చెప్తాడో గమనిం చండి. ఎలా మొదలుపెట్టి ఎలా ముందుకు తీసుకువెళ్తున్నాడో పరిశీలించండి.

❋ మీరు ఏం చూశారో అది రాసి విడిచిపెట్టండి. చాలా పఠనీయ కథనాలకు ఇదే ఆలంబన.

❋ పరిస్థితిని మీరు విశ్లేషించకండి. అక్కడి పరిస్థితులను వివరిస్తే చదివినవారు, చూసినవారు తమకు తాము విశ్లేషించుకో గలరు.

❋ విశేషణాలను వాడకండి. దారుణ హత్య జరిగిందనకండి. హతుడి శరీరంపై కత్తిపోట్లు ఎన్ని ఉన్నాయో, రక్తం ఎలా ధారలు కట్టిందో, సంఘటనాస్థలిలో పరిస్థితి ఎలా ఉందో చెప్పండి.

❋ పరిస్థితి నాటకీయంగా ఉందని చెప్పకండి. అదెలా నాట కీయంగా మారిందో వివరించండి.

**పదచిత్రాలపై సాధన చేయదలిచనవారి అభ్యాసం కోసం :**

1. ఓ దీపావళి నాడో, ఈద్‌నాడో, క్రిస్మస్‌నాడో పండగ ఉత్సాహం ఎలా ఉందో గమనించి అక్షరాల్లో మలచండి.
2. బతుకమ్మ పండగనాడు మహిళల ఆట, పాటను ఎలా పదాల్లో చిత్రీకరిస్తారు?
3. బాంబు వదంతితో భీతిల్లిన ప్రజల మానసిక స్థితి, క్షోభ, ఉరుకులు, పరుగులు ఎలా ఉంటాయి?
4. ఓ పున్నమినాడు గోదావరి ఒడ్డున ఇసుకతెన్నెల్లోని శోభ ఎలా ఉంది?

❋

పుస్తక సమీక్ష

## పిడికిలి బిగించిన పూలు




అనగనగా ఒక రాజు. ఆ రాజుకి ఏడు గురు కొడుకులు అంటూ మన కథలన్నీ పిల్లలతోనే మొదలవుతాయి. పూర్వం పిల్లలు లేని రాజులు పుత్రకామేష్టి యాగాలు చేశారు. ఇప్పుడు నగరాల్లో అనేకచోట్ల సంతాన సాఫల్య కేంద్రాలు పుట్ట గొడుగుల్లా మొలుస్తున్నాయి. ఒకప్పుడు టెస్ట్‌ట్యూబ్ బేబీల్ని సృష్టిం చారు. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా అద్దె గర్భాలు మోసే తల్లులు ఎంతోమంది సంతానం లేని స్త్రీలకు సంతానాన్ని అందిస్తున్నారు.

శిరంశెట్టి కాంతారావు గారు అద్దె గర్భాల గురించి రాసిన నవల పూలకుండీలు. రచయిత ఇంతకుముందే కథకులుగా, నవలా రచయితగా ప్రసిద్ధులు. చదువు, వైద్యం సమస్తం వ్యాపార మయమైన ఈనాడు అద్దె గర్భాల చుట్టూ ఒక విషవలయం ఏర్పడింది. మధ్య దళారీలు, ఆస్పత్రి యాజమాన్యం, కమీషన్లు వీటన్నిటి మధ్య అసలు అద్దె గర్భం మోసే స్త్రీకి ఇవ్వాల్సిన డబ్బులు ఇవ్వకుండా ఎగ్గొట్టడం, నిరక్షరాస్యులైన పేద స్త్రీలను దోపిడీ చెయ్యడం వీటన్నిటినీ రచయిత ఈ నవలలో చక్కగా చిత్రించారు.

రెక్కాడితే గాని డొక్కాడని ఒక నిరుపేద మహిళ శాంతమ్మ. ఇందిరమ్మ ఇళ్ళ వ్యూహంలో చిక్కుకొని అప్పు ఒక ఉరితాడై మెడకు చుట్టుకుంటుంటే దాన్ని తప్పించుకోలేక తిప్పలు పడుతుంది. మధ్యవర్తి ఆర్.ఎం.పి.మాయమాటల్లో చిక్కుకొని అద్దెగర్భం మోయడానికి సిద్ధపడుతుంది. భర్త ఎల్లయ్య నాలుగు డబ్బులు సంపాదించాలని ముంబై వెళ్ళిపోతాడు. ఏడు నెలల తర్వాత భర్త వచ్చి, విషయం తెలుసుకొని భార్య వున్న కార్పొరేట్ ఆస్పత్రికి వస్తాడు. ఆస్పత్రి యాజమాన్యం అతణ్ణి ఈ లోపలికి రానియ్యరు. పిల్లలతో, తల్లిదండ్రులతో రోడ్డుమీద ధర్నా చేస్తాడు భార్యను చూపించమని. ఆస్పత్రి యాజమాన్యం పోలీసుల్ని పంపి ఆ ప్రయత్నాన్ని భగ్నం చేస్తారు. పోలీసులు ఎల్లయ్యను కొట్టు కుంటూ స్టేషనుకు తీసుకువెళ్తుంటే మహిళా సంఘం వారు వచ్చి పోలీసుల్ని ప్రతిఘటించి అద్దె గర్భాల మీద, దళారుల మీద తమ నిరసన గళాల్ని వినిపిస్తారు.

ఏ అన్యాయాన్నయినా ప్రతిఘటించాలంటే ఒక్కరి వలన సాధ్యం కాదనీ, అందరూ కలిసికట్టుగా వుంటే రాజ్యాన్నైనా, వ్యవస్థనైనా ఎదిరించవచ్చని రచయిత ఈ నవలలో సూచిస్తారు. పూలకుండీలు కేవలం కాలక్షేపం నవల కాదు. నవల చదివాక మన మనసులో ఈ అరాచక వ్యవస్థపై ఆగ్రహం ఆవేశం కలుగుతాయి. ఆలోచింపజేసే ఈ నవల రాసిన కాంతారావు గారు అభినందనీయులు.

ప్రతులకు : శిరంశెట్టి కాంతారావు, 1-1-177, మమతల కోవెల, శ్రీనివాసపురంకాలనీ, పాత పాల్వంచ-507 115, ఉభయ తెలుగు రాష్ట్రాల్లోని అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో.

**-మందరపు హైమవతి**, 94410 62732

బయటి తెలుగు బతుకు కతల మాలిక-3



# ఓ సంచారి అంతరంగం

కుప్పె నాగరాజు గారు కన్నడంలో రచించిన 'అలెమారియ అంతరంగ'కు రంగనాథ రామచంద్రరావు గారి తెలుగు అనువాదం

## అక్షరం తల్లి కొంగును పట్టుకునీ ...

మేము కొడుగు, కొంగామలె చుట్టుకుని వచ్చేంతలో మా ఊరికి ఒక ప్రభుత్వ పాఠశాల మంజూరైంది. ప్రభుత్వం నుంచి జీతం తీసుకునే ఒక మాస్టారు వచ్చారు. ఆయనకు కూర్చోడానికి ఒక కుర్చీకానీ, పిల్లలకు అక్షరాలు రాసి చూపడానికి ఒక నల్లబల్ల కానీ ఉండలేదు. ఊరి ప్రముఖులైన శ్రీనంజప్పగారి ఇంటి అరుగు మీద పాఠశాల మొదలైంది. మాస్టారు లక్ష్మణశెట్టిగారు ఊరంతా తిరిగి పదిపదిహేనుమంది పిల్లలను ఒకచోట చేర్చి అక్షరాలు దిద్దించటం మొదలుపెట్టారు. ఎన్నడూ పాఠశాల ముఖం చూడని ఆ పిల్లలు, వాళ్ళ తల్లితండ్రుల ఒత్తిడికి ఆ పాఠశాలకు వచ్చి ఆ అరుగు మీద కూర్చునేవారు. ఆ మాస్టారు మా గుడిసెలకూ వచ్చి పిల్లలను బడికి పంపమని చెప్పేవారు. నా కంటే పెద్దవాళ్ళయిన మా అన్నయ్యను, చిన్నాన్న కొడుకును పాఠశాలలో చేర్చటానికి ప్రయత్నించి ఇంటివాళ్ళు విఫలమయ్యారు. వాళ్ళిద్దరూ పాఠశాలవైపు ముఖం చూపకుండా అడవులు, మైదానాలు తిరిగేవాళ్ళు. పాఠశాలలో చేర్చే ప్రయత్నం విఫలం కావటంతో మేకలు, పశువులు కాయనీలే అని ఊరకయ్యారు. ఆ కాలంలో ఆడపిల్లలను పాఠశాలలో చేర్చాలనే జ్ఞానం లేని కారణంగా మా అక్కను పాఠశాలలో చేర్చనే లేదు. ఆ కాలంలో ఏ ఆడపిల్ల కూడా మా ఊళ్ళోని బడిలో ప్రవేశం పొందలేదు.

లక్ష్మణశెట్టి మాస్టారుగారు తమ ప్రయత్నం విరమించకుండా మమ్మల్ని పాఠశాలలో చేర్చేలా మా నాన్నను ఒత్తిడి పెట్టారు. వారి బలవంతానికి మా తల్లితండ్రులు, 'వీడు ఇంట్లో ఉండి చేసేదేముంది, ఆ బడి అరుగు మీద కూర్చుని రానీలే' అని బడికి పంపారు. నేను చేరినట్లే పదిపదిహేనుమంది పిల్లల పేర్లు పాఠశాల హాజరు పుస్తకంలో ఉంటే, బడికి సరిగ్గా వస్తున్న పిల్లలు అయిదారుగురు మాత్రమే! మా వీధిలోని పిల్లలు ఎవరూ వచ్చేవారు కాదు. వాళ్ళ తల్లితండ్రుల తోక



పట్టుకుని ఊరూర్లా తిరిగేవారు. లేదా మేకలు, పశువులు కాయ టానికి వెళ్ళేవారు.

దారి పక్కన ఉన్న మా గుడిసెలు ఆ దారి గుండా వెళ్ళే జీపులు, కార్లలో తిరిగే జనుల దృష్టిని ఆకర్షించినట్టు కనిపిస్తోంది. ఒక రోజు మా గుడిసెల ముందు సర్కారు జీపు వచ్చి ఆగింది. సామాన్యంగా పగటిపూట మా గుడిసెల్లో మగవాళ్ళు ఎవరూ ఉండేవారు కాదు. ఉదయం లేవగానే వారి దైనందిన కాయకానికి వాళ్ళు వెళ్ళేవాళ్ళు. ఇండ్లలో ఉన్న ఆడవాళ్ళు, పిల్లలు జీపు రావటం చూసి ఆశ్చర్యానికి, కలవరానికి లోనయ్యారు. ఎందుకు వచ్చారో, తమ వల్ల ఏమి తప్పు జరిగిందోననే భయం వాళ్ళను కమ్ముకుంది. జీపు నుంచి దిగిన అధికారులు "ఇంట్లో మగవాళ్ళు లేరేమమ్మా" అని అడిగారు. "లేదు స్వామి. యాడాడికో పోయిండారు" అని జవాబు ఇచ్చారు. మేము ఎవరమో, ఏమిటో విచారించుకున్న అధికారులు, "చూడండి, మీ లాంటివారి పిల్లలకు ప్రభుత్వంవారు విద్యాబుద్ధులు నేర్పటానికి ఆశ్రమ పాఠశాలలు తెరిచారు. అలాంటి ఒక పాఠశాల హుణసూరుకు అవల కోటెకు వెళ్ళే దారిలో 'నల్లూరుపాల' అనే ఊళ్ళో ఉంది. అక్కడ మీ పిల్లలకు భోజనం, బట్టలు ఉచి



తంగా ఇచ్చి చదువు చెబుతారు. మీ పిల్లలను అక్కడ చేర్చండి." అని వివరంగా చెప్పి, "ఇంటి మగవాళ్ళు వచ్చాక విషయం తెలపండి. మరొక రోజున మేము వచ్చి మాట్లాడి పిల్లలను పిల్చుకునిపోతాం" అని చెప్పి జీపు ఎక్కారు.

తన కాయకం ముగించి సాయంత్రం నాన్న చంకలో ధవస ధాన్యాలు నిండిన జోలెతో, తల మీద గడ్డిమోపుతో వచ్చాడు.మేము కూడా ఈ మధ్యన రైతులను అనుకరిస్తూ ఆవులను, మేకలను సాకడం మొదలుపెట్టాం. మా అన్నయ్య అడవులకు, పచ్చికబయళ్ళకు తీసుకెళ్ళి వాటిని మేపుకుని వచ్చేవాడు. రాత్రి పశువులను ఖాళీకడుపుతో కట్టివేయకూడదని నాన్న అక్కడక్కడ రైతులను అడిగి ఒకటో రెండో గడ్డిమోపులను తెచ్చేవాడు. ఇంటికి తిరిగొచ్చిన నాన్నకు అమ్మ జీపులో అధికారులు వచ్చి చెప్పిపోయిన విషయాన్ని తెలిపింది. అధికారుల మాటల్లోని విషయం సమంజసమైందని ఎక్కడో మనసు మూలలో నాన్నకు, అమ్మకు అనిపించింది. ఈ విషయాలలో అవగాహన వున్నటువంటి, రాయటం, చదవటంలో జ్ఞానం ఉన్నటువంటి, కచేరీ కార్యకలాపాలు, చట్టపరమైన వ్యవహారాలు తెలిసినటువంటి, ఆ విషయంగా ఊర్లపై తిరుగుతుండే గోవిందప్పగారితో నాన్న మాట్లాడాడు. ఈ విషయం అప్పటికే తెలిసిన ఆయన కూడా ఈ విషయం గురించి గంభీరంగా ఆలోచించసాగాడు. ఇంటి పెద్దలు, మా చిన్నాన్న అధ్యక్షతన కూర్చుని విచారించి పిల్లలను నాలుగు అక్షరాలు నేర్చుకోవటానికి ఆశ్రమ పాఠశాలలో చేర్చటమే సబబు అనే నిర్ణయానికి వచ్చి మానసికంగా సిద్ధమయ్యారు.

అధికారులు చెప్పినట్టుగానే ఒక వారం తరువాత జీపులో మా గుడిసెలకు వచ్చారు. ఏళ్ళకు ఏళ్ళు పిల్లలను దూరంగా పంపకుండా తమ తోకల్లా వారిని తమ వెంటబెట్టుకుని తమ పారంపరిక వృత్తినే వారికి నేర్పిస్తూ ఉన్న తల్లితండ్రులకు ఈ ఎడబాటు భరించటం అంత సులభంగా ఉండలేదు. ఏదో మొండి ధైర్యంతో నాతోపాటు ఐదుమంది పిల్లలను ఆ జీపులో ఎక్కించి, హుణసూరు బిడిఓ ఆఫీసువరకు మా చిన్నాన్నను తోడుగా పంపారు. అక్కడున్న బిడిఓకు మా జనాంగంతో పరిచయమై ఆ రోజే అదే జీపులో మమ్మల్ని కూర్చోబెట్టుకుని 'నల్లూరుపాల' హాస్టల్‌కు పిలుచుకునిపోయారు. ఆ గిరిజన ఆశ్రమ పాఠశాల ముఖ్యంగా హుణసూరు తాలూకాలో నివసిస్తున్న ఆది వాసీ మరియు సంచార జాతుల పిల్లల విద్యాభ్యాసం కోసం ప్రభుత్వం తెరిచిన పాఠశాల. అక్కడ సంచార సముదాయాలైన హక్కిపిక్కి, బుండబెస్త, ఆదివాసీలైన కాడుకురుబ, జేనుకురుబ మొదలైన సము దాయానికి చెందిన పిల్లలు ఆశ్రయం పొందారు. ప్రప్రథమంగా దొమ్మరి దాసరులమైన మేము ఐదుమంది పిల్లలం అక్కడ చేరాం.

ఆశ్రమపాఠశాలలో మాతృహృదయాన్ని కలిగిన మాస్టారు ఉండేవారు. ఆయన పేరు కె.వి.శివణ్ణ. ఆయన ఆరోజు మమ్మల్నంద రినీ ఆత్మీయంగా పలకరించి, కప్పుకోవడా నికి కొత్త కంబళి, పరుచుకోవటానికి టార్పాలు, చాప, తలాపుకు తలదిండు ఇచ్చి, ఒక గదిలో మమ్మల్ని చేర్చి అక్కడున్న పాత విద్యార్థు లకు మమ్మల్ని పరిచయం చేశారు. మేము దూరం నుంచి వచ్చామని, మమ్మల్ని చక్కగా చూసుకోవాలని, భయపెట్టకండని వాళ్ళను హెచ్చ రించారు. ఆ రాత్రి మాకందరికి చక్కటి భోజనం కడుపు నిండా పెట్టించి, అక్కడే ఉన్న తమ ఇంటికి వెళ్ళారు. ఆ కొంగ్రొత్త కంబళి, తలదిండు స్పర్శలకు నాకు మా ఇంట్లోని చింకి చాప, పాతగుడ్డలను మూటకట్టి తయారుచేసిన తలదిండు, కప్పుకోవటానికి అనేక పాత చీరలు, పంచలతో కుట్టిన దుప్పటిలాంటి బొంత– ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఈ రాజభోగాల ఏర్పాటు, రంగుల గచ్చునేల, పెంకులు పరిచిన పైకప్పు, చుట్టూ కట్టిన ఇటుకల గోడ, వెలుగుతున్న గ్యాస్ లైట్, వీటి చిత్రాల వల్ల నేనేదో కలల లోకంలో ఉన్నట్టు అనిపించింది.

## అక్షరాలకు ఎద తెరిచినమిత్రులతో

నా సహాధ్యాయులుగా వచ్చిన శేష, వెంకటరాజ, కోదండ, వెంకటేశ -వీళ్ళందరికి ఈ వైభోగాలు వద్దనిపించి, తల్లితండ్రులు గుర్తొచ్చి ఒక రాత్రి అందరూ నిద్రలేకుండా గడిపారు. ఉదయం మాస్టారు వచ్చి మమ్మల్ని పలకరించి దేనికీ భయపడకండి, ఏదైనా ఇబ్బంది కలిగితే తన దృష్టికి తీసుకుని రండని ధైర్యం చెప్పారు. ఆ ఆశ్రమపాఠశాలలో హక్కిపిక్కి సముదాయానికి చెందిన బసోజు మరియు బాలోజి అనే ఇద్దరు వంటవాళ్ళు ఉన్నారు. వాళ్ళు మమ్మల్ని బాగా చూసుకునేవాళ్ళు. అక్కడున్న పిల్లలందరికి వాళ్ళ వాళ్ళ మాతృభాషలున్నాయి. ఒక సముదాయపు పిల్లలు మరాఠీ మాట్లాడితే, మరొకరు ఫార్ది, ఇంకొకరు తెలుగు, మా కాడుకురుబ, జేనుకురుబ పిల్లలు కన్నడ భాషను పోలినట్టున్న అయితే కన్నడవారికి అర్థం కాని భాషలో మాట్లాడేవారు. ఈ ఆశ్రమ పాఠశాల ఒక మినీ భారతంలా ఉన్నంటుండేది.

మేము ఈ పాఠశాలలో చేరి అప్పటికే ఒక వారం గడిచింది. ఎన్నడూ తల్లితండ్రులను వదలి ఉండని మాకు సహజంగానే ఇంటి వాళ్ళు గుర్తొచ్చేవాళ్ళు. మనస్సు ఇంటివైపు లాగేది. స్వేచ్ఛగా అడవిలో ఎగురుతూ ఉన్న పక్షిని బంగారు పంజరంలో బంధించి పంచభక్ష్యాలను వడ్డించిన పరిస్థితి మాది. మా జతగాళ్ళు తల్లితండ్రులను గుర్తుచేసుకుని ఏడ్చేవాళ్ళు. నేను కొంచెం ధైర్యంగా ఉండేవాడిని. ఒకరోజు ఉదయం ఎప్పటిలా మేమంతా దైనందిన కాలకృత్యాలు ముగించుకుని రావటానికి కాలువవైపు వెళ్ళి వచ్చాం. పాఠశాలకు వెళ్ళడానికి మునుపు ఎప్పటిలా భోజనాలు చేశాం. భోజనాల తరువాత ఆ కుర్రవాళ్ళు బడికి రానేలేదు. అందరూ దొంగతనంగా ఊరి వైపు పరుగులు తీశారు. పిల్లల కోసం మాస్టార్లు అన్ని చోట్లా వెతికారు. అయితే వారు కంటికి కనిపించకుండా మాయమయ్యారు. అక్కడి నుంచి మా ఊరు సుమారు 25 కిలోమీటర్లు. అంత దూరం నడుచుకుంటూ వెళ్ళి ఊరు చేరారు. మాఊరి పాఠశాల నుంచి నేను టి.సి. వగైరా తీసుకుని పోలేదు. నా పేరు, తల్లితండ్రుల పేర్లు తప్ప ఇంకేమీ తెలియని నన్ను శివణ్ణమాస్టారు నేరుగా 3వ తరగతిలో చేర్చుకున్నారు. ఆయన నా వయసు ఊహించి పుట్టిన తేదీని నమోదు చేసుకున్నారు.

ఆ పిల్లలు చెప్పాపెట్టకుండా ఇంటికి తిరిగివెళ్ళిన తరువాత నేను ఒంటరినయ్యానని మా అమ్మ నన్ను చూడటానికి పాఠశాలకు వచ్చింది. నన్ను చూడగానే సంతోషంతో కౌగిలించుకుంది. ఇంటి నుంచి కోడిగుడ్లు ఉడికించుకుని, దోసెలు చేసుకుని వచ్చింది. నా చేత తెచ్చినవన్నీ తినిపించి, మాస్టారు దగ్గర "నా కొడ్నును సక్కంగా సూస్కోండయ్య" అని చెప్పి కంట తడిపెట్టింది.

రోజులు గడిచినట్లల్లా నేను ఆ పాఠశాల వాతావరణానికి, ఆ గ్రామ పరిసరాలకు సర్దుకుపోసాగాను. ఆ మాస్టారు చదువుపట్ల నా ఆసక్తిని గమనించి నా పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపేవారు. వారి శ్రీమతిగారికీ నేనంటే ఇష్టం. ఆమెకు అప్పుడే ఒక బిడ్డ పుట్టాడు. నేను అప్పుడప్పుడు ఆ బిడ్డను ఎత్తుకుని ఆడించేవాడిని. ఆమెకు చిన్నచిన్న పనులు చేసిపెట్టేవాడిని. ఆమె కూడా నన్ను వారి ఇంటి సభ్యుడన్నట్టు చూసుకునేది.

ఆ ఊళ్ళో రెండు కాలువలు, ఒక వాగు ప్రవహించేవి. పాఠశాలకు దగ్గర్లోనే ఉన్న చిన్న కాలువకు దైనందిన కాలకృత్యాలు ముగించటానికి మేము వెళ్ళేవాళ్ళం. ఆ కాలువకు వెళ్ళే దారిలో గుండురావుగారి జమీను ఉంది. ఆయన ఆ ఊరి జమీందారు. ఆ జమీను లోనే ఇల్లు కట్టుకున్నారు. వారి పొలంలోనే ఒక ఈశ్వరుని ఆలయం ఉండేది. ఆ ఆలయం ముందు ఒక గన్నేరు చెట్టు ఉండేది. మేము ఉదయం ఆ కాలువలో కాళ్ళు చేతులు, ముఖం కడుక్కుని ఆ చెట్టు కొమ్మలనుంచి పువ్వులు రాల్చి, లింగంమీద పువ్వులు వేసి ప్రతిరోజు మొక్కుకుని వచ్చేవాళ్ళం. ఆ ఈశ్వరాలయం మావల్ల రోజూ పువ్వులను చూసేది.

వారానికి ఒక రోజు మమ్మల్ని పెద్ద కాలువకు తీసుకెళ్ళేవాళ్ళు. బట్టలు ఉతుక్కోటానికి, స్నానం చేయటానికి తీసుకెళ్ళేవాళ్ళు. మా వెంబడి వంట పని చేస్తున్న జాలోజి లేదా బసోజి వచ్చేవాళ్ళు. పిల్లలందరికీ వారానికి ఒక ముక్క బట్టలసబ్బు, ఒక్కొక్క లైఫ్‌బాయ్ సోపు, తలకు పూసుకోవడానికి నూనె ఇచ్చేవాళ్ళు. బట్టలను నీళ్ళలో అద్ది మాకు వచ్చినట్టు ఉతుక్కునేవాళ్ళం. మా కంటే పెద్ద వయస్సు పిల్లలు ఆ కాలువలో దూకి ఈతకొట్టేవారు. చిన్నపిల్లలు ఒడ్డున కూర్చుని మోకాళ్ళ లోతు నీళ్ళలో తల ముంచి సబ్బు పట్టించి స్నానం చేసి వచ్చేవాళ్ళం. అందరి బట్టలు ఆరిన తరువాత హాస్టల్‌కు తిరిగొచ్చేవాళ్ళం. వేసవి కాలంలో కాలువలో నీళ్ళు ఉండేవి కావు. దాంతో అక్కడికి కొద్దిదూరంలో ఉన్న లక్ష్మణతీర్థ నదికి వెళ్ళి స్నానం చేసి వచ్చేవాళ్ళం. ఈ విధంగా నీటితో సంపర్కం పెరుగుతూ నేను భయపడటం మాని ఈదటం నేర్చుకున్నాను. వారానికో, పక్షం రోజులకో నన్ను చూడటానికి వస్తున్న అమ్మ నా బట్టలు ఉతికి నాకు స్నానం చేయించేది. అమ్మ వస్తే నాకు పరమానందం కలిగేది. అమ్మ నా కోసం తినడానికి ప్రత్యేకంగా ఏమైనా చేసుకుని వచ్చేది. మాంసాహారం తప్పకుండా తెచ్చేది. అమ్మకు ఇంత దూరంలోని ఊళ్ళో కొడుకును వదిలాననే బాధ ఉండేది. నేనే అమ్మకు ధైర్యం చెప్పి పంపేవాడిని.

నేను ఆశ్రమ పాఠశాలలో చేరిన కొద్ది రోజులు గడిచిన తరువాత రత్నపురి సమీపంలోని కెంచనకెరె హొసకోటెకు చెందిన హేళవర (ఒక ఆదివాసీ తెగకు చెందిన) కాలనీ నుంచి కొంతమంది పిల్లలను తెచ్చి ఈ పాఠశాలలో చేర్చారు. వాళ్ళల్లో వయసు మీరిన పిల్లవాడు ఒకడుండేవాడు. అతని పేరు మూర్తి. మిడిల్ స్కూల్ ముగించి హైస్కూల్‌లో చేరవలసినవాడు. అతనికి చదవుకోవాలనే ఆసక్తి ఉన్నట్టు లేదు. ఇతర విషయాల్లో చాలా చురుగ్గా ఉండేవాడు. అతను సహజంగానే మా నాయకుడయ్యాడు. శనివారం, ఆదివారం మరితర సెలవు రోజుల్లో అతని నాయకత్వంలో అడవులు, పచ్చికబయళ్ళు, వాగులు, వంకలు , చెరువులు, కట్టలవైపు తిరగడానికి వెళ్ళేవాళ్ళం. అక్కడ దొరికే పళ్ళు, కాయలు, దుంపలు, గడ్డలు, పొలాల్లో పండుతున్న వేరుసెనగలు, రాగికంకులు, అలసందలు, కందికాయలు పెరికి నిప్పుల్లో వేయించుకుని తినేవాళ్ళం. పొలం బయల్లోని తొర్రల్లో ఉన్న ఎండ్రకాయలు, వాగు గట్టు పక్కని బిలాల్లోవున్న తొండలను, ఎలుకలను పట్టుకుని కాల్చుకుని తినేవాళ్ళం. మూర్తి మాకు మార్గదర్శకుడిగా ఈ విద్యలను నేర్పించేవాడు. పక్షిగూళ్ళల్లో చేయిపెట్టి గుడ్లు ఉంటే తీసేవాళ్ళం. ఇలా రకరకాల క్రియల్లో మునిగి సెలవుల్లో మజాను అనుభవించేవాళ్ళం. శనివారంనాటి మరొక ఆకర్షణ శనిదేవుడి ఆలయానికి వెళ్ళిరావటం. నల్లూరుపాల నుంచి కోటెకు వెళ్ళే మార్గంలో సుమారు 3-4 కి.మీ. దూరం వెళితే హొసూరు అనే పల్లె కనిపిస్తుంది. అక్కడి ప్రధాన మార్గంలో శనిదేవుని ఆలయం ఉంది. ఆ దేవాలయపు అర్చకుడి ఒంట్లో శనిదేవుడు వచ్చేవాడు. ❋

పొరుగు తెలుగు

# అడుగడునా వెలుగు- ఖరగ్‌పూర్ తెలుగు

-బద్రి కూర్మారావు
9849316730

**ప**శ్చిమబెంగాల్‌లోని ఖరగ్‌పూర్‌తో నాకు 35 ఏళ్ళ అనుబంధం ఉంది. చిన్నాన్న కీ.శే. బద్రి కామేశ్వరరావు ఖరగ్‌పూర్ ఐ.ఐ.టిలో చిన్నపాటి ఉద్యోగి. చిన్నతనంలో పేదరికంతో (శ్రీకాకుళం జిల్లా సోంపేట ప్రాంతంనుండి) ఇంటినుండి పారిపోయి అందరూ వలస పోతున్న ఖరగ్‌పూర్ చేరుకున్నారు. అపుడే ప్రారంభమౌతున్న ఖరగ్ పూర్ ఐ.ఐ.టి (1951)లో కూలీ పనితో ప్రారంభమై 4వ తరగతి ఉద్యోగిగా మారాను. చిన్నాన్న లాంటి తెలుగువారెందరో. నా పదవ తరగతి పూర్తయ్యాక ఖరగ్‌పూర్ వెళ్ళాను. రెండవ ఆంధ్రగా పిలిచే వారు. ఖరగ్‌పూర్ రైల్వే స్టేషన్ మొదలు కొని ఐ.ఐ.టి.. ఇంకా ఏ ప్రాంతానికి వెళ్ళినా బెంగాలీ, హిందీ రాదన్న భయం అక్కరలేదు. అంతగా తెలుగు జీవితాలు అక్కడ పెనవేసుకపోయాయి.

ఇరవయ్యేళ్ళ తరువాత (2016) మరల ఖరగ్‌పూర్ వెళ్ళాను. ఖరగ్‌పూర్ ప్రపంచంలోకెల్లా అతి పొడవైన రైల్వే ప్లాట్ ఫాంతోపాటు భారత దేశ మొదటి ఐ.ఐ.టికి, ఆసియాలో అతిపెద్ద రైల్వే వర్కుషాపు (1902)కు ప్రసిద్ధి చెందినది. దీనితో ఉత్తరాంధ్ర జిల్లాలైన శ్రీకాకుళం, విశాఖపట్టణం నుండి ప్రజలు ఉద్యోగ అన్వేషణకు వచ్చి స్థిరపడ్డారు. తరువాత తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాల నుండి, మరి కొన్ని ప్రాంతాల నుండి తెలుగువారు వచ్చి చిన్నదో, పెద్దదో ఉద్యోగంలో స్థిర పడ్డారు. ఇక కలకత్తాలో గోగునార మిల్లులు స్థాపించ డంతో హౌరా, సంత్రాగచ్చి, ఉల్బెరియా, చంగేల్, టిటాఘర్ ప్రాంతాలకు అప్పటి గంజాం, విశాఖపట్టణం తెలుగు వారు పనిచేయడానికి వలసవచ్చారు.

బ్రిటిష్‌వారి ప్రాపకంతో పాటు, బెంగాలీల అభిమానం చూర గొన్నారు. తరువాత తమభాషా సంస్కృతులను కాపాడుకున్నారు వీరంతా ప్రస్తుతం నాలుగవ తరానికి చెందినవారు.

ఖరగ్‌పూర్ ఒక మినీ ఇండియా. ఖరగ్‌పూర్ తెలుగువారు తమ భాషాసంస్కృతులను కాపాడుకోవడానికి ఆంధ్రభవన్, ఆంధ్ర హైస్కూలు పేరుతో (1954) లో మాధ్యమిక పాఠశాల నిర్మించారు. ప్రతి తెలుగువారు తమ పిల్లలను అదే పాఠశాలలో చేర్పించారు.

**తెలుగు వారు నివసిస్తున్న ప్రదేశాలు :**

తెలుగువారు కొత్తకోళి, పాతకోళి (ఓల్డ్‌సెటిల్‌మెంటు) అయిమా, మలంచా, నిమాపురబస్తీ, రైల్వే కోలనీ, జైన్‌నగర్, ఖరీదా, పూరీగేట్, బిశ్వారంజన్ నగర్‌లలో అధిక సంఖ్యలోగలరు. రిక్షా కార్మికునితో పాటు ఉన్నత ఉద్యోగస్తుల వరకు తెలుగువారున్నారు.

**సామాజిక కులాలు :**

అధిక సంఖ్యలో గవర్లు, యాదవులు తోపాటు బ్రాహ్మణులు, శిష్టకరణాలు, తెలగాలు, శెట్టిబలిజలు, దేవాంగులు, విశ్వబ్రాహ్మణులు, మత్స్యకారులు, తెలుకులవారు, రెడ్డి, కమ్మ, కాపు, రాజులు, వైశ్యులు, మాల, మాదిగ, చాకలి, మంగలి వంటికులాలు వారున్నారు. వీరిలో కొన్ని కులాలకు కులసంఘాలు (గవర కుల సేవాసంఘం, యాదవకుల సంఘాలు మొ॥ గలవు) వీటికి యాభైఏళ్ళ పై చరిత్ర ఉంది. శుభ, అశుభ కర్మలలో ఒకరి కొకరు చేదోడువాదోడుగా ఉంటారు. యాదవ కులసంఘంలో ఎవరైన చనిపోతే దహన ఖర్చుల నిమిత్తం రెండువేల రూపాయలు ఆయింటికి యివ్వడం ఇప్పటికీ కొనసాగుతుంది.

**మాతృభాష- పాఠశాలలు:**

మాతృభాషను పరిరక్షించుకోవడానికై 1944లో నెలకొల్పిన తెలుగు విద్యాపీఠ్, 1954లో నెలకొల్పిన ఆంధ్రోన్నత పాఠశాల, సుభాష్ ప్రైమరి పాఠశాల (1964) గురజాడ విద్యాలయం (1970) లయంతో ఆరు ప్రాథమిక పాఠశాలలు, అయిదు ఉన్నత పాఠశాలలు, రెండు హయ్యర్ సెకండరీ పాఠశాలలు నిన్నటివరకు తెలుగు మాధ్యమంతో సాగాయి. తెలుగు జాతిని, భాషను ఇనుమడింపజేసాయి.

**గుడులు- గోపురాలు :**

తెలుగువారు వెంకటేశ్వర దేవాలయం (బాలాజీమందిర్)తో పాటు శివాలయాలు, హనుమాన్ మందిరాలు, త్రినాథస్వామి దేవాలయం, సంతోషిమాతా మందిరం, గౌరీపరమేశ్వరుల దేవాలయం (అనకాపల్లి గవరకులస్తులు) సోలాపురి అమ్మవారు. దేవాంగుల చౌడీశ్వర ఆలయం, యాదవుల శ్రీకృష్ణమందిరం, అయ్యప్ప దేవాలయం, షిరిడి సాయిబాబా, సత్యసాయిబాబా గుడులతో పాటు కనక మహాలక్ష్మి, ముత్యాలమ్మ వంటి గ్రామదేవతల గుడులు నిర్మించుకున్నారు. వెంకటేశ్వరస్వామి గుడిలో బ్రహ్మోత్సవాలు జరగటం, ఇక్కడి తెలుగువారు తిరుపతిలో శ్రీవారి సేవలో పాల్గొనటం విశేషం. ఉత్తరాంధ్రప్రజలలాగనే త్రినాథస్వామి వ్రతం చేసుకోవడం, భజనలు జరగటం విశేషం.

**తెలుగు సంస్కృతి, ఆధ్యాత్మికత :**

ఒక విధంగా ఆంధ్రప్రదేశ్‌ను మరిపించే స్థాయిలో శ్రీరామ నవమి ఉత్సవాలు, సీతారాములకళ్యాణం, ఉగాది ఉత్సవాలు, వినాయక ఉత్సవాలు, గౌరి పరమేశ్వరుల ఉత్సవాలు, ముత్యాలమ్మ పండుగ, సోలాపురి అమ్మవారి పండుగ, దసరా ఉత్సవాలు ఆధ్యాత్మిక ప్రసంగాలు, భజనలు ఇలా ఎన్నైనా చెప్పవచ్చు.

ఇకపెళ్ళిళ్ళకు వస్తే ఇప్పుడిప్పుడు తెలుగునేలతో సంబంధాలు ఏర్పర్చుకున్న ఎక్కువ వివాహాలు రాయపూర్, భిలాయి (చత్తీస్‌ఘడ్) టిట్లాఘర్, రూర్కెలా (ఒడిస్సా) టాటానగర్ (జార్ఖండ్) ఆంధ్రవంటి ప్రాంతాలలోని తెలుగు స్వకులాలతో జరగడటం ఆనందించ దగ్గ విషయం. తెలుగు ముహుర్తాలు, తెలుగు పంతులు, శుభలేఖలు, ఇంటిగోడలపై తెలుగులోనే ఆహ్వానాలు పలకడం, కళ్లాపి చల్లి ముగ్గులు వేయడం తెలుగువారికే చెల్లింది.

**తెలుగు సినిమాలు, పత్రికలు :**

ఖరగ్‌పూర్ అరోరా సినిమా హాలు ఇప్పటికీ తెలుగు సినిమాలు ఆడుతుండటం, నిన్నా మొన్నటివరకు ఈనాడు మొదలగు దిన

పత్రికలు ఒకరోజు ఆలస్యంతో చేరటం, తెలుగు మాసపత్రికలు దొరకటం విశేషం.

**సాహిత్యం, నాటక సమాజాలు :**

ఖరగ్‌పూర్ తెలుగు సమాజంలో కవులు, కథారచయితలు, నాటక రచయితలు, జానపద కళాకారులు, పౌరాణిక నాటక కర్తలు వెలిశారు. నాటక పరిషత్‌లు వెలిశాయి. ప్రవాసాంధ్ర నవ్య కళాపరిషత్ (1958) ఆధ్వర్యంలో ప్రవాసాంధ్ర నాటక పోటీలు, ఇతర రాష్ట్రాల నుండి నాటక కళాకారులను రప్పించడం సినిమా గాయకులను, హరికథకులను, బుర్రకథకులను తెప్పించడం వారిని ఆదరించడం గొప్ప అనుభూతి. నిన్న మొన్నటి వరకు ఇదో తీపిగుర్తు. ఐ.ఐ.టి లో కూడా తెలుగు సాంస్కృతిక సంస్థ ఆవిర్భవించింది.

పల్లెకళలైన పులివేషాలు, పగటివేషాలు, కోయడాన్స్, కోలాటం, భజనలు ఇలా ఎన్నని చెప్పేది. సినీ ప్రముఖులకు, సాహితీ వేత్తలకు, కళాకారులకు సన్మానాలు ఇలా ఖరగ్ సాహిత్య, కళా, నాటక, సాంస్కృతిక రంగం గూర్చి వ్రాస్తే, ఆకళాకారులు, రచయితలు, నాటక సమాజాలు గూర్చి మరో పెద్ద వ్యాసం అవుతుంది. రాళ్ళపల్లి సుందరరావు గారి వంటి వారు ఈ వివరాలు సేకరించారు.

**తెలుగుభాష సంస్కృతి పరిరక్షణలో తెలుగు సోదరుల పాత్ర**

తెలుగుభాష, మాధ్యమం పరిరక్షణలో మొదటి తరానికి చెందిన వందకుపైగా తెలుగు సోదరుల కృషి మరువలేనిది. అందులో ప్రధానంగా తెలుగు పాఠశాలలకు స్వర్గీయ న్యాపతి రామదాసు, స్వర్గీయ నరసయ్య చౌదరి, యమ్.జగన్నాథరావు, ప్రయాగ ప్రకాశరావు. జి.యస్.యన్.శర్మ గార్లు ఇంకెంతో మంది ప్రముఖులున్నారు. తెలుగు విద్యాపీఠ్, ఆంధ్రా ఉన్నత పాఠశాలతో పాటు తెలుగు వారికి మరికొన్ని ప్రాంతాలలో విద్య గరపడానికి జతిన్ మిశ్రా (బెంగాలీ వామపక్షనాయకులు) విజయమాల్ గార్లతో పాటు శ్రీ వి.వి.యస్.జనార్థన, ముద్దంశెట్టి హనుమంతరావు గార్లు, సుభాష్ పల్లి ప్రాంతంలో సుభాష్ ప్రాథమిక పాఠశాల, గురజాడ విద్యాలయంలకై కృషి చేశారు.

**ఒకనాటి ఉద్యాన వనం- నేడు కనం :**

1996 వరకు నిర్విఘ్నంగా కొనసాగిన తెలుగు భాషాసంస్కృతులకు 2000 నుండి ప్రమాద ఘంటికలు మ్రోగుతున్నాయి. భాష, సంస్కృతులు కనుమరుగయ్యే స్థితికి చేరుకున్నాయి. అన్ని ప్రాంతాలు లాగానే ఇక్కడ కూడా ఆంగ్లమాధ్య ప్రభావం, హిందీ, బెంగాలీ ప్రభావంతో ఆంధ్రా ఉన్నత పాఠశాల బెంగాలీయుల చేతులలోకి వెళ్ళింది. ప్రస్తుతం అక్కడ బెంగాలీ, హిందీ, పంజాబీ, ఆంగ్లమాధ్యమాలు నడుస్తున్నాయి.

ఇక రైల్వే వర్కుషాపు, ఐ.ఐ.టి.లో ఉద్యోగాలు క్రమేణా తగ్గడంతో వీరిపిల్లలకు సరియైన ఉద్యోగాలు లేక బొంబాయి, బెంగుళూరు, ఢిల్లీ మొ॥ ప్రాంతాలకు వలసపోతున్నారు. రిటైర్మెంట్ అయిన కొంతమంది మాత్రం ఇక్కడ స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు.

తెలుగుభాష (రాయడం, చదవడం) కు ప్రమాదమేర్పడింది. కనీసం తెలుగును ఒక సబ్జెక్టుగానైనా చదవగలిగితే భాష బతికి బట్టకడుతుంది. లేకపోతే తెలుగు కనుమరుగవ్వడం ఖాయం. కాబట్టి తెలుగు సంఘాలు, ప్రవాసాంధ్రులు తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు భాషా రక్షణకై వెంటనే చర్యలు తీసుకోవాలి. ❋

---

*-రచయిత గిరిజన సాహిత్యం, జీవన విధానంపై పరిశోధన చేశారు. 'కళింగాంధ్ర జానపద గేయాలు' మున్నగు గ్రంథాల రచయిత, విజయనగరం. ఫోన్ : 97047 98643*




## తమిళనాడులో ఒడిసా భాషలో సైన్‌బోర్డుతో అంగడి!

మమ్మల్ని విడిచేసి పొయ్యిన మా సొంతగాళ్ళ కూడ ఒక మాట. మా ఊరు ఉడుమలపేట, తమిళ్నాడుల ఉండే ఒక చిన్న పేట. ఈడ మన తెలుంగువాండ్లే ఎక్కువ, ఒక 50% ఉండుతుము. ఎక్కితొక్కి పిడిచి వేసి చూసినా తమిళ్వాండ్ల ఎన్నిక 40% దాంటదు. ఐనా వీదికి వస్తే మేము కూడా తమిళంలనే మాటాడుతుము. మా ఊరి బస్టాండుల ఒక ఒడియా కుటుంబం వక్కాకు అంగడి పెట్టి ఉండారు. వాళ్ళ అంగడిల ఒక బోర్డ్ పెట్టి, దాంట్ల పైన ఒడియా, నడువున హిందీ, కింద తమిళ్ల వాళ్ళ అంగడి పేరును రాసి పెట్టి ఉండారు. అనేకంగ వాళ్ళే మా ఊరుల ఉండే ఒకే ఒక ఒడియా కుటుంబం అని తలిచేను. ఐనా, ఒడియాల రాసి ఉండారు. మేము ఈడ 50% ఉండికూడ మమ్మల్నించి ఒక తెలుంగు బోర్డ్ కూడ పెట్టుకోను అవ్వలేదు. ఏల? ఏల అనితే మాకు మా రాత లేదు, తెలవదు. మీరు పోరాడి వేసికొనిన ఆంధ్ర అనే ఒక గీంత, మూండు కోటి జనం తల రాతను మారిచి వేసింది, మా రాతను పీంకి పారేసింది. ఒక ఒడియా వాండు, ఒకే ఒడియా వాండు బోర్డ్ పెట్టితే, మేము చూసికొని ఉండాము. ఇదే మా నిలమ, ఇక్కడ తెలుంగువాండ్ల నిలమ. ఈ నిలమ మా తరంల ఐనా మారునా??

**-మార్టూరి సంజనా పద్మం,** ఉడుమల పేట, తమిళనాడు

-చలసాని నరేంద్ర,
984956050

# భూసేకరణకు ఎదురవుతున్న వ్యతిరేకతను అర్థం చేసుకోవాలి

**ఒక చిన్న భవనంలో ఐ.టి.కంపెనీలు వందల కోట్లరూపాయల వ్యాపారం చేయవచ్చు. కానీ వాటికి ప్రత్యేక ఆర్థిక మండలి పేరుతో వందల ఎకరాల భూములను సేకరించి ప్రభుత్వం ఇవ్వడం, ఆ కంపెనీలు ఆ భూములను స్థిరాస్తి వ్యాపారాలకు వాడుకోవడం జరుగుతున్నది. ఈ విధంగా భూసేకరణ పెద్ద ఎత్తున దుర్వినియోగానికి దారితీస్తున్నది. అందుకనే భూసేకరణను యధేచ్ఛగా కాకుండా, జవాబుదారీతనంతో, పారదర్శక విధానంతో, బాధిత ప్రజల భాగస్వామ్యంతో జరగడం ద్వారా సామాజిక అశాంతికి దారితీయకుండా జాగ్రత్త పడాలి.**

**అ**భివృద్ధికి భూసేకరణ అనివార్యం. మౌలిక సదుపాయాలు కల్పించాలి అన్నా, ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించేందుకు దోహదపడే విధంగా పారిశ్రామీకరణ, విద్య-వైద్య సదుపాయాల కల్పనకు కూడా పెద్ద ఎత్తున భూసేకరణ అనివార్యం అవుతున్నది. స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం మొదటి 50-55 ఏళ్ళల్లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దేశంలో 4 లక్షల ఎకరాల మేరకు భూములను ప్రజావసరాల కోసం సేకరించాయి. పరిహారం చెల్లించే విషయంలో కొన్ని వివాదాలు ఏర్పడినా మొత్తంమీద ప్రజలనుండి పెద్దగా అడ్డంకులు ఏర్పడకుండానే భూసేకరణ జరుప గలిగారు.

అయితే గత ఒకటి, రెండు దశాబ్దాలుగా భూసేకరణ క్లిష్టంగా మారుతున్నది. ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం అమరావతి కోసం ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పెద్దగా ఇబ్బంది లేకుండా 'ల్యాండ్‌పూలింగ్' పేరుతో 33 వేల ఎకరాల మేరకు సేకరించ గలిగినా, ఇప్పుడు మచిలీపట్టణం వద్ద పోర్టు పారిశ్రామిక కారిడార్‌ల కోసం లక్ష ఎకరాలకు పైగా సేకరించడానికి చేస్తున్న ప్రయత్నాలు అంత సాఫీగా జరిగే అవకాశాలు కనిపించడం లేదు.

తెలంగాణ ప్రభుత్వం కూడా మల్లన్న సాగర్ ప్రాజెక్ట్ కోసం 20 వేల ఎకరాల భూసేకరణకు పూనుకొంటే పెద్ద ఎత్తున నిరసన, వివాదం చెలరేగుతున్నది. భూసేకరణను వ్యతిరేకించడం అభివృద్ధిని వ్యతిరేకించడంగా అధికార పక్షాలు చిత్రీకరించే ప్రయత్నాలు చేస్తున్నాయి. అయితే ప్రజలు తరాల తరబడి తాము అనుబంధం పెంచుకున్న భూములను వదిలి మరోచోటకు వలస వెళ్ళడానికి విముఖత చూపడం సహజ పరిణామం అని గ్రహించాలి. ఈ సందర్భంగా భూముల పట్ల వారు పెంచుకున్న అనుబంధంతో భూములు కలిగి ఉండటం తమ హక్కుగా భావిస్తున్నారు.

భూమిపై తమకు గల హక్కులను పేద రైతులు ప్రస్తావించడం కారణంగానే పశ్చిమ బెంగాల్ లో 34 ఏళ్ళ వామపక్ష కూటమి ప్రభుత్వానికి తెరపడే వలసిన పరిస్థితి ఏర్పడింది. వాస్తవానికి దేశం మొత్తం మీద భూసంస్కరణలను విజయవంతంగా అమలు జరిపింది పశ్చిమ బెంగాల్ లోని వామపక్ష ప్రభుత్వం అనడంలో ఎటువంటి సందేహం లేదు. పైగా నందిగ్రామ్ పరిసర ప్రాంతాలలో ఇప్పుడున్న భూములు వామపక్ష ప్రభుత్వం పంపిణి చేసినవే.

రాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడి ఉండడాన్ని గ్రహించిన నాటి ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య చిత్తశుద్ధితో పరిశ్రమల ఏర్పాటుకు అనువైన వాతావరణం కల్పించడం కోసం నందిగ్రామ్ వద్ద నానో కార్ల ఫ్యాక్టరీ ఏర్పాటుకు టాటాలకు భూమి ఇవ్వడానికి సిద్ధపడ్డారు. అందులో ఆయన ముడుపుల కోసం ఈ విధంగా చేశారని రాజకీయ ప్రత్యర్థులు కూడా ఆరోపణలు చేయలేదు. పైగా నాడు దేశంలో మరెవ్వరు ఇవ్వని భారీ పరిహారం, పునరావాసం ప్యాకేజిని ఆయన ఇవ్వజూపారు.

ప్రభుత్వం ఇచ్చిన భూములనే, ఒక మంచి ఉద్దేశ్యం కోసం, తగు పరిహారంతో తిరిగి తీసుకొనే ప్రయత్నం చేస్తే ప్రజలు తిరగబడి, ఆ ప్రభుత్వాన్ని కూల్చి వేయడం అనూహ్య పరిణామం. ఈ పరిణామం గురించి దేశంలో రాజకీయ పార్టీలు గాని, సామాజిక ఉద్యమాలు గాని సరైన అంచనాకు రాలేకపోతున్నాయని భావించవలసి వస్తున్నది. సర్దార్ సరోవర్ ప్రాజెక్ట్ నిర్వాసితులకు మద్దతుగా మేధా పాట్కర్ నాయకత్వంలో జరుగుతున్న ఉద్యమం అందుకు భిన్నమైనది. వారు కేవలం నిర్వాసితులకు మెరుగైన పరిహారం, పునరావాసం డిమాండ్ చేశారు. కానీ భూమిపై అక్కడి ప్రజలకు గల హక్కును ప్రస్తావించ లేదు. నందిగ్రామ్‌లో రైతులు భూమిపట్ల తమకు గల హక్కును లేవనెత్తారు.

ప్రపంచంలో ప్రజాస్వామ్యం అనేదే ఆస్తి హక్కు పునాదిగా వికసించినదని ఈ సందర్భంగా గమనించాలి. మొదట్లో ఆస్తి పన్ను కట్టే వారికి, అంటే ఆస్తులు ఉన్నవారికి మాత్రమే ఓటు హక్కు ఉండెడిది. ఏ దేశంలో అయితే ఆస్తి హక్కులు పటిష్టంగా, పారదర్శకంగా ఉంటాయో ఆ దేశంలో మాత్రమే ప్రజాస్వామ్యం బాగా వికసిస్తున్నదని భావించగలము. పైగా ఒక దేశ ఆర్థిక, సామాజిక అభివృద్ధికి కూడా ఆస్తి హక్కు పునాది అని భావించ వలసి ఉంటుంది. ప్రైవేట్ ఆస్తులను ఒప్పుకోని కమ్యూనిస్టులు సహితం 'దున్నేవారికే భూమి' వంటి నినాదాలు ఇవ్వడం ఈ సందర్భంగా గమనార్హం. సామూహిక వ్యవసాయం విఫలమై, ప్రజల ఆకలి తీర్చలేని పరిస్థితులలో చైనా సహితం ప్రైవేట్ ఆస్తులకు అవకాశం కల్పించవలసి వచ్చింది.

అయితే మన దేశంలో స్వాతంత్ర్య ఉద్యమంలో ఆస్తి హక్కును గురించిన ప్రస్తావన రాలేదు. మొదటగా ఈ ప్రస్తావన నందిగ్రామ్ రైతుల ఉద్యమం నుండే వచ్చింది. అందుకనే ప్రభుత్వాలు అభివృద్ధి

## అమ్మ వంతెన

కవిత

-డా॥ఎన్.గోపి,
సెల్ : 093910 28496

నీకూ వాడికీ మధ్య
ఆమె ఒక వంతెన
వాడు నీకు గర్వకారణమైతే
ఆమె మమతా గీతానికి వాడు తొలి చరణం

ఆమెను నొప్పించావా
వాడు నీకు దూరం దూరం
వాళ్ళిద్దరూ అవిభాజ్యం
వాడి తోడిదే ఆమె రాజ్యం

నీకూ ఆమెకూ మధ్య
వాడో సేతువు
మీ అన్యోన్యతకు
వాడు కూడా ఓ హేతువు

చైతన్యమూ అవసరమూ
కలిస్తేనే జీవితం
ఏవేవో మాట్లాడుతుంటాం
అనవరతం.

పేరుతో నిరంకుశంగా భూములను సేకరించడం ఇప్పుడు క్లిష్ట తరంగా మారుతున్నది. ఈ విషయాన్ని గ్రహించిన యుపిఎ ప్రభుత్వం స్వాతంత్ర్య భారత్‌లో తొలిసారిగా సంస్కరించిన భూసేకరణ చట్టం, 2013ను తీసుకువచ్చింది. నరేంద్ర మోడీ ప్రభుత్వం అధికారంలోకి రాగానే ఈ చట్టాన్ని నిర్వీర్యం చేయాలని ప్రయత్నం చేసినా ప్రజల వ్యతిరేకతతో సాధ్యపడలేదు.

అందుకనే మల్లన్నసాగర్ నిర్వాసితులకు ఈ చట్టం ప్రకారం కాకుండా ఒక ప్రత్యేక జీవో ద్వారా పరిహారం చెల్లించే ప్రయత్నం తెలంగాణ ప్రభుత్వం చేసింది. అందుకు రైతుల నుండి తీవ్ర ప్రతి ఘటన ఎదురు కావడంతో స్వయంగా ముఖ్యమంత్రి కె.చంద్ర శేఖరరావు జోక్యం చేసుకొని రైతులు కోరితే 2013 చట్టం ప్రకారమే పరిహారం చెల్లిస్తామని హామీ ఇవ్వవలసి వచ్చింది.

గతంలో కేవలం ప్రభుత్వ పథకాలు, సాగునీటి పథకాలు, రోడ్లు, రైల్వే లైన్లు వంటి మౌలిక సదుపాయాల కోసం మాత్రమే భూములు సేకరిస్తూ ఉండేవారు. దానితో ప్రజల నుండి పెద్దగా వ్యతిరేకత ఎదురయ్యేడిది కాదు. అయితే 1991 ఆర్థిక సంస్కరణల తరువాత ప్రైవేట్ వ్యక్తులకు ప్రభుత్వం భూములు సేకరించి ఇస్తూ ఉండడం వివాదంగా మారుతున్నది. ఈ సందర్భంగా పెద్ద ఎత్తున ముడుపులు చేతులు మారుతున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. ఈ విషయమై ప్రభుత్వాలు నిర్దుష్టమైన విధానం అనుసరించడం లేదు.

ఈ సందర్భంగా నిర్వాసితులకు ఇస్తున్న హామీలు నీటి మూటలుగా మారుతూ ఉండటం, వారి వేదనను సత్వరం పరిష్కరించే యంత్రాంగం లేకపోవడం, ప్రభుత్వ యంత్రాంగం కూడా బాధితులకు బాసటగా నిలబడక పోవడంతో నేడు భూసేకరణ అంటే ఒక పెద్ద కుంభకోణంగా భావించవలసి వస్తున్నది.

2013 చట్టం ప్రకారం మార్కెట్ ధరకు మూడు రెట్లు నిర్వాసితులకు భూములకు పరిహారం చెల్లించాలి. అంటే ఒక ఎకరం భూమి మార్కెట్ విలువ ఒక లక్ష రూపాయలు ఉంటే, మూడు లక్షల రూపాయలను పరిహారంగా చెల్లించాలి. అయితే సమస్య ఎక్కడ వస్తుంది అంటే ఆ స్థలంలో ఒక ప్రాజెక్ట్ వస్తుంది అని తెలియగానే ఆ చుట్టు ప్రక్కల భూముల ధరలు 10 రెట్ల వరకు పెరుగుతున్నది. తమకు వచ్చే పరిహారంతో ఐదు ఎకరాలకు బదులుగా ఒక ఎకరం కూడా ఆ ప్రాంతంలో కొనుగోలు చేసుకోలేని పరిస్థితులు ఎదురవుతున్నాయి.

అందుకే ఆర్థికపరమైన పరిహారం ఇవ్వడంతో పాటు, ఆ భూమి అభివృద్ధి చెందడం వలన పెరిగే సంపదలో కూడా నిర్వాసితులకు భాగస్వామ్యం కల్పించే విధానం ఏర్పాటు చేస్తే ప్రజల నుండి తిరుగుబాటు నివారించే అవకాశం ఉంటుంది. తమ నుండి భూములు తీసుకున్న వారు కోటీశ్వరులు అవుతూ ఉంటే తాము మాత్రం పేదలుగా మారిపోవడం సహజంగానే వారిలో అశాంతిని పెంచుతుంది. అందుకనే వారి స్థలాలలో వచ్చే కర్మాగారాలలో వారికి వాటా ఇచ్చి, ప్రతి సంవత్సరం స్థిరమైన ఆదాయం లభించే ఏర్పాటు చేయడం, వారి కుటుంబ సభ్యులకు అందులో ఉపాధి అవకాశాలు కల్పించడం చూడవలసి ఉంది.

ముఖ్యంగా అటవీ ప్రాంతంలో గనుల త్రవ్వకం, ఇతర అభివృద్ధి కార్యక్రమాల కోసం గిరిజనుల నుండి తీవ్ర ప్రతిఘటన ఏర్పడుతున్నది. వారి సాంస్కృతిక మూలాలను కాపాడాలనే పేరుతో గిరి జనులను అభివృద్ధికి దూరంగా ఉంచడం తగదు. గిరిజనులలో అక్షరాస్యత చాలా తక్కువగా ఉండటమే కాకుండా, అనేక గిరిజన గ్రామాలలో నెలసరి జీతం ఉండే ఉపాధి/ఉద్యోగం గల ఒక్క కుటుంబం కూడా లేనివి చాలా ఉన్నాయని మరువలేము. కనీసం రహదారులు, విద్య,వైద్య సదుపాయాలకు దూరంగా వారిని దశాబ్దాల తరబడి ఉంచడం అమానుషమే అవుతుంది.

ఎంతో అభివృద్ధి చెందినదని భావించే తూర్పు గోదావరి జిల్లాలోని రంపచోడవరం వద్ద గల ఏజెన్సీ ప్రాంతంలో ఆరోగ్య సమస్య తలెత్తితే, ఆసుపత్రికి వెళ్ళాలి అంటే 20 కి మీ దూరం వరకు బస్సు సౌకర్యం కూడా లేకుండా ప్రయాణం చేయవలసిన గిరిజన గ్రామాలు అనేకం ఉన్నాయి. ఒక చిన్న భవనంలో ఐ.టి.కంపెనీలు వందల కోట్లరూపాయల వ్యాపారం చేయవచ్చు. కానీ వాటికి ప్రత్యేక ఆర్థిక మండలి పేరుతో వందల ఎకరాల భూములను సేకరించి ప్రభుత్వం ఇవ్వడం, ఆ కంపెనీలు ఆ భూములను స్థిరాస్తి వ్యాపారాలకు వాడుకోవడం జరుగుతున్నది. ఈ విధంగా భూసేకరణ పెద్ద ఎత్తున దుర్వినియోగానికి దారితీస్తున్నది.

పలుకుబడి, ప్రాబల్యం గలవారి భూములకు ఇబ్బంది లేకుండా, పేదల భూములను మాత్రమే సేకరించే విధంగా హైదరాబాద్ చుట్టూ వేసిన రింగ్‌రోడ్ స్వరూపం వెల్లడి చేస్తుంది. పలుకుబడి గలవారు అభివృద్ధి ప్రాజెక్టులు వస్తున్నాయని కొన్నిచోట్ల ముందుగా ఆ పరిసర ప్రాంతాలలో కారుచౌకగా భూములను కొనడం, తరువాత వారు తమ భూముల విలువలను వందల రెట్లు పెంచుకోవడం - అంతా ఒక భారీ కుంభకోణంలా జరుగుతున్నది. ఈ విధంగా భూసేకరణ విధానం దుర్వినియోగం కావడంతో ప్రజల నుండి ప్రతిఘటన ఎదురవుతున్నది.

అందుకనే భూసేకరణను యధేచ్ఛగా కాకుండా, జవాబుదారీతనంతో, పారదర్శక విధానంతో, బాధిత ప్రజల భాగస్వామ్యంతో జరగడం ద్వారా సామాజిక అశాంతికి దారితీయకుండా జాగ్రత్త పడాలి. ❊

-సంకేపల్లి నాగేంద్రశర్మ
94417 97650

# లేపాక్షి శిల్పకళకు అంతర్జాతీయ వైభవం

## ప్రపంచ వారసత్వ కట్టడాల జాబితాలోకి లేపాక్షినీ చేర్చాలి

**ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని దేవాలయాలు, చారిత్రిక కట్టడాల అభివృద్ధి ప్రణాళికాబద్ధంగా, శరవేగంగా జరుగుతుండగా తెలంగాణా రాష్ట్రంలోని వరంగల్ జిల్లా పాలంపేట రామప్పగుడులు, వరంగల్‌లోని ప్రాచీన కాకతీయ వైభవాల చిహ్నాల పరిస్థితి ఎక్కడ వేసిన గొంగడి అక్కడే వున్నట్లుగానే వుంది.**

సాంస్కృతిక యాత్రలో భాగంగా నేను అనంతపురం జిల్లాలోని లేపాక్షి దేవాలయ శిల్పాలను ఇటీవల సందర్శించాను. విజయనగర రాజుల శిల్పకళావైభవాన్ని చూడాలంటే లేపాక్షి, కర్ణాటక రాష్ట్రంలోని బళ్ళారి జిల్లా హంపి చారిత్రిక చిహ్నాలను, దేవాలయాలను చూడాల్సిందే, లేపాక్షికి సంబంధించిన వివరాలలోకి వెడితే... రెండు కన్నులతో లేపాక్షి దేవాలయాల్ని, అక్కడి శిల్పసంపదల్ని చూసి తరించాల్సిందే, వీటిని విపులంగా చూడాలంటే రెండురోజులు పడుతుంది. ఈ ఫిబ్రవరి 27, 28 తేదీలలో ఇక్కడ రెండు రోజులపాటు లేపాక్షి ఉత్సవాలు హిందూపూర్ శాసనసభ్యుడు, హీరో నందమూరి బాలకృష్ణ ఆధ్వర్యంలో వైభవంగా జరిగాయి. ఈ ఉత్సవాలను ప్రారంభించిన ముఖ్యమంత్రి నారాచంద్రబాబు నాయుడు మాట్లాడుతూ, లేపాక్షిని పర్యాటక కేంద్రంగా అభివృద్ధి చేయడానికి తమ రాష్ట్ర ప్రభుత్వం చిత్తశుద్ధితో వున్నట్లు ప్రకటించారు. రాష్ట్ర ముఖ్యమంత్రితో పాటు, మంత్రులు, ఎందరెందరో సినీ కళాకారులు పాల్గొని ఈ ఉత్సవాలను విజయవంతం చేశారు. లేపాక్షి చిన్న గ్రామమైనా పర్యాటక అభివృద్ధికి, విస్తరణకు ఎన్నో అవకాశాలున్నాయి. లేపాక్షికి ప్రతినిత్యం ఉమ్మడి తెలుగు రాష్ట్రాల నుండే కాక, దేశ, విదేశాల నుండి 5 వందలకు పైగా సందర్శకులు వస్తుంటారు.

**లేపాక్షి పూర్వవైభవానికి కృషి :** 15వ శతాబ్దం విజయనగర రాజుల శిల్పకళా చాతుర్యానికి అద్దం పట్టే లేపాక్షి దేవాలయాలకు అంతర్జాతీయంగా గుర్తింపు తేవడానికి కృషి మొదలైంది. ఇక్కడ లేపాక్షి ఉత్సవాలు, రోడ్లు, ఇతర నిర్మాణాల కోసం నాలుగు కోట్ల 30 లక్షల రూపాయలు ప్రభుత్వం గ్రాంటుగా ఇచ్చింది. లేపాక్షికి బెంగళూరు సమీపంలో వుంది, ఇక్కడ అంతర్జాతీయ విమానాశ్రయం ద్వారా లేపాక్షికి జాతీయ, అంతర్జాతీయంగా టూరిస్టులు వచ్చే అవకాశాలు మెరుగుపడ్డాయి. లేపాక్షిలో అన్ని సదుపాయాలు కలుగచేసి, ప్రతి ఏటా లేపాక్షి ఉత్సవాల నిర్వహణకు కృషి చేయడానికి హీరో బాలకృష్ణ కృషి చేస్తున్నారు. పదికోట్ల రూపాయలు పెనుగొండ కోట అభివృద్ధికి కేటాయించారు. తిమ్మమ్మమానును టిటిడి నిధులతో అభివృద్ధి చేయడానికి చర్యలు తీసుకుంటున్నారు. పుట్టపర్తి సత్యసాయి బాబా నిలయం ఆధ్యాత్మిక ధామంగా అభివృద్ధి చెందింది. ధర్మవరం పట్టు చీరలకు ప్రసిద్ధికాగా, ఈ ప్రాంతాలలో టూరిజం అభివృద్ధి



పనులకు 25 కోట్ల రూపాయలను రాష్ట్ర ప్రభుత్వం కేటాయించినట్లు ముఖ్యమంత్రి లేపాక్షి ఉత్సవసభలో ప్రకటించారు. ఇలా అనంతపురం జిల్లాను టూరిజం సర్క్యూట్‌గా తీర్చిదిద్దే చర్యలు మొదలయ్యాయి.

ప్రస్తుతం లేపాక్షి భారత పురాతత్వశాఖ ఆర్కియాలోజికల్ సర్వే ఆఫ్ ఇండియా, అనంతపురం సబ్ సర్కిల్ ఆధీనంలో వుంది. లేపాక్షి హిందూపురానికి 15 కిలోమీటర్లు, కొడికొండ చెక్‌పోస్టుకు 15 కిలోమీటర్ల దూరంలో వుంది. జిల్లాకేంద్రమైన అనంతపురానికి వంద కిలోమీటర్లు, పొరుగున ఉన్న కర్ణాటక రాజధాని బెంగళూరుకు 122 కిలోమీటర్ల సమీప దూరంలో వుంది. లేపాక్షి దేవాలయాలను కూర్మ శైలం (తాబేలు ఆకారంలో వున్న కొండ) పై అప్పటి విజయనగర సామ్రాజ్య కోశాధికారి విరూపణ్ణ, సోదరుడు వీరన్నలు నిర్మించారు. గతంలో ఆ కొండపై వీరభద్ర, ఇతర శివ, వైష్ణవ విగ్రహాలుండేవని, అగస్త్యుడు ఈ కొండపై వసించి, ఈ విగ్రహాలను ప్రతిష్టించాడని చెబుతారు. ఈ విగ్రహాలకు శాశ్వతత్వం తేవడానికి, ఈ సోదరులిరువురు ప్రజానిధులతో ఈదేవాలయాలను నిర్మించారని అంటారు. ఈ ఊరుకి లేపాక్షి పేరు రావడానికి రామాయణ కాలం నాటి కథ ఇక్కడ ప్రచారంలో వుంది, రావణాసురుడు సీతమ్మను అపహరించిన సమయంలో శ్రీరామచంద్రుడు ఇక్కడ పడివున్న జటాయువుపక్షిని చూడటానికి వచ్చి లే-పక్షి అనడంతో ఈ ఊరికి లేపాక్షి అనే పేరు వచ్చిందని పురాణకథనంగా చెబుతారు. దీనికి సాక్ష్యంగా ఇక్కడ సీతమ్మపాదం కూడా ఉంది. విరూపణ్ణ సోదరులిరువులు విజయనగర రాజుకోపానికి గురై కళ్ళుపీకేయమని రాజాజ్ఞ జరగడంతో, ఈ దేవాలయ నిర్మాతలైన ఈ ఇద్దరు సోదరులు తమ కళ్ళను తామే పీకి గుడికి అంటించి, చనిపోయారని, అక్షములు అంటించినందున దీనికి లేపాక్షి అని పేరు వచ్చిందని అంటారు. లేపాక్షి శిల్పాలు మన తెలుగువారి విలువైన వారసత్వసంపద, తరగని సొత్తు, ఇక్కడి





ఇటీవలే ఏర్పాటు చేశారు. లేపాక్షి నిర్మాతైన విరూపణ్ణ విగ్రహాన్ని ఉమ్మడి రాష్ట్రంలో 9-9-2012న ప్రతిష్టించారు. కొడికొండ చెక్‌పోస్టు, లేపాక్షి గ్రామాలలో సుందరమైన స్వాగత తోరణాల్ని రెంటిని ఇటీవలే నిర్మించి, ఆవిష్కరించారు. లేపాక్షి గుడుల చుట్టూ యాత్రికులు సేదతీరడానికి, సర్వాంగసుందర మైన ఉద్యానవనాల్ని, మూత్రశాలల్ని అభివృద్ధి చేశారు. కోడికొండ చెక్ పోస్టు నుండి లేపాక్షి మీదుగా హిందూపూర్ వరకు 30 కిలోమీటర్ల రహదారిని అభివృద్ధి పరిచారు. లేపాక్షి గుడులను, శిల్పాలను మరింత సుందరీకరించాల్సిన అవ సరం వుంది. సౌండ్ అండ్ లైటింగ్ సౌకర్యం కల్పించే వీలుగా వుంది. శిల్పాల విశిష్టతను, ఇక్కడి చరిత్రను తెలుగు, ఆంగ్ల, ఇతర భాషల్లో సీడీలు చేసి, పుస్తకాలుగా ముద్రించి అమ్మే సౌకర్యాన్ని పురావస్తుశాఖ కలుగ చేయాల్సి వుంది. అపురూప శిల్పకళ గల ఈగుడులను ప్రపంచ వారసత్వ జాబితాలో చేర్చాల్సిన అవసరం వుంది. లేపాక్షి గుడులలో ప్రధానంగా

మండపాలలో శిల్పచాతుర్యం వర్ణించ నలవికాదు. ఈ శిల్పాలు నేత్ర పర్వమే. ఇక్కడ సౌకర్యాలను అభివృద్ధి చేస్తే దేశవిదేశాలనుండి టూరిస్టుల సంఖ్య పెరిగే అవకాశాలున్నాయి. లేపాక్షి గుడిలో చిందర వందరగా పడివున్న శిల్పాలను, స్తంభాలను చాలావరకు లేపి మళ్ళీ పునారాకృతులు కల్పించే దిశగా కేంద్ర పురావస్తుశాఖ శ్రమిస్తోంది. ఈ దేవాలయాల అభివృద్ధికి ఈ శాఖ కనీసంగానైనా యాభై కోట్ల నిధులను మంజూరు చేయాల్సి వుంది. లేపాక్షి గుడుల నిర్మాణాలు విజయనగర కాలంలోని క్రీ.శ. 1533 అచ్యుతరాయల పరిపాలనా కాలంలో జరిగాయి. లేపాక్షి వైభవానికి ప్రతీకైన ఏకశిలా లేపాక్షి నంది అద్భుతం, అమేయం. ఈ నంది గంటలు, మువ్వల అలంకర ణలతో రంకెవేస్తున్నట్లు కనిపిస్తుంది. నంది విగ్రహం చుట్టూ విశాలంగా పార్కును అభివృద్ధి పరిచి, చుట్టూ కంచె వేసి వాచ్‌మెన్‌ను ఏర్పాటు చేశారు.

భారతదేశంలోనే రెండవ నందిగా చెప్పబడుతున్న ఈ నంది 15 అడుగుల ఎత్తు, 27 అడుగుల పొడవుతో సుందరంగా మలచ బడింది. విప్పారిన చెవులతో నంది జీవకళతో రమణీయంగా కన బడుతుంది. లేపాక్షిలో టూరిజం కార్పోరేషన్ వారి హరిత హోటల్‌ను

చూడాల్సినవి ఒక పెద్ద బండమీద నిర్మించిన ఏడు తలల నాగలింగం, దాని వెనకాల నిర్మించిన బృహత్ వినాయకుడు, విశేష శిల్పకళతో అలరారే 70 స్తంభాకృతులతో నిర్మించిన నాట్యమండపం వుంది. నిరూపణ్ణ సోదరులు అర్ధాంతర నిర్మాణంలో వదిలివేసిన కళ్యాణ మండపంలోని స్తంభాల శిల్పకళను చూడవచ్చును. ఒకరిద్దరు గైడ్స్ కూడా అందుబాటులో వున్నారు. ఈ దేవాలయాలను చూడటానికి ఎలాంటి ఫీజులు వసూలు చేయడం లేదు. ఊటనీటితో ఉట్టిపడే సీతమ్మపాదం, ఆలయం చుట్టూ శిల్పాల మండపాలు వున్నాయి. ముఖ్యంగా నాట్యమండపంలోని 12 స్తంభాలపై మలిచిన శిల్పాలు అద్భుతం. రంభ నాట్యం చేస్తుండగా, దత్తాత్రేయుడు, నటరాజు, చంద్రుడు, శివుడు, పార్వతి, సూర్యుడు, తుంబురుడు, నంది, బ్రహ్మ, సనాతనాది విద్వాంసులు, వివిధ సంగీత వాయిద్యాలతో నిలిచి వున్నట్లు చెక్కినారు. ప్రధానాలయమైన వీరభద్రస్వామి గుడి, ఆలయం చుట్టు నిర్మించిన పార్వతీదేవి, రామలింగం, హనుమలింగం, రఘు నాథస్వామి, దుర్గాదేవి, భద్రకాళి, నవగ్రహాలు, విద్యాగణపతి మందిరాలను చూడవచ్చును. నాట్యమండపం ఉపరితల భాగంలో ఆనాటి కాలపు విరూపణ్ణ, వీరన్న కుటుంబాలతో పూజించే వర్ణ





# 'తెనుగులెంక'సూక్తులు-13



తృష్ణ విడిచి మనుజుడితరుల ప్రేమించు
టెరుగవలయు తృప్తి మరగ వలయు
ప్రేమమున్న చోట భీతియు దుఃఖంబు
మెలగబోదు పోరు కలుగ బోదు

'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

**మ**నిషికి తృప్తి ఉంటే అభివృద్ధి ఉండవు. ఇంకా తెలుసుకోవాలనే జిజ్ఞాస, ఇంకా సాధించాలనే అభిలాష, ఇంకా సంపాదించాలనే కోరిక, తమ పరిశోధనల ద్వారా మానవులకు మంచి చేయాలనే సంకల్పం-ఇలాంటి వాటివల్లనే అడవుల్లో ఉండే మనుషులు అంతకంతకు ఎదిగి ఆకాశహర్మ్యాలలో నివసిస్తున్నారు. నాగరికత విషయంలో గాని, విజ్ఞానార్జనలోగాని సుఖజీవితానికి అవసరమైన సౌకర్యాలను సమకూర్చుకోవడంలో గాని ఎన్నో మెట్లు అధిరోహించాడు. ఆది మానవుడు అప్పటికి ఉన్నదానితోనే తృప్తి ఉంటే ఈ ప్రగతి సాధ్యమయ్యేది కాదు.

జంతువులు కడుపు నిండితే తృప్తి పడతాయి. మనిషి తృప్తి పడడు. జీతం తీసుకొని ఉద్యోగం చేస్తున్నా, లంచాలకు ఆశపడతాడు. కమీషన్లకు కక్కుర్తిపడి నాసిరకం వస్తువులను కొనిపిస్తాడు. వ్యాపారంలో వచ్చిన లాభంతో తృప్తిపడక, ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్నులు దాచుకుంటాడు. తృప్తి లేకనే బంధువులను చంపి ఆస్తులు ఆక్రమించుకుంటాడు. స్నేహితులను మోసం చేసి డబ్బు కూడబెడతాడు. అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యాలు, దోపిడీలు-వీటన్నింటికీ కారణం సంపాదించిన దానితో తృప్తిపడకపోవడమే.

ఇతరులకు అన్యాయం జరుగకుండా, ఇతరులకు బాధ కలుగకుండా, ఇతర విధాలుగా మోసం చేయకుండా పనిచేస్తూ, ఇంకా ఎత్తుకు ఎదగాలనుకోవడం తప్పులేదు గానీ మానవత్వం మరచి పోయి, పశువుల్లా ప్రవర్తిస్తూ దోచుకోవడం, దాచుకోవడం చూస్తే అది తప్పు అనిపించక మానదు. చావు బతుకులతో సతమతమవుతూ వచ్చిన రోగికి డబ్బిస్తేనే వైద్యం చేయడం, ఆకలితో అల్లాడుతూ పెన్షన్ కోసం వచ్చిన వారిని సొమ్ము ఇవ్వవలసిందని పీడించడం- ఇలాంటివి చూస్తే తృప్తిలోని మకిలి, మసి వెల్లడవుతాయి.

తృప్తి తెలియనివాడు సంపాదిస్తాడు. అతనికి భయం తప్ప శాంతి ఉండదు. దుఃఖం తప్ప సంతోషం ఉండదు. అవినీతిశాఖ అధికారులు దాడి చేస్తారని భయం. ఆదాయపన్నుశాఖ వారు అర దండాలు వేస్తారని భయం. ఎప్పుడు, ఏమవుతుందోనని భయం. అడ్డత్రోవల్లో ఆర్జించిన దానిని కాపాడుకోవడానికి నానా తంటాలు పడుతూ ఉంటాడు. దొంగలు దోచుకుంటారని, దాయాదులు ఆక్రమించుకుంటారని-రకరకాలుగా బాధపడుతూ సుఖాలను ఆస్వాదించలేడు.

ఏ విషయంలోనైనా 'అతి' పనికిరాదు. 'అతి' లేకుండా తృప్తిపడేవాడు సుఖపడతాడు. ఇతరులకు సాయం చేస్తాడు. మనుషులను ఆదరిస్తాడు. అతనికి భయం ఉండదు. అతనికి శత్రువులు ఉండరు. దుఃఖం ఉండదు. చుట్టూ ఉన్న సమాజం అతనిని గౌరవిస్తుంది. అవసరాల్లో ఆదుకుంటుంది.

అందుకనే తుమ్మల "విపరీతమైన కోరికను మనిషి విడిచి పెట్టాలి. ఇతరులను ప్రేమించాలి. తృప్తిపడడం నేర్చుకోవాలి. ప్రేమ ఉన్నచోట భయం ఉండదు. దుఃఖం ఉండదు. తగాదాలు ఉండవు" అని చెప్పాడు.

మనం సుఖంగా బ్రతుకుతూ మనతోటి వారు సుఖంగా బ్రతికేటట్లు చూస్తూ, సాటివారిని ప్రేమిస్తూ ఉన్నప్పుడు సమాజం బాగుపడుతుంది. అభివృద్ధి సక్రమంగా జరుగుతుంది. దిగులు, విచారం లేకుండా అందరూ ఆనందంగా బ్రతుకుతారు.

**-డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

---

చిత్రాలు, (పెయింటింగ్స్) కనబడతాయి. గుడికి దిగువభాగంలో శిథిలమైన కోనేరు వుంది. ఈ మంటపంలో మధ్య పై కప్పులో 12 రాళ్ళతో మలిచిన వంద రేకుల అద్భుత శతపత్ర కమలం హైలెట్. నాట్యమండపంలో నేలను తాకకుండా వుండే స్తంభం ఆనాటి శిల్ప కళాకారుల నిర్మాణ ప్రతిభల్ని వెల్లడిస్తుంది. బ్రిటిష్ అధికారి హుమల్డన్ ఒకరు దీన్ని కదిలించబోయి, విరమించుకున్నట్లు తెలిసింది. నాట్యమండపంలో కనబడే మూడుకాళ్ళ భృంగీశ్వరుడు, తదితర శిల్పాలను చూడవచ్చును. 1973లో ఆనాటి కేంద్రమంత్రి సరోజినీ మహిషి ఈ గుడుల అభివృద్ధికి 35 లక్షల నిధులను కేటాయించినా, ఆమలుకు నోచుకోలేదు. గుడి చుట్టూ కబ్జాలకు గురైన ప్రయివేట్ కట్టడాలను తొలిగిస్తే, లేపాక్షి మరింత శోభాయమానం కాగలదని యాత్రికులు భావిస్తున్నారు.

**అమరావతి పురావస్తుశాఖ సర్కిల్ మంజూరు**

నూతన రాజధాని అమరావతిలో పురావస్తుశాఖ రాష్ట్ర సర్కిల్ కార్యాలయం మంజూరైంది. ఈమేరకు అమరావతి సాధికారిక అభివృద్ధి సంస్థ చైర్మన్ జె.వీరాంజనేయులు విజ్ఞప్తి మేరకు ఈ కొత్త సర్కిల్ కార్యాలయాన్ని పునర్విభజనలో భాగంగా మంజూరు చేసినట్లు, భారత పురావస్తుశాఖ డైరక్టర్ జనరల్ రాకేష్‌తివారి జూన్ 8న ప్రకటించారు. అమరావతి కార్యాలయం ప్రస్తుతం హైదరాబాద్‌లో వుంటుందని, అమరావతి రాజధాని నిర్మాణం కాగానే అక్కడకు మార్చుతారనీ ఆయన వివరించారు.

*రచయిత సీనియర్ చరిత్రకారులు*

శిశువు శారీరక వికాసానికి తల్లిపాలు
మానసిక వికాసానికి తల్లి భాష

గుండెలోతుల్లోంచి వచ్చేదీ, మనసు
విప్పి చెప్పగలిగేది అమ్మనుడిలోనే.

# తెలుగువారు తమను తాము తక్కువగా భావించుకోకూడదు

**క**నీసం గత యాభై ఏండ్ల నుంచైనా తెలుగువారు ఆంగ్లం మీద పడ్డారు. ఆంగ్లం నేర్చుకొంటేనే బ్రతుకగలం అని అనుకొంటున్నారు. మరి ఇన్ని ఏండ్ల తరువాత పరిస్థితి ఎక్కడకు వచ్చింది? ఒక్క మంచి ఆంగ్ల రచయితను మీరు ఇక్కడ చూడగలరా? బాగా పేరు గాంచిన ఆంగ్ల నవలను రాసిన తెలుగు వారెందరు? ఆంగ్ల దినపత్రికల్లో పేరొందిన కాలమిస్టులు ఎందరున్నారు? కాని మీరు ఏ ఆంగ్లపత్రికనైనా చూడండి; కనీసం ఇద్దరు తమిళుల పేర్లు అయినా కనపడతాయి. వారు తప్పక తమిళ మాధ్యమంలోనే చదువుతారు. ఆంగ్లాన్ని కూడా ఒక భాషగా నేర్చుకొంటారు. అంతే తేడా.

ఇటీవలే దినపత్రికలలో ఒక వార్తను చూశాను. ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయం వారు తెలుగు రాష్ట్రాలలో చాలా వివరంగా పరిశీలించి ఒక ఆశ్చర్యకరమైన ప్రకటన చేశారు. 'ఆంగ్ల మాధ్యమంలో చదువుతున్న పిల్లలకు కూడా సరిగ్గా ఆంగ్లం రావటం లేదు. ముందు మీరు తెలుగు నేర్చుకోకపోతే మీకు ఆంగ్లం కూడా సరిగా రాదు' అని.

**సంస్కృతంపై మోజు**

ఆది నుంచి రాజులకు కూడా తెలుగుపై ఏవగింపు ఉండేది. (ఇప్పటి ముఖ్యమంత్రులు కూడా దానిని చాలా శ్రద్ధతో పాటిస్తున్నారు) కొన్ని వేల ఏండ్ల క్రితం జైన మతం ప్రాబల్యంతో ఉన్నప్పుడు తెలుగురాజులు ప్రాకృతాన్ని పోషించారు. ఆ భాషలోనే రాతి పలకలను వేశారు. పరిపాలన జేశారు. బౌద్ధ మతం ప్రాబ ల్యంతో ఉన్నప్పుడు పాళీ భాషను పోషించారు. అందులోనే రాతి పలకలను వేశారు. పరిపాలన జేశారు. ఏతా వాతా తెలుగుకు ఎక్కడా చోటే లేకుండా చేశారు.

తరువాతి కాలంలో సంస్కృతంపై మోజు పెరిగింది. సంస్కృత శ్లోకాలను ఉదహరించటం, అందులో ప్రవేశం ఉండటం గొప్పగా అనుకోసాగారు.

ఇక్కడి పూజారులు, పురోహితులు దేవుని కొలవటానికి కూడా తెలుగు పనికి రాదని ఇక్కడి వారికి చెప్పారు, చేసి చూపిస్తున్నారు.

మొత్తంమీద తెలుగు ప్రజలకు ప్రభుత్వాలు, పెద్దలు, పండితులు, పూజారులు, పురోహితులు చాలా స్పష్టమైన సందేశం ఇచ్చారు. తెలుగు దేనికీ పనికి రాని భాష; అందులో మాట్లాడటం, చదవటం, రాయటం దండుగ–అని.

అందుకని తెలుగువారు తెలుగులో మాట్లాడరు. తెలుగు సంస్కృతికి దూరంగా ఉంటారు. అందుకని వారికి ఇతరులు ఎవరూ గౌరవం ఇవ్వరు. ఈ ధోరణితో ఉన్నవారు, ఇంత న్యూనతాభావం ఉన్నవారు ఉన్నత స్థాయికి పెరగలేరు.

తమిళులకు నోబెల్ బహుమతులొచ్చాయి. బెంగాలీలకు వచ్చాయి. తెలుగు వారికి రాలేదు. వస్తాయి అనుకొంటున్నారా? 2000 ఏండ్ల తరువాత తమ దేశానికి తిరిగి వచ్చిన ఇస్రయేలీలు తమ భాషను పునరుద్ధరించుకొని అందులోనే చదువుకొంటూ, కొత్త మాటల అవసరం వచ్చినప్పుడు తమ అమ్మనుడి నుంచే పుట్టించుకొంటూ ఎన్నో శాస్త్రాల్లో వింతలు సృష్టిస్తున్నారు. 700 కోట్ల ప్రపంచ జనాభాలో 70 లక్షలుగా కూడా లేని యూదు మతస్తులు ప్రతి ఐదో నోబెల్ బహుమతిని పట్టేస్తున్నారు. వారికి స్వాభిమానం ఉంది. అమ్మనుడి మీద అంతులేని అభిమానం ఉంది కాబట్టే ఇది సాధ్యమౌతున్నది.

ప్రపంచస్థాయి దాకా ఎందుకు? మన దేశంలో ఇచ్చే అత్యున్నత పురస్కారం 'భారతరత్న' ఎంతమంది తెలుగు వారికి వచ్చింది? బెంగాల్ వారికి భారతరత్న వచ్చింది. మహారాష్ట్ర వారికి వచ్చింది. కొంత అరాచకంగా ఉంటాయనుకొనే రాష్ట్రాలు ఉత్తరప్రదేశ్, బీహార్ వారలకు వచ్చాయి. తమిళులకు వచ్చాయి. కర్నాటక వారికి వచ్చాయి. అస్సాం, ఒరిస్సా లాంటి రాష్ట్రాలకు కూడా వచ్చాయి. మొత్తం మీద 45 మందికి ఇచ్చారు ఇప్పటివరకు.

నాకు ఆంగ్లం అంటే వ్యతిరేకత లేదు. దానిని ఒక విషయంగా ప్రాథమిక విద్య నుంచే పెట్టాలంటాను. అలా పెడితేనే దాని మీద పట్టు వస్తుంది. మొత్తం ప్రపంచాన్ని అర్థం చేసుకోగల, చేరగల తెగింపు తెలుగు వాడికి వస్తుంది. సంస్కృతం అంటే కూడా వ్యతిరేకత లేదు. మనం ఎట్టి పరిస్థితిలోనూ సంస్కృతాన్ని ద్వేషించవలసిన అవసరం కూడా లేదు. మన దేశపు సంస్కృతి, కళలు, చేరిన సాహిత్యపుటంచులు, వేలుపులను మొక్కే సంగతులు అందులో పుష్కలంగా ఉన్నాయి. ఆ భాష మాటలను కూడా అవసరమైనప్పుడు తెలుగులోనికి తెచ్చుకోవడానికి వెనుకాడ వలసిన పని లేదు.

కానీ, ఆంగ్లం, సంస్కృతం మాటలు తెచ్చి, తెలుగు మాటలను చంపడాన్ని సహిస్తే మాత్రం తెలుగుజాతి ఆత్మహత్య చేసుకొంటున్నట్లే భావించాలి. తెలుగులో ఉన్న మాటలను తోసిరాజని పెర మాటలను వాడితే మాత్రం వ్యతిరేకించాల్సిందే. సంస్కృతం మాటలు అంటే గొప్ప అనే పిచ్చి పట్టింది మనకు. ఒకవేళ రెండూ వాడుతున్నా సంస్కృతం మాటంటే గొప్పగా చూస్తాం. తెలుగు మాటను చవక మాటగా చూస్తాం. పక్షి అంటే అది గొప్పది; పిట్ట అంటే అది చిన్నది. రెండూ రెండక్షరాల మాటలే.

నమస్కారం, గుడ్‌మార్నింగ్, నమస్తే అంటాము కాని మన తెలుగుమాటను వాడితే చాలామంది తట్టుకోలేకపోతున్నారు. ఎక్కువ మందికి తెలుగు మాటలు ఉన్నాయి అని కూడా తెలియదు. తెలుగులో 'నమస్కారాలు'కు మారుగా 'దండాలు' అనవచ్చు. కైమోడ్పు, చేమోడ్పు అనవచ్చు. వాడుకలోంచి పోయిన ఎన్నో మాటలున్నాయి.

తెలుగు మీద అభిమానం కోల్పోతున్నాం కాబట్టి తెలుగులో సరిగా మాటలాడలేని పరిస్థితి వచ్చింది. మనం ఈ ఆత్మన్యూనతా భావంలోంచి బయటపడాలి. ఆత్మగౌరవంతో ముందుకు సాగాలి. మనం ఎందులోనూ వెనుకబడిలేము–ఒక్క ఆత్మగౌరవంలో తప్ప.

**–పారుపల్లి కోదండరామయ్య,**
హైదరాబాదు, 98496 62305

అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ
ప్రేమించలేడు..

-డా॥వావిలాల సుబ్బారావు
98664 02973

# నా చావు నా హక్కు

ఏమయ్యా జడ్జీ! నా చావు నేను చస్తానంటే శిక్ష వేస్తావా? నా బ్రతుకు మీద పెత్తనం చేస్తానంటావు నాకు జన్మనిచ్చావా? నా బతుకు బాధ్యత నెత్తిన వేసుకున్నావా? బతుకు యిచ్చిన వాడికి హక్కు ఉండ వచ్చు. పోషించినవాడికి హక్కు ఉండవచ్చు. నా మీద ఆధారపడ్డ వాళ్ళకు హక్కు ఉండవచ్చు. ఇందరిలో నీవు ఎవడవు కావే. ఆ సీటు దిగివచ్చి నా బతుకు ఒక్క వారంరోజులు బతుకుదూ, తెలు స్తుంది. ఎవడికీ చెప్పకుండా నీవే చస్తావు. ఆత్మహత్యకు ప్రయత్నం చేసుకుంటూ పొరపాటున ఈ ఎర్ర టోపీ లాఠీగాడికి దొరికి పోయాను గనుకనేగా యింత యాగీ చేస్తున్నావు.

నన్ను నేనున చాలా ప్రేమించుకుంటా. నీవు లోకాన్ని ప్రేమిస్తు న్నట్లు పోజు పెట్టినదానికన్నా ఇంకా ఎక్కువగా ప్రేమించుకుంటాం. కానీ నా రోగాన్ని ప్రేమించలేను. నా దారిద్ర్యాన్ని ప్రేమించలేను. ఈ ప్రేమరాహిత్యాన్ని ప్రేమించలేను. నా నిస్సహాయతను ప్రేమించ లేను. అడుక్కొని బ్రతికే నా దైన్యాన్ని ప్రేమించలేను. నా ఆత్మగౌరవం మీద ప్రేమ వల్లనే ఆత్మహత్య చేసుకుంటున్నాను. నీదేం పోయింది. నా ఆత్మగౌరవం నీవు నిలబెడతావా? ఛీ! ఒకరి వల్ల నిలబడే గౌరవం కన్నా అవమానం ఇంకేం కావాలి. అందుకని నా చావు నన్ను చావనీ!

నా రోగానికి ముందులేదని మీ పెద్ద పెద్ద డాక్టర్లే చెప్పారు. అయినా రోగాలతోనే బ్రతుకుతూ ఉండాలా! మందులకు డబ్బు లేని దరిద్రుణ్ణి. మీరు పెట్టించిన హాస్పటళ్ళు ఇస్తాయా! తగ్గే రోగాలకే మందులివ్వని హాస్పిటళ్ళు తగ్గని వాటికి మందులిస్తాయా! చాటుగా అమ్ముకుంటాయిగాని. అద్దాల తలుపుల ఆసుపత్రులు నన్ను గేటు దాకా కూడా రానివ్వవే.

అసలు ఒకమాట చెప్పు. నేను ఉండి ఎవడికి లాభం! పోతే ఎవడికి నష్టం. ఎవడికీ అప్పులు ఎగవెయ్యలేదు. నా కుటుంబ బాధ్యత లన్నీ తీర్చాను. సమాజంలో ఎవడికీ నా అవసరం లేదు. నాకు నేను అవసరం కాదు. నేను ఇతరులకు భారం. నా రోగం నేను భరించలేను. ఇక ఛస్తే నేం! పోనీ నా బాధ నీపైకి బదిలీ చేసుకుం టావా! ఊహూ..దగ్గరకు గూడ రానివ్వవు. ఇంకా ఈ పోలీసాయనే నయం. చేత్తో పట్టుకొచ్చి పక్కనయినా నిలబడ్డాడు. నా చావే లాభం. నా యాతనను చూచే కష్టం లోకానికి తప్పుతుంది. నా మురికి వల్ల రోగాలు వ్యాపించవు. అందుకయినా నన్ను చావనీయండి. నేరం చేస్తే చట్టంతో నీవు శిక్ష వేసి చంపవచ్చుగాని, నా బ్రతుకు భారమైతే నన్ను నేను చంపుకోగూడదా! బ్రతుకు బాధ్యత తీసుకోనివారికి చావుమీద తీర్పు యిచ్చే హక్కు ఎక్కడిది!

సరేగాని ఒకటి అడుగుతా చెప్పు. బతుకుమీద ఆశ ఉన్న నేర స్తుడికి మరణశిక్ష వేసి కసుక్కున తల తీస్తావా! ఎంత తప్పు చేస్తే మాత్రం నేరబుద్ధి మాన్పించలేవా! నిర్బంధంలో ఉంచో, ప్రేమించో, కోపించో, దండించో, దారికి తేలేవా! తేగలను కాని, ఆ బాధ్యతను తప్పించుకొని నేరం వాళ్ళమీదకే తోస్తావు. నీవెనక అంత ప్రభుత్వం ఉంది; మంది మార్బలం ఉంది; శరీర, మానసిక వైద్యులున్నారు. ఓయబ్బ! ఎంతమందో! వాళ్ళకు చెప్పవు. ఊరకే పుస్తకాలు తిరగేసి మరగేసి 'ఉరిశిక్ష ఖాయం' అంటావు. నా పరిస్థితిని నీ యంత్రాంగం ఆదుకోలేదు. నాకు నేనే ప్రాణం తీసుకొని బాధావిముక్తి చేసుకుంటే 'అది నేరం' అంటావు. నిజమే నేరమే అనుకో అది ఎవరి మీద చేసిన నేరంట. ఎవరికి నష్టం కష్టం కలిగాయని నేరం! ఏ నేరము చేయని నన్ను -రోగంతో అనవసర బాధతో బతకమని చట్టం పేరున శిక్ష వేస్తావా! నేరం నాదా! నీ చట్టానిదా! నీ ముందున్న ఆ పుస్తకాలు మూసేసి, ఇంటికి వెళ్ళి, ప్రశాంతంగా కూర్చొని ఆలోచించు. నా ఆత్మహత్య నాకెంత అవసరమో ధర్మమో నీకే తెలుస్తుంది.

"దేవుడిచ్చిన జీవితాన్ని మధ్యలో అంతం చేయటం భగవంతుని ఆజ్ఞ ఉల్లంఘించటం అని, ఆయన యిచ్చిన జీవితాన్ని కష్టాలు సుఖాలతో సహా అనుభవించాలి" అని ఎక్కడో చదివినట్లున్నావు. లేక ఏ మతబోధకులో చెవిలో ఊదినట్లున్నారు. అసలు ఆ దేవుని మాటలు ఎవరయినా చెవులతో ఆయన గొంతు నుండి విన్నారా? చెప్పవయ్యా! అబద్ధం ఆడలేక నిజం చెప్పలేక సతమతమవుతున్నట్లు న్నావు. ఏం? అంతేనా?

సరే దేవుడు గూడ మన మాటల్లో వచ్చాడు గనుక చెపుతా! మొన్న రాజస్థాన్‌లో 'సల్లేఖనా' దీక్షలో ఎవరో జైనముని అన్నపానాలు మాని ఆమరణం ఉంటానంటే-మీకేం వచ్చిందయ్యా కోర్టులో అంత గోల చేశారు. ఆయన మీద శిక్షార్హమయిన నేరం ఆరోపిస్తారా? అవ్వేవో చట్టాలు -సెక్షన్లు అప్పజెప్పి ఆత్మహత్యానేరం ఆరోపిస్తారా? ఎవరయ్యా వ్రాశాడు ఈ సెక్షన్లు చట్టాలు? నీలాంటి వాడేనా? దిగి వచ్చిన దేవదూత లెవరయినా వ్రాశారా?

నీవు వ్రాసుకున్న చట్టం నిన్న మొన్నటిది. ఆ జైనసాధువు పాటించిన వ్రతం 2500 సంవత్సరాల నుండి వస్తున్నది. మౌర్య చంద్రగుప్త చక్రవర్తి గూడ 'సల్లేఖన' వ్రతంతో శ్రావణ బెళగొళలో తనువు చాలించాడుట. ఆయన చక్రవర్తి. నీకంటే పెద్ద పదవే- ధర్మాచార్యులతో చర్చించే ఆ వ్రతం చేపట్టాడు. ఇంకా వందలమంది చాలాకాలంగా అట్లాగే దీక్ష పడుతున్నారు. నేనంటే ఇక ఆశ లేక చావుకు దిగాను గాని వాళ్ళు అట్లా కాదే. ముక్తి కోసం, ఉన్నత జీవితానికి ఇది సరైన మార్గం అనుకొని, మళ్ళీ జన్మలో ఇంకా శ్రేష్ట జన్మకోసం, మరణాన్ని సగౌరవంగా, నియమంగా, వ్రతంగా, పవిత్రంగా ఆహ్వానిస్తున్నారు. నీ నల్లకోటుకు ఇది గూడ తప్పుగా కనిపించింది గదూ!

ఓహో! నీవు ఛాందసాలు లేని హేతువాదివా! అయితే చెప్పు ఏ హేతువాదం వల్ల ఆ జైనమునిది తప్పు. ఎవరి మత ఆచారాలను వారు గౌరవించుకొనవచ్చునని సెక్యులర్ హేతువాదులు అంగీక రిస్తారు కదా! రాజస్థాన్ హైకోర్టు వారు "ఇది అవశ్య ఆచరణీయ మతాచారం కాదు" అని తీర్పు ఇచ్చారుట. ఇది ఒక ఆర్గ్యుమెంటా? ఏ మతంలోను అవశ్యమతాచారాలే వుండవు. మతస్తునికి విశ్వాసమే అవశ్యం కాని ఆచారాలు ముఖ్యమా? ఆచారాలు ఐచ్ఛికాలు. శిక్షణ

సాధనాలు తిరుపతి యాత్ర, ఏకాదశి ఉపవాసం, శివరాత్రి జాగరణ అవశ్యమా? సన్యాసం అవశ్యమా? బౌద్ధులకు శ్రమణదీక్ష, మహమ్మదీయులకు మక్కా యాత్రా అవశ్యాలా? పోనీ జైనముని అందర్నీ తన లాగా వ్రతాలు చేసి చావమని బోధిస్తున్నాడా! పోనీ తానయినా అందరూ అడ్డంపడుతున్నా కాదని చావుకు తలపడ్డాడా? తన కుటుంబ సభ్యులు సగౌరవంగా ఆయన్ను సేవిస్తున్నారే! ఆయన తన ముక్తి మార్గం గూడ నీ యిష్ట ప్రకారమే సాధించుకోవాలా! వ్యక్తికి ముక్తికి మధ్య నీ పురచేతి పురాణం ఎందుకు? గాంధీ గారి ఉపవాసాలా? పొట్టి శ్రీరాములు గారి ఆమరణ దీక్షా! వారికి 'జాతిపిత'-'రాష్ట్రపిత' బిరుదులా? నాకు శిక్షలా?

'దధీచి' వెన్నెముకను ఆయుధం చేసుకోవటానికి ఆయన మరణం హత్యా! ఆత్మహత్యా! జీమూతవాహనుడు తన శరీరాన్ని గరుత్మంతునికి తినిపిస్తే అది హత్యా ఆత్మహత్యా! భీష్ముడికి ఇచ్ఛా మరణం అంటే ఆత్మహత్య కాదా! మరి ఏసుక్రీస్తో! "ప్రభూ నీయిచ్ఛయే నెరవేరుగాక' అని ఎందుకు చావనిచ్చుకున్నాడు. కోరితే వేలాది సైన్యాన్ని ప్రభువు పంపడా' అన్నాడే ఎందుకు అడగలేదు. తన మరణం తన యిష్టం.

ఇవన్నీ ఆత్మ బలిదానాలయ్యా! ఒక మహాకార్యం కోసం చేసే త్యాగాలు, ప్రాణత్యాగం కన్నాగొప్ప త్యాగం మరేముంటుంది? మా సంగతేం చూస్తావుగాని ఉరిశిక్ష పేరున ప్రభుత్వ హత్యల గురించి ఆలోచించు. ఏవో కొత్త చట్టాలు తేబోతున్నారటగా! విదేశీ ఉగ్రవాదులకు తప్ప ఉరిశిక్ష రద్దు చేస్తారటగా. వాడి ప్రాణానికి ఒక విలువ, వీడి ప్రాణానికి ఒక విలువ ఉంటుందా? గొప్ప షరాబులే! వాణ్ణి గూడ బంధించి మార్చలేరా! కనీసం గోళ్ళు కొరుక్కుంటూ బ్రతికి అయినా మారతాడేమో! నిజాలు చెపుతాడేమో చూడరాదా! చంపితే ఏమొస్తుందయ్యా! మనిషికి ప్రాణం మనం యివ్వలేదు. సమాజం, పరిసరాలు కలిసి వాడికొక స్వభావాన్ని యిచ్చాయి.సమాజం యిచ్చిన స్వభావాన్ని మార్చాలిగాని నీవు యివ్వని ప్రాణాన్ని తీసే హక్కు నీకు మాత్రం ఎవరిచ్చారుట.

'మరణదండం వేయదగ్గ నేరం చేసినా సరే- వాడిని దేశం నుండి వెళ్ళగొట్టాలే గాని, చంపరాదు' అని రెండు వేల సంవత్సరాల క్రితం ఆచార్య నాగార్జునుడు చేసిన బోధ ఇంకా చెవికి ఎక్కలేదా? ఛా! మీరింతేనయ్యా!

ఇంతకీ నా సంగతి చెప్పు. నన్ను చావనిస్తావా లేదా? లేదంటావా? నా బాధలన్నీ తీర్చే హామీ పడూ- నాకేం చావటం సరదానా? ఈ జీవితం ఒకసారి పోతే మళ్ళీ రాదని నాకూ తెలుసు. ఒకవేళ మళ్ళీ జన్మలంటూ ఉన్నా- ఈ జీవితం లోని అందమయిన నా అనుభవాలు వచ్చే జన్మలోకి రావు. గుర్తు అయినా ఉండవు. నా జీవితాన్ని అందరికన్నా నాకు నేను ఎక్కువ ప్రేమించుకుంటాను. నా కష్టాలను, లోపాలను నీవు ప్రేమించలేవు. నేను వాటితో సహా నన్ను ప్రేమించుకుంటాను. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఈ పిచ్చిముండ దేహాన్ని విడిచిపెట్టటం నాకు మాత్రం యిష్టమా? ఎంత గారాబంగా పెంచుకున్నాను ఈ దేహాన్ని. అంగుళం అంగుళం శ్రద్ధగా పెంచుకున్న ఈ దేహాన్ని నిర్దాక్షిణ్యంగా, నిస్సంకోచంగా చంపుకుంటున్నానంటే ఎంత దుఃఖం, ప్రేమ ఉన్నాయో నీవు ఊహించగలవా? ఇపుడే ఊహించలేవు. ఇంటికి వెళ్ళి తీరికగా ఆలోచించు.

పోనీ ఆత్మహత్య నేరానికి ఉరిశిక్ష వేయరాదూ! ఆ పాపమేదో మీ చట్టానికే అంటించుకోవచ్చు. రేపు చెప్పు నీ శిక్ష తీర్పు. నేనేం పారిపోనుగా. నీవు రేపు తీర్పు చెప్పొచ్చే సమయానికి నా మనసే మారిపోతుందేమో! ప్రాణం మీది తీపి నా బాధలను జయిస్తుందేమో! హాయిగా ఇపుడే ఆత్మహత్య చేసుకోనివ్వవయ్యా బాబు నీకు పుణ్యముంటుంది. ❊

*(చలం గారు వ్రాసిన 'ఆర్గ్యుమెంటు కథ - నాకు చాలా యిష్టం)*

## ఆహ్వానాలు

## శతాధిక కవి సమ్మేళనం

ధూర్జటి రసజ్ఞ సమాఖ్య సాహితీ కళావేదిక, శ్రీకాళహస్తి (చిత్తూరు జిల్లా) ఆగస్టు 28న తిరుపతిలో శతాధిక కవి సమ్మేళనాన్ని నిర్వహిస్తున్నది. ఇందులో కవులు, రచయితలు తాము రచించిన పద్యాలను, కవితలను గానం చేస్తారు. వివరాలకు : యువశ్రీ మురళి (94913 12522), తీగల వెంకటయ్య (94417 76537)లను సంప్రదించవచ్చు.

## చిత్తూరుజిల్లా రచయితల మహాసభలు

సెప్టెంబరు 10,11 తేదీల్లో తిరుపతిలో చిత్తూరుజిల్లా రచయితల మహాసభలు ఘనంగా జరుగనున్నాయి. 47 ఏళ్ళ తర్వాత మళ్ళీ ఈ మహాసభలు జరుగుతున్నాయి. జిల్లాలోని అన్ని సాహితీ సంస్థల, రచయితల సంఘాల సహకారంతో మహాసభల్ని నిర్వహిస్తున్నామని పలమనేరు బాలాజీ (9440995010), సాకం నాగరాజ (9440331016) తెలియజేస్తున్నారు. ఆసక్తిగల వారందరూ పాల్గొనవచ్చు.

## వంద కవితల పండుగ కథ, కవితల శిక్షణా శిబిరం

మల్లెతీగ సాహిత్య వేదిక(విజయవాడ)-కవితా వికాస వేదిక (హైదరాబాద్) సంయుక్తంగా సెప్టెంబరు రెండవ వారంలో కథ, కవితల శిక్షణా శిబిరం ఏర్పాటు చేయనున్నాయి. విజయవాడలో జరుగనున్న ఈ శిబిరంలో వర్ధమాన కవులకు, రచయితలకు కవిత, కథ నిర్మాణ పద్ధతులు, కథన రీతులు, జాతీయ, అంతర్జాతీయ సాహితీ ధోరణులు తదితర అంశాలపై ప్రముఖులచే శిక్షణ నివ్వడం జరుగుతుంది. ఈ శిబిరంలో వందమంది కవులతో కవి సమ్మేళనం వుంటుంది. ఒకరోజు జరిగే ఈ శిక్షణాశిబిరంలో పాల్గొనదలచినవారు ముందుగా తమ పేర్లను నమోదు చేసుకోవాలని నిర్వాహకులు కలిమిశ్రీ (92464 15150), బిక్కి కృష్ణ(99127 38815) తెలియజేస్తున్నారు.

**సృజనకు విత్తు సొంతభాష... రచనకు సత్తువ ప్రజల భాష**

హోసూరు కత

# వెతికితే సిక్కుతుందా!

-బడిగోళ్ళ సత్యనారాయణ

ఎన్నో ఏండ్లనింక మావూరి జనాలు ఏకాశి పండగను బలే బక్తిగా నియమనిష్టిగా సేసుకొంటా ఉండారు. యావూర్లా ఎట్లోగానీ మావూర్లా మాత్రము ఏకాశి పండగ అనిడిస్తే గొణ్ణె కారుస్తా ఉండే సిన్నోడు కూడా బలే కుషీగా ఎగిరి దుముకుతాడు. ఏలంటే మావూరి బడిగితాత చానా గాసిపడి, రెయ్యనక పగలనక బలే కాయాషితో రుక్మాంగద చరిత్ర సెప్పిచ్చిండాడు. ఆ కేళికని ఏకాళి పండగనాడే ఆడుతారు. మావూర్లా బడిగితాత అంటేనే తెలీకున్నోళ్ళు ఎవురూ లేరు. ఏలంటే ఆ తాత నాటకాలరాయుడు. రాగము తాళము సుద్దే తెలీకున్నోళ్ళనంతా ఒగతావకు సేర్సి, రాగము తాళము రుసి సూపిచ్చి, వేషము యేపిచ్చి మంచిమంచి పాత్రలు కట్టిపిస్తా ఉంటాడు.

ఏకాశి పండగనాడు ఊర్లా సిన్నోళ్ళు పెద్దోళ్ళు అందురూ ఒక్కపొద్దు ఉంటారు. ఒక్కపొద్దు ఉండుకోనే సిన్నోళ్ళము బడికిపోతే, పెద్దోళ్ళు గొర్రెలు మేకలు ఎనుముగొడ్లు ఆవులట్లా జీవాల్ని గుండ్ల చెరువుతట్టుకి మేపేకి తోలుకొనిపోయిరి. మాపుసారి నాలుగ్గంటల పొద్దుకే బడినింక మేము చెరువునింక జీవాలూ ఇంటితట్టుకు పారితిమి. బిరబిరన ఇంటికి వచ్చిడిసి, ఆడోళ్ళు బాననిండుగ కాగిపెట్టిండే ఉడుకునీళ్ళను గబగబ పోసుకొని కొత్త బట్టలు కట్టుకొంటిమి. అనెంక పెద్దోళ్ళు దిగిరి సూదండప్పా పనసపండ్లు కోసేకి, యావీదిలా సూసినా గమ్మని పనస తొళల గమ్ములే వస్తుంటే నా సామిరంగ ముక్కుపుటాలు అదిరిపోతా ఉండాయి.

ఒగింట్లా పెద్దమ్మ సామల్ని సెబ్బిగా యేపి, ఆ బురుగుల్ని యిసిరి పిండిచేసి, దాన్ని బెల్లము పాకములా కలిపి రవ్వుంటల మాదిరి ఉంటలు కడుతా ఉంది. అబ్బబ్బా ఆ గమ్ములు సెప్పేకి సాద్దెమే లేదు. ఆ గమ్ముల్ని పట్టినోళ్ళకే ఆనందము తెలిసేది. ఇంగొగింట్లా కరేపాకు కమలక్క, సెనిగిత్తుల్ని సెబ్బిగా యేపుతా ఉండే గమ్ములు, రచ్చమింద కూకొని తెంకాయలు, పనసపండ్లు, పళ్ళకాయలు, మామిడిపండ్లు అమ్ముతా ఉండేవాళ్ళ ముక్కుల్లోగాకి మెల్లిగా ఎక్కుతా ఉండె. యావీది తిరిగి సూసినా, యా ఇల్లు తొక్కినా పండగ వాసన గజ్జెకట్టి ఆడతా ఉంది.

మునిమాపుసారే ఊరుముందర గోయిందశెట్టి, నంజుండశెట్టి



ఇండ్లకు నడాన ఎత్తుగా తెంకాయ గరుల్లా సప్పరం యేసిండారు. పెద్దపెద్ద రేడియోల్ని తెచ్చి మాన్లకూ ఊరాకిలి కంబాలకూ కట్టించారు. నమో వెంకటేశా పాట సురువాయె. మాలగేరి సిన్నోళ్ళూ, దిగవీది, పైవీది, గెరిగమ్మగుడి వీది, కోటీది, సెంతానపల్లి ఎల్లమ్మగుడి వీది, పోస్టాపీసు వీదుల్లా నింకా మగసిన్నోళ్ళు పరస మాదిరి ఎగురుకొని దుముక్కొని కేళిక ఆడే సప్పరము దగ్గిరికి సేరుకొని పాటలకు తగినట్లు కుణుస్తా ఉండారు. నేను కూడా ఆ గుంపులా కొంచేపు ఎగిరి ఆడితిని.

మైకును అరువు సేసే అన్న మమ్ముల్ని సూసి, "రేయ్ ఏమండ్రా ఇట్ల కూతలు పెడుతా ఉంటారు. రెయ్యి తొమ్మిది గంటలకు పైన కేళిక సురువయ్యేది. ఇబుడే వచ్చి గలాట్లు సేస్తా ఉండారేల. అందురూ ఇండ్లకు పోయి ఒక్కపొద్దు యిడిసేసి రాపోండ్రా" అని గదిరినాడు.

మేమా యినేది! కొందురు, "అనా ఏమి కేళికనా ఆడేది" అని అడిగిరి. ఆయన్నకు నోరు తిరక్కుండా "రుక్మమ్మా మంగమ్మా సరిత్ర మంటరా" అనె. ఆ మాటకి సిన్నోళ్ళము "అయ్యయ్యా, మని వీదిలా ఉండే రుక్మమ్మ, ఎదురీదిలా ఉండే మంగమ్మ సరిత్రమంటరా" అని కేకలు కొట్టుకొని నగుతా ఉండాము. ఆయన్నకు కోపము రేగిపోయె నేమో, ఆ సప్పరములా ఒగ సన్నకట్టెని యించుకొనె. ఎక్కడోళ్ళమక్కడ సెల్లాబిల్లాలుగా పారిపోయిడిస్తిమి.

పొద్దున్నింకా ఒక్కపొద్దు ఉండి సుస్తుపడిపోయిన నేను ఇంటికి పారిపారి పోతిని. మాయమ్మ దేవునిపటాలకంతా పూలారాలను కట్టి అలంకారము సేసిండాది. మాయబ్బ తెంకాయల్ని పగలగొట్టి సిప్పల్ని తురుముతా ఉండాడు. ఒగ తట్టలా పరంగిపండ్లు కోసి పెట్టిండారు. ఇంగొగ యెలుపుగా ఉండే తట్టలా సెనిగిపిండి బెల్లము కలిపిండారు. ఒగ గిన్నెలా అటుకులు నానిపి దాంట్లా కొమ్మెరి తురుమూ బెల్లమూ యేసి పెట్టిండారు. ఇత్తళి తట్ట మింద అంటాకుని పరిసి, పనస తొళల్ని సిన్నసిన్నగా సీల్చి యేసిండారు. బాగా మాగి సుక్కలు ఎగిరిండే అంటిపండ్లను తోలుతీసి గుండ్రముగా తరిగి పనస తొళల జతకు కలిపిండారు. బెల్లమూ కొమ్మెరి తురుములను రవంత తేనెనెయ్యిలా కలిపి దేవుని ముందు తళిగె యేసిండారు.

ఇవన్నీ సూస్తావుంటే ఎబుడెబుడు పూజ ముగిస్తారా అనిపిస్తా ఉంది మాకు. మాయబ్బ తెంకాయకొట్టి మంత్రాలు సదువుతా ఉండాడు. మాయమ్మ బలే నెమ్మిదిగా సేతులు జోడించి మొక్కతా ఉంది. నేనూ నా ఇద్దరి తమ్ముళ్లూ సెల్లెలూ అంతాసేరి దిండుపోరువు పెట్టి మొక్కుకొంటిమి. ఆమీటకు మంగళారతి తీసుకొంటిమి. పసుపు కుంకుమ పూలు పెట్టి మాయబ్బ కాళ్లకు మొక్కింది మాయమ్మ. మేము కూడా ఒగొగరే అమ్మా అబ్బల కాళ్లకు మొక్కతా ఉంటే, 'మా బిడ్లను బాగా కాపాడు సామీ, మంచి బుద్ధిలా బాగా సదివి, మా కండ్ల ముందర చానా గొప్పోళ్ళను కానీయప్పా' అని వేడుకొంటా కండ్లల్లా నీళ్ళేసుకొనిరి. అది సూసి నా కంట్లానూ జలజల నీళ్ళు కారిపోయె.

"అందురూ కూకోండా, ఆకులేయవే వాళ్ళకి" అనె అబ్బ. అంతే తళిగ యేసిండే పదార్తాలంతా మా ఆకులమిందికి వచ్చె. రుసి అంటే రుసి, సెప్పేకి సాద్దెము అయ్యే లేదు. కదుపునిండుగా బాగా మెక్కితిమి. ఇంతలా 'కేళిక సురువయితా ఉంది అందురూ రాండప్పా' అనే మైకు మాటలినబడె. అంతే ఒగ దుబటి ఎత్తుకొని బలే సంతోషంగా ఊరు ముందరికి పారితిని. మాకు ముందే పోయి జాగాలు పట్టిం డారు. ఆడోళ్ళు మగోళ్ళు అనే బేదము లేకుండా అర్లేసుకొని సాపల మింద కూకొనుండారు. ముసిలోళ్ళు నెత్తికి యీబూది పట్టెలు తీసి, తెల్లగా సళపళగా పంచెలూ సొగాయిలూ యేసుకొని, సల్లగాలిని పీలుస్తా రచ్చమింద ఏకముగా కూకొనుండారు. వన్నెవన్నెల లంగాలూ ఓణీల్లా ఆడబిడ్డలు, నిలబడలేకా గబుక్కని కూకొనలేకా తారాడతా ఉంటే, వయసు సిన్నోళ్ళు ఊరాకిలిమింద పరిసిండే బండలమింద కెక్కి, సప్పరం తట్టూ పదుసుల తట్టూ సూపుల్ని యిసరతా ఉండారు. అవ్వోళ్ళు బలే కుషీగా వక్కాకుల్ని కుటుముతా ఉండారు.

తెరలోపల ఇమ్మేళము కేళిక మొదులుపెట్టిరి. ఇమ్మేళమంటే, వేషదారి పాటపాడితే, ఆ పాటనే తెరవెనక నింక ఇంకొందరు పాడ తారు. తబలాని వాంచతా ఉంటే, ఆరుమని మాత్రము ఒగే సుతిలా గుయ్యిమంటా ఉంది. ఇసకేస్తే రాలకుండేనట్ల బయిలంతా జనము నిండిపోయిండారు. "యో! పొద్దయితా ఉంది, బిర్నా పార్టీలు కట్టుకొని రాండప్పా" అని కున్నిసిన్నోళ్ళు సీళ్ళేసుకొని కూస్తా ఉండారు. బడిగి తాత ఇంటితావ పూజను ముగించుకొని, తెరలోపలికొచ్చి, వన్నెలు పూస్తుండేవాళ్ళని బిరబిర్నా కానీండప్పా అని ఎచ్చరిస్తా ఉండాడు. మొదులు మొదులు సోపుదారి పార్టీ కట్టే తిమ్మరాజును కూకోబెట్టి తయారుసేసిండారు. ఆమీటకు రుక్మాందరాజును బలే బాగా అలం కారము సేసిండారు.

వినాయకుని పూజతో కేళిక సురువాయె. జోరుగా కురుస్తా ఉండిన వాన నెమ్మిదిగా నిలిసిపోయినట్ల బయలంతా గుండుసూది సద్దుగా సద్దుమణిగింది. తెర తీసిరి, "సోపుదారి వచ్చె సబకు సొంపు మీరగను" అనే పాటను పాడతా సోపుదారి వచ్చి, ఉడన్లు కొడతా ఆడతా ఉంటే, 'ఔరా కిలాడీ' 'దరువేయ్' 'శెబాష్' అనే తెలుగు పలు కులు బయిల్లా మారుమోగతా ఉండాయి. విదూషుకుడు వచ్చి "ఓ సోపుదారీ, నీవు వచ్చిన సంగతి ఏమి?" అనడిగె, "ఈపొద్దు మన పురములా రుక్మాంగద మహారాజు ప్రజల క్షేమము కోసము ఏకాదశి వ్రతమును అందురూ ఆచరించవలయునని ఆజ్ఞాపించిరి. ఆజ్ఞను శిరసావహించి పుర ప్రజలకు తెలియజేయుటకై వచ్చితిని విదూషకా" అనె సోపుదారి, "ఔనా! సరేనప్పా, బలే సంతోషమాయె నీవు వచ్చిం దానికి. ఏం ఊదాలనో బిరబిరన ఊదిడిసి పోయిదు.." అని విదూ షుకుడు అంటా ఉంటే బయలంతా నగవులు సురువాయె. తిరగా సోపుదారి అందుకొనె.

"ఓ పుర ప్రజలారా! మన రుక్మాందరాజు ఏమి తెలియజేసి నాడంటే..." లోపల్నింకా బడిగి తాత సెప్పిస్తా ఉండాడు, కానీ ఆ సోపుదారికి సరిగ్గా వినిపిస్తాలేదేమో! వాని సొంతంగా కతను ఒప్పిస్తా ఉండాడు. "ఈపొద్దు ఏకాదశివ్రతము కారణముగా అందరూ ఉప వాసముండాల. శిశువులకు కసువేయకూడదు, పశువులకు పాలు పోయకూడదు" అనె. "అయ్యో, శిశువులకు పాలు పోయకూడదు, పశువులకు కసువేయకూడదు అని సెప్పప్పా" అని గట్టిగా తెరలోపల నింకా సెప్పిస్తా ఉండారు. పటపటమనే పటాసు సరాల మాదిరిగా బయల్లా నవ్వులు పేలతా ఉండాయి.

సప్పరాల్ని అనుకొని కూకొని తూగిడిస్తా ఉండిన పండుమిరప కాయల పాపమ్మ లంకిణీ మాదిరిగా పైకి లేసె. "ఏమయ్యా నీకు బుద్ధుందా? ఒగే వారమాయె నా కోడాలు కని. కసువు యేయద్దు, పాలు పోయద్దు అంటావా! ఎవురు సెప్పిచ్చిరప్పా ఇట్లా బుద్ధి" అని

కిర్లుతా ఉంది. యెనకుండే వాళ్ళు "ఇది కేళిక, కలకుండా కూకొనమ్మో" అని కూతలు పెట్టేతలికి కలకుండా కూకొనె.

నల్లరగ్గు కప్పుకొని గణేశబీడి తాగతా ఉండిన ముసిలాయప్ప ఒగడు గబుక్కున పైకి లేసి "యోవ్, ఏమి నీవు సెప్పేది, పుట్టిన బిడ్డ కసువు తింటుదేమయ్యా" అని గదిరె. విదూష్కుడు నడువులా దూరి "కసువుతిని పాలిచ్చే ఆవుపాలు పోయకూడదనె" అని సర్దిసెప్పె. అనెంక రుక్మాంగద రాజు, మోహనాంగి పార్టీలతో కేళిక బాగా జరగతా ఉంది. సిన్నోళ్ళు చానామంది నిద్దరమ్మ ఒళ్ళోకి సేరుకొంటా ఉండారు. ఆడోళ్ళు వక్కాకు తమ్మలను ఉమిసేకి కూడా పక్కకు కదలకుండా ఆడే ఉముసుకొని కేళికలా మునిగిపోయిండారు. నాకూ తూగొచ్చేసె.

కోడిగూజాముకు రవంచ ముందు పొద్దు అయింటుంది. టమ టమ తమట యేట్లు మోగె. నిదరపోతుండే వాళ్లంతా ఉలిక్కిపడి లేసిరి. బిప్పన్నగాడు వచ్చె. గజ్జెలు కట్టుకొని దణదణదణని ఆడతా పాడతా ఉండాడు. రవంచేపు పాడి నిలిపి, "సెట్లుకు గుట్లుకు సెనిక్కాయిలు యేయద్దండప్పా, సీమంతా సెడిపోతుంది... ఇంట్లా ఆడోళ్ళకి రాగులు యిసిరి యిసిరి సేతులు మంట. సిన్నోళ్ళకి ఏరిగి ఏరిగి గుద్దలు మంట" అనె. బొప్పన్న మాటలకి నిదరపోతా ఉండేవాళ్ళంతా బెబ్బరిచ్చుకొని లేసి కూకొని నగుతా ఉండారు.

కేళిక ముగింపు దగ్గిరికి వచ్చె. రెయ్యి తినిండే పండ్లూ సెనిగి పిండీ కడుపుల్లా బాగా ఊరిపోయెనేమో, సిన్నోళ్ళు తుస్సుబుస్సులు సురువాయె. ఆ గబ్బుకు తట్టుకోలేక "థూ ఎవుర్రా లత్తనాకొడుకుల్లారా" అని తిట్టుకొంటా లేసిన ఆడోళ్ళూ మగోళ్ళూ రగ్గుల్నీ సాపల్నీ వదురుకొని ఇంటితట్టుకు పారతా ఉండారు. వెలుగయ్యే పొద్దుకి, ఒక్కపొద్దులుండే వాళ్ళంతా పారణ యిడండా అంటా మహామంగళారతితో కేళిక ముగిసె. నిమిషాల్లా జనము మాయమైరి. ఊరంతా పారణపూజ కర్పూరమూ సాంబ్రాణికడ్ల గమ్ములా నిండిపోతే, బయలు మాత్రము వక్కాకు తమ్ములూ బీడిమోట్లూ సెనిక్కాయపొట్లుతో ఉక్కిరి బిక్కిరాయె.

ఊరు ముందరనింక వేణుగోపాలసామి మెరగణి సురువాయె. బాలనాగప్పోళ్ళు కొలువు ఊదుకోని డోలు వాంచుకోని వస్తా ఉండారు. ఒగొగ ఇంటి తావా, కాయీ పండూ పూలను తట్టిల్లా పెట్టుకొని, వేణుగోపాల సామి కోసరము ఎదురు సూస్తా ఉండారు ఆడోళ్ళు, నేను కూడా నీళ్ళు పోసుకొని పారణ పూజ ముగించి, అమ్మకాళ్ళను కండ్లకద్దుకొని, వేణుగోపాలప్పని సూసేకి ఇంటినింకా ఇవతలకి వస్తిని.

మా ఇంటిముందు సింతమానుపైన కూకోనుండే పొద్దప్ప నన్ను సూసి "ఏమప్పా రెయ్యి కేళిక ఎట్లుండె?" అని అడిగె, రెయ్యిపూట ఏమి నడిసినా సూసే బాగ్యము ఆయప్పకు లేదుకదా పాపము. దానికి ఆయప్ప తావ, "అయ్యో ఆ కతను ఏమి సెప్పుదునప్పా. వెదికితే సిక్కుతుందా ఆ ఆనందము, వెలిచ్చి కొనుక్కొంటే వస్తుందా" అని సెప్పితిని.

–రచయిత సెల్ : 7373761736

గొణ్ణె : చీమిడి
కాయాషి : అక్కర
సెబ్బి : పక్వము
సప్పరం : పందిరి
కుణిసేది : చిందేయడం
అంటాకు : అరిటాకు
అర్లేసుకొని : విరేసుకొని
సీళు : ఈల
కిర్లు : అరచు
మెరగణి : ఊరేగింపు
పొద్దప్ప : సూర్యుడు
గాసి : శ్రమ
గమ్ములు : సువాసన
గర్లు : మట్టలు
పరస : జాతర
పరంగి : బొప్పాయి
దిండుపోరువు : పొర్లుదండాలు
కుటుము : నములు
ఉడన్లు : గెంతులు
వదరు : విదిలించు
కొలువు : సన్నాయి

# ముసునూరి సోదరులు

-గంగుల బాబు
9391685686.

**ఓ**రుగల్లును ప్రతాపరుద్ర చక్రవర్తి పాలిస్తున్న రోజులలో ఎవరికీ అంకెకు రాని ఒక అరబ్బీ గుర్రాన్ని లొంగదీసి స్వారీ చేస్తాడట ఒక వెలమ వీరుడు. అందుకు ప్రతాపరుద్రుడు సంతసించి అతనికి అశ్వారాయుడు అని బిరుదునిచ్చి తన శంకరగిరి పరగణాలో చిన్న ప్రాంతానికి మండలాధిపతిగా నియమిస్తాడు. అది ప్రస్తుతము ఖమ్మం జిల్లాలోని అశ్వారావుపేట దగ్గరలో ఉన్న పాలవరప్పాడు ప్రాంతము. పాలవరప్పాడు కేంద్రంగా పాలన సాగిస్తాడు. అశ్వారావుపేట, అశ్వా పురం అతని పేర వెలసిన గ్రామాలే. అశ్వారాయుడు పశ్చిమ తెలం గాణా నుండి కొత్తగా ఈ దండకారణ్యంలోని మండల పాలకునిగా వచ్చినవాడు కొత్తప్రాంతం. ఈతనికి స్థానికుల అండదండలు అవసరం తన పాలవరప్పాడుకు దగ్గరలోనే ముసునూరు అనే ఊరిలో (ప్రస్తుతం అది ముస్టిబండ) రైతు కుటుంబానికి చెందిన పోలయ అతని దృష్టిని ఆకర్షించినాడు. అతడు యువకుడు, మేధావి, యుద్ధ వీరుడు కూడ. అతని చిన్నతమ్ములిద్దరు కాపయ, పోతయలుకూడా చిన్న వారైనా, అన్నకున్న లక్షణాలను పుణికిపుచ్చుకున్నవారు. ఈ ముువ్వురు అశ్వారాయనికి అండదండలందించారు. వీరు స్థానికులు. కోయభాషను గూడా తెలిసిన వారవటంతో మండల మంతా కోయ వారధిక సంఖ్యలో ఉన్నవారు కనుక పెద్ద వాడైన పోలయకు మండల బాధ్యతనంతా అప్పగించి, తన మండలాన్ని త్వరితగతిని వృద్ధిపరి చాడు. ఇంతలో ఢిల్లీ సుల్తానుతో చివరి నిర్ణాయకమైన యుద్ధం, రుద్రుని అపజయంతో ముగిసింది. యుద్ధ వీరులైన అశ్వారాయుడు, పోలయలు సహజంగానే ఆ యుద్ధంలో పాల్గొన్నారు. ప్రతాపరుద్రుని దిల్లీకి బంధీగా తీసుకుని వెళ్తుంటే మధ్యలో నర్మదా నదిలో పడి ప్రాణత్యాగం చేశాడు. ఆ యుద్ధంలో పాల్గొన్న వీరులంతా ఇంచు మించు చంపబడ్డారు. ప్రాణాలతో దొరికిన కొందరిని ఢిల్లీకి బందీ లుగా తీసుకుని పోయారు. ఆయుద్ధం నుండి ప్రాణాలతో తప్పించు కున్న కొద్ది మందిలో వీరిరువురు అశ్వారాయుడు, ప్రోలుడు తమ గ్రామాలకు వచ్చి తమ కుటుంబాలతో సహా గోదావరి ఆవల వొడ్డు నున్న రేకపల్లిలో తలదాచుకున్నారు. ఇది క్రీ.శ. 1323 నాటి సంగతి.

**రేకపల్లి :–** ఈ రేకపల్లికి ఉత్తర, తూర్పు దిశల్లో పాపికొండలు విస్తరించి వున్నాయి. దక్షిణాన గోదావరి, పడమర శబరినది. వీటి మధ్య నున్నది రేకపల్లి. పాపికొండలు మధ్య వెళ్ళే గోదావరి రెండు కొండల మధ్యనున్న చిన్న ఇరుకైన సందు గుండా ప్రవహించటం వల్ల అక్కడ సుడులు తిరుగుతుంది. వానాకాలంలో ఆ ఇరుకు నుండి వరద మొత్తం వెళ్ళలేక వెనుకకు పోటు వేస్తుంది. పైన శబరి, పెద వాగు, ఇంకా పైన కిన్నెరసాని, తాలిపేర్ల వరద కలిసి, సముద్రమవు తుంది. మానవ మాత్రులెవరూ పాపి కొండల సందు, సుడులను దాటి దక్షిణానికి చేరలేరు. అట్లే ఉత్తరాన వున్న పెద్ద పర్వత శ్రేణులను దాటి రాలేరు. పడమర ప్రళయ భీకరంగా వచ్చే తాలిపేరు, శబరిని దాటటం అసాధ్యం. కనుక శత్రు దుర్భేధ్యమైనదీ రేకపల్లి. వానాకాలం నాలుగు నెలలు రేకపల్లికి ఇతర ప్రపంచంతో సంబంధం తెగిపోతుంది. ఇక ఆహార విషయాని కొస్తే ఆకులలములు, దుంపలు, పండ్లు-ఫలాలు, వేటాడితే మాంసం తప్ప తినటానికింకేమీ దొరకదు.. రోగాలు-రొచ్చులు సరేసరి. తూర్పు కొండల మీద సూర్యోదయం కాగేనే ఇక్కడ మాత్రమే సూర్యకిరణాలు, అంటే ఎండ పడుతుంది. మిగిలినదంతా సూర్యకిరణాలు చొరని దుర్భరారణ్యం, చుట్టూ అడవి, ఇక్కడ కొద్ది ప్రాంతం రాతినేల అవటం వల్ల చెట్లు లేక వెలుగు రేక పడుతుంది. అందువల్లనే దీనికి 'రేకపల్లి' అని పేరు పెట్టి వుండ వచ్చు,. మరికొందరు రావణుడు సీతను అపహరించుకుని పోతుంటే జటాయువు ఎదిరించాడని, రావణుని ఖడ్గపు దెబ్బకు రెక్క తెగిపడిం దని అందువల్ల దీన్ని రెక్కపల్లి అని అన్నారని అదే రేకపల్లి అయిందని రామాయణ పురాణ కథ వినిపిస్తారు. రావణుడు విమానం మీద తిన్నగా దక్షిణాన వున్న లంకవైపు వెళ్ళాలి గాని పర్ణశాల నుండి తూర్పుకు 100 మైళ్ళ దూరం ఎందుకు వెళ్ళినట్లు ? పాపికొండలు చూడటానికా? అని పరిహసించి, ఈ కథ నమ్మని వారికి, తెలవారే ముందే వచ్చిన వెలుగును తూర్పు రేకలన్నట్లు, ఈ ప్రాంతంలో మాత్రమే వెలుగురేకలు పడతాయి కాబట్టి రేకపల్లి అయిందని నేను మొదటే చెప్పిన దాన్ని ఆమోదించవచ్చు. ఇంతటి అరివీర భయంకర మైనది కనుకనే అశ్వారాయుడు, ప్రోలుడు, తమ రక్షణకీ ప్రాంతాన్ని ఎన్నుకున్నారు ఇక్కడ వీరు నిష్క్రియులై యుండ లేదు. అక్కడ వున్న ఆటవిక జాతి కోయలు. కోయందు అంటేనే ధనుర్ధారి అని అర్ధము.. వారిని చేరదీసి, వారి సహాయంతో చిన్ని కోట కట్టారు. ఆర్థిక సహాయా నికి అశ్వారాయుడు ఉండనే వున్నాడు. ఈ చిన్ని కోట స్థల, జల, గిరి, వన, దుర్గ లక్షణాలన్నింటిని కలగలిపి వున్నది. ప్రోలుడు తన తమ్ములు కాపయ, పోతయలు స్థానికులు గనుకను, కోయభాష తెలిసిన వారు కనుకను తేలికగా కోయవీరులను సమీకరించగలిగారు. వీరు గురితప్పని విలుకాండ్రు ఎప్పుడూ విల్లంబులు ధరించే వుంటారు. ఏ భాగంలో బాణం దిగినా, అడవిజంతువు కిలోమీటరు వరకు పరుగెత్తు తుందట. అందుకని బాణాన్ని దాని కాలిగిట్టకు కొడతారు. గిట్టకు దిగిన బాణంతో అది కదలలేక నిలబడుతుందట అంతటి గొప్ప విలుకాండ్లు కోయలు. ఆ అడవుల్లో ఇప్పటికీ అటువంటి విలుకాండ్లు వున్నారు. కాని కొండలు, ఆ అడవులను దాటిరారు- మన మైదాన ప్రాంతీయులను అస్సలు నమ్మరు. శతృవుల వలె చూస్తారు. వీరు ఒక అభిప్రాయానికి వస్తే ప్రాణం పోయినా ఆ నిర్ణయానికే కట్టుబడి వుంటారు. తమ రక్షణ కొరకు ఇటువంటి వీరులను మచ్చిక చేసుకుని సైనిక శిక్షణ నిచ్చారీ అన్నదమ్ములు.

వరంగల్‌ను జయించిన " ఉలుక్ఖాన్" మొత్తం ఆంధ్ర దేశ పాలనను తన చేతిలోనికి తీసికొన దలచి వరంగల్లు ప్రాంతమంతా తన అంకెకు వచ్చిన తరువాత మిగత ఆంధ్రప్రాంతం పై దృష్టి నిలి పాడు సైన్యాన్ని రెండు పడెలుగా విభజించి ఒక దాన్ని ఖమ్మం నుండి ఆగ్నేయంగా కొండపల్లి వైపు నడిపి మరొకపడెను తన నాయకత్వంలో ఖమ్మం నుండి తూర్పుగా బయలుదేరి దండు బాట నున్న కనకగిరి,

శంకర గిరులను స్వాధీనం చేసుకుని వ్యతిరేకులను ఏరివేస్తూ, విశ్వాస పాత్రులైన వారిని తగిన కేంద్రాలలో నియమిస్తూ, ఆసామంత రాజ్యాల లోని మండలాలు కల్లూరు, నీలాద్రి, తమ్మిలేటి ఒడ్డునున్న తుంబూరు, దమ్మపేట కోటలను దోచుకుని బ్రాహ్మల చంపి దేవాలయాలను కొల్లగొట్టి, కూల్చి, దండుబాటనే వున్న పోలయ, అశ్వారాయుల వూళ్ళు ముసునూరును పాలవరప్పాడును తగలబెట్టి ప్రస్తుతమున్న ఖమ్మం జిల్లా సరిహద్దు దాటి, పశ్చిమ గోదావరి ప్రాంతంలో ప్రవే శించి, కామ వరపుకోట, నిడదవోలులను పట్టుకుని, అచట తన వారిని నియమించి, రాజమండ్రిని చేరి, దానిని తన పాలనలోనికి తీసుకుని, అచట తన వారిని నియమించి, అచటనున్న పెద్ద దేవళాన్ని దోచి, కూల్చి దాని గోడలపై మసీదును కట్టిస్తాడు. క్రీ.శ. 1324న దాన్ని మసీదుగా మార్చినట్లు శాసనం వేయిస్తాడు. ఖమ్మం నుండి ఆగ్నేయంగా తరలిన సైన్య విభాగానికి కొండపల్లిలో తీవ్రప్రతిఘటన ఎదురైంది. ఆరునెలల పాటు ముట్టడించి దాన్ని స్వాధీనం చేసుకుని అక్కడున్న ప్రసిద్ధమైన దేవాలయాన్ని ధ్వసం చేసి దాని గోడలపై మసీదును గట్టి, గట్టి పరిపాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేసి కొండపల్లికి దక్షిణాన వున్న ఆంధ్ర ప్రాంతాన్నంతా స్వాధీనం చేసుకుని క్రీ.శ. 1324 నాటికి రాజమండ్రి చేరి మొదటి సైనిక విభాగంతో కలిసి ఒరిస్సా రాజును శిక్షంచ పయనమవుతాడు. 1324 నాటికి మొత్తం కాకతీయ సామ్రాజ్యం ఉలుగ్ ఖాన్ చేతికి వచ్చింది.

ఇంతలో ఢిల్లీ ఘియాసుద్దీన్ తుగ్లక్ మరణిస్తాడు. సహజంగా తలెత్తే వారసత్వ సమస్యలు, సామంతుల తిరుగుబాట్లుతో ఉలుగ్ ఖాన్, అతని సోదరులు, తలమునకలై ఆంధ్రదేశ పరిపాలనలో శ్రద్ధ చూపలేకపోయారు. దీన్ని ప్రోలయ చక్కగా వినిమోగించుకుని ముస్లిం లతో భంగపడి తమవలె అజ్ఞాతం వెళ్ళదీస్తున్న నాయకులతో రహస్య మంతనాలాడి, తిరుగుబాటుకు సమాయత్త పరచి, కాయప, పోతయ తనకు కుడి–ఎడమల, నిలువగా, తాము ముగ్గురూ తయారు చేసిన మెరికల లాంటి, గురితప్పని కోయ విలుకాండ్ర సైన్యంతో స్వాతంత్ర్య పరిక్షణకై కదలగా, ఇంతకుముందే తిరుగుబాటుకు అంగీకరించిన తమలాంటి మరికొందరు నాయకులు తమతో తరలిరాగా, ప్రజా వాహిని జయ, జయ ధ్వానాలతో స్వాగతించగా, అనతి కాలంలోనే క్రీ.శ. 1326నాటికే తూర్పు తీరం మొత్తాన్ని కైవశం చేసుకుని, పునః స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు ప్రోలయ. ఇలా ఆంధ్ర తీరానికి తిరుగు లేని నాయకుడయ్యాడు. తనకు రాజకీయ జీవితాన్ని ప్రసాదిం చిన ఆచిన్న ప్రభువు అశ్వారాయునికి గోదావరి దక్షిణ దిక్కు నుండి ఏలూరు వరకున్న విశాల భూభాగాన్ని కట్ట బెట్టి, తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు. తన చిన్న తమ్ముడు పోతయను తొయ్యేటి పాలకు నిగా నియమించాడు. మిగిలిన ప్రాంతాలకు తనకు అండగా నిలిచిన నాయకులను నిలిపాడు. అశ్వారాయుడు తనకొత్త సామంత రాజ్యానికి మధ్యస్థంగా వున్న శంకరగిరిని కేంద్రంగా చేసుకుని పరిపాలన సాగిం చాడు. తీరాంధ్రం తరువాత ప్రోలుని దృష్టి వరంగల్లుపై బడింది. కాని వరంగల్లును స్వాదీనం చేసుకునే వరకు ఆయనకు ఆయుర్దాయం చాలలేదో, లేదా ఈ మూడేండ్లు విశ్రాంతి, విరామ మెరుగని తీరాంధ్ర యుద్ధాలతో నిరంతరం నిమగ్నమవటం వల్ల గాయాలతో అలిసి అస్వస్థుడయ్యాడో తెలియదు గాని అన్న బాధ్యతను తాను వహించి వరంగల్లును స్వాధీనం చేసుకుని మొత్తం తెలుగుదేశాన్ని తన ఆధీనం లోనికి తెచ్చుకుని అన్న ఆశయాన్ని నెరవేర్చాడు. కాపయ. విజయ నగర రాజ్య స్ఫూర్తి దాత, ఒరంగల్ విజేత కాపయ. క్రీ.శ.1336న విజయనగర స్థాపన జరిగింది. కనుక అంతకుముందే కాపయ వరంగల్‌ను స్వాధీనం చేసుకుని ఉండవచ్చు..అప్పటికే స్వర్గస్తుడైన తన అన్నప్రోలయకు పుణ్యం సిద్ధించునట్లుగ, బుడమేరు ఒడ్డున నున్న గ్రామాన్ని తన అన్న పేరున, ప్రోలవరంగా మార్చి అగ్రహారంగా బ్రాహ్మణులకు దానమిచ్చాడు– అన్నకు తగిన తమ్ముడు కాపయ.

ఈ వీరసోదరుల నివాసమేది? వీరి పూర్వ చరిత్ర మనకంతగా తెలియదు– వీరికి సంబంధించిన రెండే రెండు శాసనాలు ఇప్పటికి దొరికాయి. అందువారి పూర్వ విషయాలేవీ పెద్దగా తెలియదు. హఠా త్తుగా తెలుగు స్వాతంత్ర్య తెరపై వెలిగినవారు. వీరు తాము ముసు నూరి వాళ్ళమని తెలిపినారు. ఈ ముసునూరెక్కడిది. అసలు ముసు నూళ్ళు ఎన్ని వున్నాయి? అందులో వీరి నివాసగ్రామమేది? అన్నదే తేలవలసిన సమస్య.

గౌరవనీయులు సోమశేఖర శర్మగారు, నూజివీడు దగ్గర ఒక ముసునూరు ఉన్నది, కావలి దగ్గర ఒక ముసునూరు వున్నది. ఈ రెండూళ్ళలో ఒకటి వీరి స్వగ్రామం కావచ్చు అంటూనే, కావలి దగ్గర ముసునూరే అయ్యుంటుందని అన్నారు. డాక్టరు పోలవరపు హైమవతి గారు కూడా వారి అభిప్రాయంతో ఏకీభవించారు. కాని ఈ దండకారణ్యంలోనే ఇక్కడేవున్న ముసునూరును గుర్తించ లేదు. సోమశేఖర శర్మగారీ సోదరులను గూర్చి తెలిపే నాటికి అంటే క్రీ.శ. 1944 నాటికి దక్షిణాన దూరంగా వున్న రెండు ముసునూళ్ళు మాత్రమే తెలిశాయి. అశ్వారాయని మండలంలో మరో ముసునూరుం దని గుర్తించలేదు. అప్పటికీ ప్రాంతం నర్రడవి మధ్యన ఉండటమో! ముసునూరు కొద్దిగా రూప భేదం చెందటమో! కారణం కావచ్చు. సంవత్సరంలో అధిక భాగం వానలు వరదలతో అన్నం కరువై, ఆకులలములు, గడ్డలు పండ్లు ఫలాలు తింటూ, రోగాలు రొచ్చులతో నుండే ఈ భయంకరా రాణ్యానికి, పల్లపు ప్రాంతాలలో రకరకాల పంటలు పండిస్తూ, తిండికి కరువులేక కడుపులో చల్ల కదలక హాయిగా నుండే చోటువదలి, ఇక్కడి కెవరైనా వస్తారా! చెప్పవలసి వస్తే ఇక్కడి వారే బ్రతుకుతెరువుకు అటువైపు వెళ్ళిన సంఘటనలు కోకొల్లలు...ప్రోలయ ఇక్కడికి వలస వచ్చినవాడు కాదు. ఇక్కడి స్థానికుడే. కనుకనే ఇక్కడి అరణ్యభూములు, ఆటవిక జనాలతో పరి చయమున్న వాడైనందుననే కొద్ది వ్యవధిలోనే కోయవీరుల కూడగట్టి సైన్యాన్ని తయారు చేయగలిగాడు మొత్తం తీరాంధ్ర దేశాన్ని జయించ గలిగాడు.

అయితే ఆముసునూరు ఎక్కడున్నది? మరెక్కడో కాదు అశ్వా రాయని మొదటి పాలిత మండల మైన పాలవరప్పాడుకు సమీపం లోనే ముష్టిబండ అను పేరుతో వుంది. అదే ముసునూరు? ముష్టి తెలుగుపదం– దీని పూర్వరూపం ముసిటి, ముసిడి, ముసిని వర్ణ సమీకరణం వల్ల ఆ తర్వాత ముష్టిగా మారింది. ముసిందురు.. ముసిణూరు..ముసినూరు..ఇది పరిణామ క్రమంలో రూప భేదాలు– (సూర్య రాయాంధ్ర నిఘంటువులో 700వ పేజి చుడండి) అట్లే ప్రతి ఆయుర్వేద గ్రంథంలో ముష్టిని..ముసిణి గానె వ్రాశారు.

ముసునూరు ముష్టి బండగా ఎలా మారింది? ప్రస్తుతమున్న ముష్టిబండ చెరువునకు తూర్పున ఉన్నది. సాధారణంగా చెరువు

ఊరుకు ఈశాన్య భాగాన వుంటుంది. కాని ఈ ముస్తిబండకు దక్షిణ భాగాన వుంది. దానికీ, కారణమున్నది..పాత ఊరు చెరువుకు పడమర నైరుతి భాగంలోనే ఎత్తైన దిబ్బల మీదే వుండేది. ఆనాడు దానిపేరు ముసునూరే– ఉలుగ్‌ఖాన్ తూర్పుకు వెళుతూ, దండుబాట ప్రక్కనే వున్న ముసునూరు ప్రోలయదని తెలుసుకుని దాన్ని కాల్చి బూడిద చేశాడు..చచ్చిన వారు చావగా మిగిలినవారు చెల్లా చెదురై నలుదిక్కులకు పారిపోయారు. అట్లే అశ్వారాయని ఊరు పాలవర ప్పాడు కూడా దండుబాట ప్రక్కనే కనుపించటంతో, దాన్ని బుగ్గి చేశారు. కాని మరికొద్ది కాలానికే రేకపల్లిలో స్థిరపడిన ప్రోలుడు క్రీ.శ. 1326 నాటికి తీరాంధ్ర దేశాన్ని స్వాధీనం చేసుకోవటంతో నలుదిక్కులకూ పోయిన ముసునూరి ప్రజలు తిరిగి వచ్చారు. కాని తగలబడిపోయిన చోట ఇళ్ళు కట్టుకోవటానికి ఇష్టపడక చెరువు ముందున్న తూర్పు మెట్టపై ఊరు కట్టుకున్నారు. 40 సంవత్సరాలు ప్రశాంతంగా గడిచిందో లేదో ముసునూరి కాపయ, అతని కుమా రుడు వినాయక దేవుడు చంపబడటంతో ఆంధ్ర రాజ్యం మరొక సారి పరాధీన మైంది. దానితో ఈ వూరి ప్రజలు భయపడి ముసు నూరు పేరు అచ్చిరాదు అని తలచి, శత్రువులు ముసునూరు పేరు వింటే మళ్ళీ తగలబెడతారనే భయంతో అప్పటికే ముసిణి –ముస్టిగా మార్పు చెందుతూ వుంది కనుక ముసునూరును ముస్టిమండగా మార్చారు. మండ –ప్రస్తుతం బండగా మారి ఇటీవల ముస్టిబండ అయింది. ఇన్ని మార్పులకు లోనవుట చేతనే పై చారిత్రకులు గుర్తించ లేక పోయారు.



ఏజన్సీలో ఇక్కడ గాక దండకారణ్యంలో ఇంత పెద్ద ముష్టి అరణ్యం ఇంకెక్కడా కానరాదు. కనుకనే దీనికి దగ్గరలోనే వున్న అశ్వారావు పేటలో ముష్టి విత్తుల ఫ్యాక్టరి ఏర్పాటు చేశారు. ముష్టి విత్తులతో పొడి, నూనె తీసి మందుల కంపెనీలకు, విదేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నారట. ఈ ముసునూరు (ప్రస్తుతం ముష్టి బండ) అత్యంత ప్రాచీనమైనది. ఆది మానవులు కొంచం తెలివిడి కలవారైయాక తాము నివసించే చోటును, తామీ అరణ్యంలో ఎటు వెళ్ళినా తేలికగా గుర్తుపట్టటానికో, ఏమో తెలియదు గాని, తామే జాతి చెట్లుగుంపు దగ్గరుంటే, తమనివాసాని కాపేరు పెట్టుకున్నారు. అలా ఏర్పడిందే ముసినూరు, ముస్నూరు అయింది. ఈ దండ కార ణ్యంలో ఏర్పడిన ఆదిమ జనవాసాల గుంపుల పేర్లన్నీ ఇలా చెట్ల గుంపుల పేర్లతోనే వున్నాయి చూడండి.

1. ఆరికాయలపాడు, 2. ఇల్లింద 3. ఉసిరికాయల పాడు 4. ఇప్పల చెలక 5. ఏపెలగడ్డ 6. కానుగుపాడు, 7. చిగురు మామిడి. 8. మూక మామిడి, 9. చింతూరు, 10. తాళ్లపెంట, 11. తాళ్ళూరు , 12. ఈదులగూడెం, 13. దంతెల బోరు, 14. టేకులపల్లి (ఈ పేరుతో మరో రెండూళ్ళున్నవి) 15. జీడిగుప్ప 16. బూరుగ్గూడెం, 17. బూర్గంపాడు, 18. బూరుగ్గంపు, 19. పాలకొయ్యగూడెం 20. రేలకాయల పాడు 21. తవిసిగుడెం 22. పూసుగ్గూడెం 23. బిల్లు(దు)పాడు 24. మద్ది మత్తిన గూడెం 25. గుంపెన 26. బెండాలపాడు 27. మండాల పాడు 28. కొమ్మేపల్లి 29. టేకులబోరు 30. తునికి పాడు 31. బందారు గూడెం ఇవన్నీ చెట్ల పేరున ఉన్న గ్రామాలే పైగా దండకారణ్యంలోని ఏజెన్సీ ప్రాంతం లోనివే. నా దృష్టి కొచ్చిననవి ఇంతవరకే.. రానివి ఇంకెన్నో ? ఈ పేర్లన్నీ గ్రామాల స్థాపన, ప్రాథమిక అవస్థను తెలియచేస్తున్నవి. కనుక ఈ దండకారణ్యం లోనిదే మొదటి ముసునూరు. తమ వూరును తగలబెట్టినపుడు తమకు దూరంగా వున్న నూజివీడు ప్రాంతానికి పారిపోయిన వారు మాత్రం తిరిగిరాక, అక్కడ శతృభయం లేదు కనుక చిన్న వూరును కట్టుకొని తమవెనుకటి ముసునూరు పేరును పెట్టుకుని వుండవచ్చు.. చెట్లగుంపుల పేరుతో దక్షిణాది పల్లపు ప్రాంతాల నున్న గ్రామాలు బూరుగ్గూడెం– తునికి పాడు, మొదలైన గ్రామాలు ఇక్కడ నుండి వలస పోయి నిర్మించుకున్నవే.

అశ్వారాయని పాలవరప్పాడును ఉలుగ్ ఖాన్ తగలబెట్టి వెళ్ళిన కొద్ది కాలానికే తమ ప్రభువు అశ్వారాయనికి మంచి రోజులు వచ్చినై. గోదావరికి దక్షిణ దిశ నుండి ఏలూరు వరకున్న విశాల భూ భాగానికి ప్రభువయ్యాడు. తమ సామంత రాజ్యానికి దాదాపు మధ్యలో వున్న శంకరగిరి దుర్గాన్ని కేంద్రంగా చేసుకుని పాలన సాగించటంతో ఉత్తరానికి పారిపోయిన పాలవరప్పాడు ప్రజలు శంకరగిరి సమీపం లోనే పాలవరప్పాడు అనే పేరును కొద్దిగా సవరించి, పాలవంచ అనే పేరుతో గ్రామాన్ని కట్టుకున్నారు. అట్లే దక్షిణానికి పారిపోయిన వారు చింతలపూడికి దగ్గరలో తమ్మిలేటి ఒడ్డున పాలవరం అనే పేరుతోనె , వూరు కట్టుకున్నారు. ఆ పాలవరం ప్రస్తుతం పోలవరం అయింది. తమ ప్రభువు అక్కడ లేని కారణాన కావచ్చు తగులబెట్ట బడిన పాలవరం పునఃనిర్మితం కాలేదు.

20 సంవత్సరాలైందనుకుంటాను–ఇప్పుడు సరిగా గుర్తుకు రావటం లేదు– ఈనాడు, వార్తా పత్రికలో ఈ పాలవరప్పాడును

గూర్చి వ్యాసం వచ్చింది. ఆనాడు నాకీ ఆలోచన లేదు– కనుకనే, నేను ఆ వ్యాసంలోని వివరాలు తెల్పలేక పోతున్నాను. కానీ గ్రామ శిధిలాలను కొన్ని నాణేలను సేకరించినట్లు గుర్తు.

కీర్తి శేషులు డా.కనకబండి మోహన్ రావు గారు చారిత్రకోపా న్యాసకులు, నేను వారితో కలసి, వారు చేయబోతున్న కాటంరాజు చరిత్రను గూర్చి తెలుసుకునేందుకు ఈ ముస్టిబండలోనే కురువృద్ధు డైన యాదవులు శ్రీ రాచూరి మల్లయ్య గారిని కలిశాము. అతడు పరం పరాగతంగా, తరతరాల నుండి చెప్పుకుంటూ వస్తున్న చారిత్రిక విశేషాలెన్నో తెలిపారు. మా పూర్వీకులంతా ఆయుధోపజీవులు అంటూ, పూర్వమెప్పుడో తగలబడి పోయిన తమ ఇండ్లలో మిగిలిన ఇనుపకత్తి పిడులు, బల్లెపు మొనలను చూపించి మా వాళ్ళు రాయ చూరు నుండి వచ్చారు కనుక మేము రాచూరు వాళ్ళమయ్యం. ఆనాడు పడమట నుండి తూర్పుకు దండు, ఈ బాటగుండానే వెళ్ళేది. అందుకని దీన్ని దండుబాట అని అన్నారు. దాన్నే ప్రభుత్వం రోడ్డుగా మార్చి బస్సులు నడుపుతున్నది. ఆనాడు ఈ బాట రెండుగా చీలి ఒకటి ఏలూరు, రెండవది రాజమండ్రి వరకు వుండేది. అలా వెళ్ళే దండులో మా పూర్వుడొకడు రోగగ్రస్తుడైతే, వాణ్ణి ఇక్కడే వదలి వెళ్లారట. అతడు తన కుటుంబంతో ఇక్కడే వున్నాడు. అప్పటి నుండి ఇప్పటి వరకు ఎన్ని తరాలైందో తెలువదు. ఇక్కడే వుంటూ వస్తున్నాం మా పూర్వుని రోగం ఈ నీటితో ఈ ముస్టివనం గాలితోనే, పోయిం దట. ఇప్పటికీ మా గ్రామస్తులు చర్మరోగాలు, అజీర్తిరోగాలు ఎరుగరు. ఆ రాయచూరు పడమట ఎక్కడుందో తెలియదు. అసలు మా యీ గ్రామం ఇక్కడుండేది గాదు. ఆ చెరువుకు పడమట వుండేది. అప్పుడెప్పుడో తురక దండు వచ్చి, మావూరును తగులబెట్టారట. మా వూరేగాక దండు బాట నున్న అనేక వూళ్ళను బుగ్గి చేశారట. అగ్గికి బుగ్గైన చోట ఉండలేక, తూర్పు మెరక మీద కట్టుకున్నారట. అప్పటి నుండి ఇక్కడే ఉంటున్నాం మొన్న మొన్నటి వరకు మా వూరును ముస్టిమండ అనే వారు. అది ఈ మధ్య ముస్టిబండగా మారింది. ఇప్పుడంతా ముస్టిబండ అంటున్నారు. నైజాం నవాబు కాలంలో వేసిన సిమెంటు స్థంభం మీద వేసిన బోర్డు ముస్టిమండ అనే వుండేది అసలు మా పాతూరు పేరు కూడా ఇది కాదట. ముసినూరో, ముసునూరోనట. మా పెద్దలు చెప్పేవారు అంటూ, కాటమరాజుపై పరిశోధనకు వచ్చిన కనకబండి మోహనరావు గారికి అటక మీదున్న శిధిల తాళపత్ర గ్రంథాల నుండి దుమ్ము దులిపి చెడకుండా వున్న తాళపత్ర గ్రంథాన్నిచ్చాడు. చిత్రమైన విషయ మేమంటే ఆ గ్రంథం మోహనరావుగారి పూర్వీకుడు కనకబండి గట్టయ్య, మా పూర్వ వంశీయుడు గంగుల పిన యల్లయ్య వ్రాసిన కాటమరాజు కథా చక్రమే. మా ఆనందానికి అంతు లేదు. దానిని తన డాక్టరేటుకు అవసరమైన మేర వాడుకుని, ఆ గ్రంథాన్ని హైదరాబాదు పురావస్తు శాఖకు అందచేశాడు.

ఆయనే మాకు మరో సంగతి తెల్పాడు. మాలాగే అనాది నుండి వుంటున్న కుటుంబం గండ్రోతు వాళ్ళు, తెలగాలు. వెనుకటి రోజుల్లో ఈ వూరు పెత్తందార్లు వారేనట. తురక దండు వస్తున్న సంగతి ముందే పసిగట్టి, గండ్రోతు కుటుంబపు పోలయ్య, కాపయ్య, పోతయ్యలు తమ పిల్లా జెల్లా, ముసలీ ముతకతో సహా ఉత్తర దిశకు పారిపోయారట..ముసలోళ్ళకు మన్నె జ్వరం వస్తే వాళ్ళ నక్కడే వదలి వాళ్ళ రక్షణకు మరికొందరి నక్కడే వుంచి తాము గోదారి దాటి రేకపల్లి చేరారట..కాలం కుదుట పడటంతో మధ్యలో ఆగిపోయిన వాళ్ళు తిరిగి ఇక్కడికే వచ్చారు కాని, రేకపల్లి వెళ్ళిన వారు రాలేదట. అయ్యా మా కాలంలో ఈ ఉరుకులు పరుగు లెక్కడివి, వ్యవసాయం పనులైపోతే, తీరికగా వుండి ముసలోళ్ళ దగ్గర చేరి, కథలు కథలుగా వాళ్ళు చెప్పే పూర్వ సంగతులు తెలుసుకునే వాళ్ళం. ఇప్పుడు మీరడిగారు కాబట్టి ఆనందంగా నాకు తెలిసినవి చెపుతున్నాను. ఇప్పటి పిల్లలకు ఆ ఆసక్తేలేదు అంటూ ముగించాడు. అక్కడి నుండి గండ్రోతు కుటుంబపు వృద్ధులు శ్రీ గండ్రోతు నర్సయ్యగారిని కలిశాము. ఈయన గారు చెప్పిన విషయాలనే ఆయనా ధృవీక రించారు. మా ఇంటి పేరు మొదట గండ్రట అనితెలిపారు. మరి మీ వాళ్ళెవరికీ మీ పూర్వుల పేర్లు ఎందుకు పెట్టలేదని అడిగాను. పోలయ్య, కాపయ్య, పోతయ్యలు వీళ్ళు మా పూర్వులే అయినా, ఆపేర్లు మా కుటుంబానికి అచ్చి రాలేదట. ఆ పేర్లు పెట్టుకున్న వాళ్ళు చనిపోయారట. అందుకని వాటి జోలికి పోరు మా వాళ్ళు అన్నారు.

అంటే పోలయ్య, కాపయ్య వీళ్ళు ఆకస్మాత్తుగ, అప్పటి కప్పుడు వీరులుగా తయారైన వాళ్ళు కారు. వీళ్ళ కుటుంబమే వీరకుటుంబం. వీరి పూర్వులెవరో గండర గండడై యుంటాడు– అతని పేర ఈ కుటుంబానికి 'గండర' అని పేరొచ్చింది. అదే గండ్రగా మారింది. పొగరుబోతు, మగర బోతులాగ గండ్రబోతై ప్రస్తుతం గండ్రోతుగా స్థిరపడ్డదని తేలికగా ఊహించవచ్చు. ముసునూరి నుండి వెళ్ళిన వారు గనుక ప్రోలయ, కాపయ్య ముసునూరి వారయ్యారు ఈ వీరకుటుంబీకులీవూరు వారైనా ఆ వీరవరుల పేర్లు పెట్టుకుంటే శత్రువులు చంపుతారని భయంతో, వారిపై గౌరవం భక్తీ వున్నా, ఆ పేర్లు జోలికి పోలేదనుకుంటాను ఆ పేర్లున్న వాళ్ళను శత్రువులు చంపివుంటారు. శత్రుశేషం, ఋణ శేషం వుండకూడదంటారుగదా! అలా అతి ప్రాచీనమైన ఈ ఇరుకుటుంబాలు మొత్తం కలిసి చెప్పేది ఒక్కటే. ముస్టిబండ మొదట ముస్టిమండ అంతకు పూర్వపు పాతూరు పేరు ముసునూరు. ప్రోలయ, కాపయ, పోతయలు ఇక్కడేపుట్టి ఇక్కడే పెరిగిన తెలగ కాపులు. వీరు మువ్వురు రేకపల్లికి వెళ్ళిన తరువాత ముసునూరి వారయ్యారు. పోతయ్య తోయేటి ప్రభువయ్యాక తొయ్యేటి వారయ్యారు. సోమశేఖరశర్మగారూహించినట్లు ఈ మువ్వురు సోద రులు దక్షిణాదికి చెందిన ముసునూరు వారు కాదు– ఇక్కడి ఈ దండకారణ్యంలోని ముసునూరి వారే. దక్షిణాన వున్న ముసునూర్లు ఇక్కడి ఈ ముసునూరి పేరుతో తరువాత వెలసినవే. పై చారిత్రకులు ఇద్దరూ తెలిపినట్లు ఈ ముప్వురు సోదరులు కాపులే, గాని కమ్మ కాపులు గాదు.. తెలగ కాపులు. అంత ప్రాచీన కాలంలో మైదాన ప్రాంతం నుండి అక్కడి కమ్మకాపులు అత్యంత ప్రమాదకరమైన, భయంకరమైన, దుర్భరారణ్యానికి వచ్చే అవకాశమే లేదు – కాని ఈ అరవై ఏండ్లలో అడవులు తరిగి వ్యవసాయ భూములు పెరిగి చౌక ధరకు దొరకటంతో దక్షిణాది కమ్మ– కాపుల వలసలు పెరిగినవి.

నా నిర్ణయమే చివరిదని భావించను. ప్రతి అభిప్రాయానికి మార్పు, చేర్పుల కవకాశ ముంటుంది. ఔ, గాములు, చారిత్రక పండితులు నిర్ణయింతురుగాక, అంతవరకు నే తెలిపిన సంగతిని, తాత్కాలికముగ అంగీకరింతము. ❃

పుస్తక సమీక్షలు

# లోహశాస్త్ర నైపుణ్యానికి గీటురాయి- ఢిల్లీ ఇనుపస్తంభం కథ- గ్రంథం

కాన్పూరులో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కాన్పూరులో లోహ శాస్త్ర ఆచార్యునిగా పనిచేసిన ప్రొఫెసర్ ఆర్.బాలసుబ్రమణ్యం- 'Story of the Delhi Iron Pillar' అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు. తెలంగాణాలో ప్రాచీన ఇనుము-ఉక్కు పరిశ్రమలను గురించి అంత శ్రద్ధతో పనిచేస్తుండిన చరిత్రకారుడు డా॥ పెరుంబు దూరు జైకిషన్ ఈ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు.

డా॥ఈమని శివనాగిరెడ్డి ఈ గ్రంథానికి ముందుమాట వ్రాస్తూ, క్రీ.శ.4వ శతాబ్దిలో తయారైన దేశీ ఇనుపస్తంభం ఇప్పటికి 16 శతాబ్దాలైనా తుప్పు పట్టకుండా వున్న వైనం-నాటి భారతీయ కమ్మర్ల దేశీయ సాంకేతిక పరిజ్ఞానానికి అద్దం పడుతుందని, ఆర్.బాలసుబ్ర మణ్యం ఢిల్లీ స్తంభం పరిశోధన ద్వారా అటు పురావస్తు, పురాతత్వ, పురాఖగోళ, పురాసాంకేతిక శాస్త్రజ్ఞులకు మార్గదర్శిగా చరిత్రలో నిలిచిపోతారన్నారు. ఈ ఆంగ్ల పుస్తకాన్ని తెలుగులోనికి అనువదించిన డా॥పెరుంబుదూరు జైకిషన్-తెలంగాణాలో ఊరూరా తిరిగి జీతం డబ్బుల్ని పరిశోధనలకు ఖర్చు చేసి కొన్ని వందల, ఇనుప స్థావరాలను కనుగొని తెలంగాణా ఇనుప లోహశాస్త్ర చరిత్రను అమెరికా, బ్రిటన్, జపాన్ లాంటి దేశాల్లో పరిశోధక పత్రాలు సమర్పించి తెలంగాణాకు వన్నె తెచ్చిన పరిశోధకుడు.

ఢిల్లీలోని ఇనుపస్తంభ నిర్మాణం భారతీయలోహ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానానికి ఒక నిదర్శనం. దీనిలో ఇనుమును వేడి చేసి, సాగతీసి అతికించే పద్ధతిలో చేసిన కమ్మరి వారి ప్రతిభను చూడవచ్చునని గ్రంథ రచయిత వివరించారు. ప్రముఖ పురాతత్వవేత్త పెర్గ్యూసన్ ఈ ఇనుప స్తంభాన్ని గురించి వ్రాస్తూ 400 (నాలుగు వందల సంవత్సరాలు) అనే ఒక వాస్తవకాలం, మనం చూసినది ఎవరూ చేయలేనిది, నమ్మతగిన అద్భుతాన్ని హిందువులు సాధించారని వ్రాశారు. ఇట్లాంటిది ఐరోపావారికి ఇప్పటికీ, ఎప్పటికీ సాధ్యం కానిది. గాలివానలకు తట్టుకొని 15 శతాబ్దాలుగా తుప్పు పట్టకుండా వుండటమే కాకుండా దానిపై వున్న శాసనం కూడా చక్కగా కన్పిం చడం చూస్తే వారి లోహనైపుణ్యం మనకు కనుపిస్తుందని వర్ణించారు.

బ్రిటీషు ఇంజనీర్లు ఇనుపస్తంభం గురించి వర్ణిస్తూ, ప్రాచీన భారతీయుల లోహపు పనితనానికి ఐరోపావాసులు ఏమాత్రం సరి తూగలేరు అని వర్ణించారు. ఈ ఇనుపస్తంభం భారతీయ కమ్మరుల పనితనానికి మచ్చుతునక. ఇనుపస్తంభం తుప్పుపట్టకుండా వుండ టానికి ఉపయోగించిన ఇనుములో భాస్వరం ఎక్కువగా కలిగి వుండ టమే కారణమని వివరించారు. అలనాటి ఢిల్లీ ఇనుపస్తంభం భారత దేశపు లోహ వారసత్వ సంపదకు గర్వకారణమని రచయిత ప్రశం సించారు. ఢిల్లీ నగరంలో వున్న ఒక మసీదు ఆవరణలో వున్న ఇనుపస్తంభం ఇక్కడిది కాదు. ఇది గుప్తులకాలానికి చెందినదని గ్రంథ రచయిత ధృవీకరించారు. రచయిత గుప్తుల కాలంనాటి వివిధ రూపాల నాణాలు, వివిధ రకాల లోహాలు, లిపి, భాష, ఆయారాజుల పేర్లు, వారి పరిపాలనా కాలం, ఆనాటి ఆచారాలు, సాంప్రదాయాలు, రాజుల బిరుదులు- తెలియ జేస్తాయని ప్రస్తావించారు. ఇనుపస్తంభ శాసనకాలంలో పేర్కొనబడిన చంద్రరాజు -గుప్త చక్రవర్తి రెండవ




చంద్రగుప్తుడు అని లభించిన ఆధారాలు ధృవపరుస్తున్నాయి. (క్రీ.శ.320- 600). ఈ ఇనుపస్తంభం స్థాపించబడిన ప్రదేశం- విష్ణుపాదగిరి అని రచయిత పేర్కొన్నారు. ఈ ప్రదేశాన్ని గుర్తించటంతో పాటు ఈ ప్రదేశానికి ఖగోళశాస్త్రపరంగా వున్న ప్రాముఖ్యాన్ని రచయిత ఆధారాలతో వివరించారు. ఢిల్లీకి 130 కి.మీ.దూరంలో వున్న మధుర ప్రాంతం విష్ణుపాదగిరి అని రచయిత పేర్కొన్నారు. మరో చరిత్రకారుడు డా॥మిరాశి విష్ణుపాదగిరి ఉదయగిరి అని నిర్ధారణ చేసి - ఢిల్లీ ఇనుపస్తంభం ఇక్కడిదేనని తేల్చి చెప్పినారు. విష్ణుపాదగిరిగా పిలువవడిన ఉదయగిరి సరిగ్గా 23.5 డిగ్రీల మకరరేఖ (అక్షాంశరేఖ) స్థితమై వుంది. గుప్తులకాలం లోనే క్రీ.శ. 400లో దీని ప్రాముఖ్యాన్ని తెలుసుకున్నారని రచయిత పేర్కొన్నారు. వేసవి ఆయనం అంటే జూన్ నెల 21వ తేదీన ఈ ఇనుపస్తంభం నీడ 13వ గుహలో వున్న అనంతశయన మూర్తి పాదాలపై పడేట్లు సరిగ్గా ఏర్పాటు చేశారని రచయిత పేర్కొన్నారు. ఉదయగిరిలో గుహలకు మార్గం నిర్మించిన శిల్పులు ఈ ఖగోళ విన్యాసం జరిగే రీతిగా నిర్మించడం కనుపిస్తుంది. ఢిల్లీ ఇనుపస్తంభాన్ని ఇల్టుమస్ అనే ముస్లిం రాజు అనేక దండయాత్రలు చేసి ఢిల్లీ సుల్తానేట్ విస్తరణలో- ఇనుప స్తంభాన్ని ఢిల్లీకి తరలించినట్లు ఆధారాలు ఉన్నాయని రచయిత వివరించారు. ఇనుపస్తంభాన్ని మసీదు ఆవరణలో నిలిపినారు. దీనిని లాల్‌కోటగా పిలిచేవారు.

గ్రంథం చివర్లో రచయిత ప్రస్తావిస్తూ "ఆనాటి పరిజ్ఞానం వల్ల పర్యావరణానికి ఎలాంటి ముప్పు కలగలేద"ని వ్రాశారు. ఈనాటి సమాజానికి ఈ విషయాలు కనువిప్పు కలిగిస్తుందని రచయిత చెప్పారు. "ప్రాచీన కాలపు ఇనుమును తయారు చేసుకోగలిగితే, నష్టాలను పూడ్చుకోవడమే గాక, కొంతైనా కాలుష్యాన్ని నిరోధించ గలం' అనే గ్రంథకర్త మాటలు ఎంతో విలువైనవి. ఇనుము తుప్పు నిరోధానికి లోహంలో వున్న భాస్వరం తోడ్పడే విషయాన్ని ఈనాటి విజ్ఞానులు అర్థం చేసుకొని ఆచరణలో పెట్టాలి. గ్రంథ రచయిత బాలసుబ్రమణ్యం భాస్వరం కలిగిన ఇనుమును ప్రయోగశాలలో తయారుచేసి చూపించారు. అంతేకాదు, ప్రస్తుతం భిలాయి ఉక్కు కర్మాగారంలో భాస్వరం కలిగిన ఇనుమును తయారుచేసి భారత రైల్వేశాఖకు దానిని అందించడం జరుగుతున్నది. ఇది నిజంగా ఒక అద్భుత విజయమని గ్రంథ రచయిత ఆర్.బాలసుబ్రమణ్యం అభి ప్రాయపడినారు. ఈ గ్రంథం ఆనాటి సాంకేతిక విద్యను తెలియజేసే గొప్ప గ్రంథం-చరిత్ర అంటే విజ్ఞానదాయకమైన శాస్త్రమని అందరూ గుర్తించేవిధంగా రచయిత కలం నుండి వెలుగులోకి వచ్చిన, ప్రతి ఒక్కరూ చదవదగిన గ్రంథమిది.

**ఢిల్లీ ఇనుపస్తంభం కథ** (Story of the Delhi Iron Pillar), ఆంగ్లమూలం : ఆచార్య ఆర్.బాలసుబ్రమణ్యం, తెనుగుసేత: డా॥పెరుంబుదూర్ జైకిషన్, ప్రచురణ : దక్కన్ ఆర్కియోలాజికల్ అండ్ కల్చరల్ రీసెర్చ్ సెంటర్, ఇం.నెం.16-11-20/1/9, సలీం కాలనీ, ప్లాట్ నెం.502, పద్మావతి రెసిడెన్సీ, మలక్‌పేట, హైదరాబాద్-500059, వెల : రు.100లు.

**-డా॥జి.వెంకటేశ్వరరావు,** 94914 75496

## పుస్తక సమీక్షలు

# అమరావతి కథ




"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు" అని రాయప్రోయి సుబ్బారావు గారు ఒకనాటి అమరావతి వైశిష్ట్యాన్ని స్తుతించారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌కు కొత్త రాజధానిగా 'అమరావతి' పేరును పెట్టటంతో అమరావతి మళ్లీ ప్రచారంలోనికి వచ్చింది. అమరావతి చరిత్రను, వైభవాన్ని ఒక్కసారి మళ్లీ తలచుకొంటున్నారు. ఈ అంశంలో భాగంగానే డా॥వావిలాల సుబ్బారావు గారు మన అమరావతి కైఫియతు అనే పేరుతో ఒక మంచి గ్రంథాన్ని రచించారు. కైఫీయతులు స్థానిక చరిత్రను వెల్లడిస్తాయి. అలాగే అమరావతికి సంబంధించిన అనేక విషయాల్ని వావిలాల వారు ఈ గ్రంథంలో పొందుపరిచారు. అమరావతితో దశాబ్దాల అనుబంధం ఉన్న వావిలాలవారు ఈ గ్రంథాన్ని రచించటంతో బంగారానికి పరిమళం అబ్బినట్లుంది.

'మన అమరావతి కైఫియతు' అనే ఈ గ్రంథాన్ని శీర్షికలుగా విభజించి ఒకమంచి ప్రణాళికను సిద్ధంచేసుకొని రచనను సాగించిన వావిలాలవారి ప్రతిభ ప్రశంసనీయంగా ఉంది. వావిలాల వారు ఎంతో వినయంగా ఇది ఒక 'కాకిగూడు' అని చెప్పినా, గిజిగాని గూడుగా అల్లినట్లు చెప్పవచ్చు. ఎవరిని ఉద్దేశించి ఈ గ్రంథాన్ని రచించారో స్పష్టంగా చెప్పారు. "ఇది పండితుల గ్రంథం కాదు. అమరావతిని ఇంతలాగా పొగుడుతున్నారు ఎందుకుట!" అనుకునే సామాన్య మధ్యస్థాయి పాఠకులకోసం.... కంప్యూటర్లు, ఘనధన విజయాలు, సినిమాలు, క్రికెట్ తప్ప మరొకవైపు తలతిప్పి చూడరేమో నన్న సందేహం కలిగించే రాబోయే తరంకోసం...... ప్రామాణిక చరిత్ర కారులు వ్రాసిన అంశాలనే ఏరుకొచ్చి ఈ గూడు కట్టాను. స్వంత పరిశోధన ఏమీలేదు" అని చెప్పినా విషయం ఎక్కడ నుంచి గ్రహించాలో ఎలా గ్రహించాలో, గ్రహించిన విషయాన్ని ఎలా పొందు పరచాలో తెలిసిన ప్రతిభావంతులు శ్రీవావిలాల వారు.

అమరావతి చరిత్ర నాతో సంభాషించిన తీరే "ఈ అమరావతి కైఫియతు" అని చెప్పటం ద్వారా రచయిత విన్నవి, కన్నవి, అనుభవం లోనికి వచ్చినవి, అవగాహన చేసుకొన్నవి అయిన విషయాలు ఈ గ్రంథంలో ఉన్నాయని గ్రహించవచ్చు. ఎప్పటి సంగతులో అని ఆంధ్రజాతి చరిత్రను ఒకచోట చేర్చారు. ఆంధ్రవిష్ణువును గూర్చి చెబుతూ "ప్రపంచంలో మరెక్కడైనా ఇట్లా జాతి మూల పురుషునికి గుడికట్టారా! లేదేమో! అంత కృతజ్ఞతాసంస్కారం గల ఏకైక జాతిమనది" అని ఆంధ్ర జాతి ఔన్నత్యాన్ని మెచ్చుకొన్నారు. ధాన్యకటకానికి ఉన్న పేర్లను గూర్చి చెప్పి బుద్ధుని కాలంనుంచే ఆంధ్రదేశం ప్రసిద్ధి చెందిందని వివరించారు. ఆయా రాజులు పరి పాలించిన తీరును వివరించారు. ఆంధ్రరాజులైన శాత వాహనుల చరిత్రను చక్కగా పొందుపరిచారు. ధాన్య కటకం నగరంచుట్టూ ఉన్న ప్రదేశాల ప్రాచీనతను వివ రించారు. గౌతమీ బాలశ్రీ నేతృత్వంలో నూతన శకోదయం ప్రారంభ మైనట్లు చెప్పారు. ఆచార్య నాగార్జునుడు ఆంధ్రదేశం వచ్చిన విష యంలో వాస్తవమున్నట్లు తెలిపారు. ఆయన బోధనల సారాన్ని పొందు పరిచారు. శాతవాహనుల పాలన, ప్రజల జీవితాన్ని తెలిపి మన సంస్కృతి, సముద్రాల్ని దాటిన తీరును వెల్లడించారు. ఇంకా ఇక్ష్వా కులు, పల్లవులు, విష్ణుకుండినులు ఆంధ్రప్రాంత పాలకు లుగా ఉన్న తీరును వివరించారు. హ్యూయాన్‌సాంగ్ ధాన్యకటకాన్ని గూర్చి చెప్పిన విశేషాల్ని రచయిత ఈ గ్రంథంలో చెప్పారు. కోటరాజులు, కొండవీటి పాలకులు శ్రీనాధుని సంగతులు, రాయల వారి రాక, అమరేశ్వరా లయ వికాసం, మూలవిరాట్టు, ఆలయ నిర్మాణదశలు ఈ గ్రంథంలో ఉన్నాయి. అనుబంధంగా ఇచ్చిన 'నాగార్జునుని సూక్తు'లకు తెలుగు అనువాదం ఎంతో ఉపయుక్తంగా ఉంది.

రచయిత శ్రీనాధుని గురించి చెప్పేటప్పుడు "గొద్దేరు"ను గొద్దు- ఎద్దు ఏరు-వాగు; ఎద్దు వాగు అని చెబుతూ అదే 'గొద్దేరు' అనుకుం టాను అన్నారు. కాని ఎద్దువాగు అనే అర్థం ఇక్కడ పొసగదనిపిస్తుంది 'గొద్దేరు' అంటే గుత్తకు తీసుకోవటం, వ్యర్థం అనే అర్థాలున్నాయి. బొద్దు పల్లెను గుత్తకు తీసుకొని మోసపోయాను అనేది శ్రీనాధుని భావం కాబట్టి రచయిత చెప్పిన అర్థం ఇక్కడ పొసగదనిపిస్తుంది. ఏది ఏమైనా ఒక మంచి పుస్తకాన్ని తెలుగు పాఠకులకు అందించిన వావిలాల వారి కృషి అభినందించదగింది.

మన అమరావతి కైఫియతు- రచన-డా॥వావిలాల సుబ్బారావు, ప్రథమ ముద్రణ మే 2016, ప్రతులకు : విశాలాంధ్ర, నవచేతన బుక్ హౌస్ వారి బ్రాంచీలు. వెల-125/-.

-డా॥గుమ్మా సాంబశివరావు

---

# తెలుగు సాహిత్యంలో నూతన ప్రయోగం 'డిటెన్యూ డైరీ'



బందిపోటు దొంగలా కాక, కన్నం దొంగలా దేశరాజకీయ జీవితంలోకి రాత్రికి రాత్రి దూరి వచ్చింది ఎమర్జెన్సీ. అలా 1975, జులై 25 అర్థరాత్రి ప్రారంభమై 19 నెలలపాటు చిమ్మచీకట్లు ప్రసరించింది. స్వేచ్ఛకు సంకెళ్ళు, కలాలకు కళ్లాలు, భావాలకు బంధాలు వేసింది. దేశం ఒక రాజకీయ స్మశానమైంది. రాజకీయ నాయకులే కాదు, రచయితలు, కవులు, భావుకులు, పత్రికా రచయితలు ఎందరో కారాగారాల పాలయ్యారు.

అలా అరెస్టయిన విప్లవ రచయితల సంఘం సభ్యులు 40 మందిలో, వ్యవస్థాపక కార్యదర్శి, కవి, సాహిత్య విమర్శకుడూ, ఆలోచనాపరుడు కె.వి.ఆర్.కూడా ఒకరు. 1975 జూన్, 26 నుండి 1977 మార్చి, 23 వరకు, 19 నెలలు జైలు జీవితం గడిపారు. ఆ సమయంలో ఆయన దినచర్యను గ్రంథస్థం చేయగా ఈ 'డిటెన్యూ డైరీ' తయారైంది. ఇది తెలుగు సాహిత్యంలో ఒక నూతన ప్రయోగం.

ఇందులో కె.వి.ఆర్.కేవలం దైనందిన చర్యలను మాత్రమే రికార్డు చేయలేదు. అలా మాత్రమే చేసి వుంటే ఈ పుస్తకం గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసింది

ఏమీ ఉండదు. జైలులో వున్న కాలంలో ఆయన చేపట్టిన బహుముఖీన కార్యకలాపాలు అందరికీ ఆసక్తిదాయకంగా వుంటాయి. దాదాపు మూడు పదుల పుస్తకాలు చదివి నోట్సు తీసుకోవడం, అనువాదాలు చేయడం, లిఖిత పత్రికను నడపటం, స్వయంగా సాహిత్య సృజన చేయటం, వైవిధ్యభరితమైన ఆయన జైలు జీవితంలో ఒక కోణం మాత్రమే.

తాను నిర్బంధంలో వుంటూ కూడా సంస్థాగత పనుల నిర్వహణ పట్ల ఆయన చూపించిన శ్రద్ధ, తోటి డిటెన్యూల మనో నిబ్బరాన్ని కాపాడడానికి ఆయన చేసిన ప్రయత్నాలు సంస్థ పట్ల ఆయన నిమగ్నతకు అద్దం పడతాయి. అదే విధంగా లబ్ధప్రతిష్టులైన శ్రీశ్రీ, రా.వి. శాస్త్రి వంటి విరసం ప్రముఖులు దారి తప్పి రాజీపడి ప్రభుత్వానికి అండర్‌టేకింగ్‌లు యిచ్చిన సందర్భంలో వాళ్ళను సరిదిద్దటానికి జైలు నుండి ఆయన రాసిన ఉత్తరాలు రాజకీయ చైతన్యంతో తొణికిసలాడుతున్నాయి.

రాజ్యం లోపలి రాజ్యంగా వున్న జైళ్ళలో ఆధిపత్యం, నిరంకుశత్వం, ఏ చట్టాన్నీ ఖాతరు చేయని అధికార యంత్రాంగం చర్యలు వంటి వాటితోపాటు నేరస్తులను సంస్కరించటానికి ఉద్దేశించబడ్డ కారాగారాలు ఎంత అమానుషంగా ఖైదీల జీవితాలను చీకటిమయం చేస్తాయో ఆయన వివరించారు. ఏ వ్యక్తికైనా, ముఖ్యంగా రాజకీయ, సామాజిక ఆచరణలో వున్న వ్యక్తులకు జైలు నిర్బంధం ఒక అగ్నిపరీక్ష లాంటిది. కొద్దిపాటి జైలు జీవిత కష్టాలకు కూడా నీరుగారిపోయి విడుదల కోసం చకోర పక్షుల్లాగా ఎదురుచూపులు చూసిన కొందరు పెద్దల వైనాన్ని రికార్డు చేశారు.

ఈ పుస్తకానికి అనుబంధంగా రెండు కోర్టు ప్రకటనలున్నాయి. అందులో ఒకటి 'నయా ఫాసిజంకు వ్యతిరేకంగా నిరసన (protest against new Fascism) ఇది 23-02-1976న ఆయన కోర్టుకు సమర్పించిన ప్రకటన. 20 పేజీలున్న ఈ ప్రకటన ఒక గొప్ప రాజకీయ డాక్యుమెంటు. నానాటికీ తీవ్రమవుతున్న పీడన, ప్రజల్ని కమ్యూనిజం వైపుకు నెడుతుంటే పాలకవర్గాలు ఫాసిజం వైపుగా మారడం, భారత రాజ్యాంగానికి వున్న వర్గ స్వభావం పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు నేతిబీరకాయతత్వం, సమాఖ్య స్వభావానికి కేంద్రం తూట్లు పొడవటం, గుత్తపెట్టుబడిదారీ పత్రికలు పాలకవర్గాల బాకాలుగా మారటం, ప్రజలకుండే 'విప్లవించే' ప్రజాస్వామ్య హక్కు చరిత్ర వంటి అంశాలన్నింటినీ ఈ కోర్టు ప్రకటనలో ఆయన వివరించారు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే "ఈ డైరీ జైల్లో నా బహిరంతర జీవితాలకు నిశిత సాక్ష్యపత్రం'. ఆ జీవితంలో ఆయన చదివిన పుస్తకాల నుండి తీసుకున్న నోట్సు, అనేకానేక రాజకీయ, సామాజిక, సాహిత్య సంబంధమైన అంశాలపై వైవిధ్యభరితమైన విలువైన సమాచారాన్ని మనకు అందిస్తుంది. సామాజిక చైతన్యం గల ప్రతి ఒక్కరూ చదవాల్సిన యీ 'డిటెన్యూడైరీ' మొదట 1977లో ఝంఝు ప్రచురణ గాను, ప్రస్తుతం 2016లో కె.వి.ఆర్.శారదాంబ స్మారక కమిటీ ప్రచురణగాను అచ్చయింది.

పుటలు : 350, వెల : రు.170లు. ప్రతులకు : డా॥ఎస్. రామకృష్ణ, శాంతి నర్సింగ్‌హోమ్, నిర్మలా కాన్వెంట్ ఎదురు, పటమట, విజయవాడ-520 010. సెల్ : 98490 83137

**-యోగి**

---

## 'కారుచీకట్లో కాంతిరేఖ' సి.వి.




సాధారణంగా ఒక రచయిత రచనలతో సంకలనాలు వస్తాయి. అందుకు భిన్నంగా, జనసాహితి సి.వి రచనలు కొన్నిటినీ, ఆయిన రచనలపై వివిధ సమయాల్లో, 'ప్రజాసాహితి'లో అచ్చయిన కొన్ని రచనలను కలిపి, "ప్రజాసాహితిలో సమరశీల కలం యోధులు" అనే సంకలనం తీసుకురావటం విశేషం!

1950-80 దశకాల మధ్య కాలంలో తెలుగునాట సామాజిక, సాహిత్యోద్యమాలతో పరిచయం వున్న ఎవ్వరికైనా, చిరపరిచితుడు సి.వి. ఆయన సి.వి. చిత్తజల్లు సి. వరహాలరావు, సి. విజయలక్ష్మి అనే పేర్లతో విశేషమైన సాహిత్యకృషి చేశారు. ఝరీ ప్రవాహంలాగా సాగిపోయే ఆయన కవిత్వంలో, తలమునకలు కావటం, ఏకబిగిన చదవటం, చైతన్యాన్ని పొందడం ఒక గొప్ప అనుభవం. ఎంతటి సంక్లిష్టమైన భావాన్నైనా, తాత్విక సిద్ధాంతాన్నైనా, చారిత్రక ఘటనలు అయినా సరళంగా సూటిగా, స్పష్టంగా, దానిలోని జీవధాతువుకు భంగం కలుగనిరీతిలో పాఠకులకు అందించగలగటం ఆయినశైలి!

ఆయన రచనలు, వైవిధ్యభరితమైనవి. పురాణాలలో రంకులు, బొంకులు, మతదురాచారాలు, బ్రాహ్మణీయ ఆధిపత్యం, నాలుగు పడగల హైందవ నాగరాజు గుసగుసలు, మతం పేరిట జరిగిన మారణహోమాలు, భూస్వామ్య సంస్కృతిలోని అమానవీయ అందాలకు మాత్రమే సి.వి. పరిమితం కాలేదు. ఆయన కేవలం హేతువాది, నిరీశ్వరవాది, మానవతావాది మాత్రమేకాదు. వాటన్నింటికన్నా, విస్తృతమైన, శాస్త్రీయమైన, గతితార్కిక భౌతికవాద చారిత్రక దృక్పథాన్ని లోతుగా అధ్యయనం చేసిన, అర్థం చేసుకున్న కమ్యూనిస్టు ఆయన, ఆ దృష్టి కోణంలోనే, ఆయన కావ్యవస్తువుల పరిశీలన అంతాసాగింది. ఆయనది చాలా లోతైన పరిశీలనాదృష్టి. ఏ అందాన్ని తీసుకున్నా దాని మూలాల్లోకి వెళ్ళి, దాని పునాదిని అర్థం చేసుకుని మనకు అర్థం అయ్యేట్లు చేయగలిగే నైపుణ్యం ఆయనది. ఆయన రచనలో ఎక్కడా భావవాదపు ఛాయలుగానీ, ఆ చారిత్రకతగానీ కనపడదు. వర్తమానాన్ని సునిశితంగా, అర్థం చేసుకోగలిగిన మేధావి కాబట్టే ఆయన సమాజ భవిష్యత్ చిత్రపటాన్ని ఊహించగలిగాడు. ప్రస్తుతం మనమెదుర్కొంటున్న ఫాసిస్టు హిందూ మత ప్రమాదాన్ని ఆయన ఐదు దశకాల ముందే పసికట్ట గలిగాడు. వరవరరావు గారన్నట్లు "ప్రజాసమస్యల గర్భంలోకి చొచ్చుకొని పోయిన నిశితదృష్టి సి.వి.ది"

తెలంగాణా సాయుధ రైతాంగ పోరాట విరమణ తర్వాత కమ్యూనిస్టు రాజకీయాలతోపాటు, అభ్యుదయ సాహిత్యోద్యమం నిస్తేజంగా నిలబడ్డనాడు అరసం వెనుకబాట పట్టినప్పటి నుండి దిగంబర కవిత్వమారంభమయ్యేదాక ఏకవ్యక్తి సైన్యంలా కృషి చేసిన కలం యోధుడు సి.వి.

సునిశితమైన, సమన్వయ పూర్వక పరిశీలనా దృష్టి కారణంగానే సి.వి. యిలా రాయగలిగాడు. "కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఒకసారి, మతతత్వం పై మరోసారి, దున్నేవానికే భూమికి, రాజ్యాధికారానికి వేరొకసారి, యిలా ఉద్యమాలూ, పోరాటాలూ వేటికవి విడివిడిగా వుండవేమోనని నేననుకుంటున్నా....వర్గ పోరాటం అగ్రకుల వ్యతిరేక పోరాటంతో, భూస్వామ్య దేశస్తుల వ్యతిరేక పోరాటంతో భుజం భుజం కలిపిసాగాలి. దళితులు, మహిళలు, మైనారిటీలు, ఆదివాసి పోరాటాలూ, శ్రామికవర్గ పోరాటాలతో మమేకం కావాలి"

ఇంతటి కృషి చేసిన సి.వి.ని కారణాలతరాల వల్ల తెలుగు సమాజం మర్చి పోతున్న ఈ తరుణంలో యీ పుస్తకం తీసుకువచ్చిన 'జనసాహితి' కి అభినందనలు. అయితే ఒక్కమాట. "ఆంధ్రలో సంజయ్‌గాంధి పర్యటన అనే కరపత్రాన్ని రాయించింది తెలుగు జాతి గర్వించదగిన కమ్యూనిస్టు విప్లవనేత కామ్రేడ్ తరిమెలనాగిరెడ్డి" (ఈ పుస్తకంలో 10వ పేజి) అని రాయటంలో ఔచిత్యం కనిపించటం లేదు, 'రాయించటం' అనే పదం ఎబ్బెట్టుగా వుంది. **ప్రజాసాహితిలో సమరశీల కలం యోధుడు -సి.వి**, జనసాహితి ప్రచురణ, పేజీలు 250, రూ. 120/-లు. ప్రతులకు మైత్రీబుక్ హౌస్, జలీల్‌వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు, విజయవాడ-520002 ఫోన్-98486 31604.

**-యోగి**

## గాంధీ జీవితచరిత్రపై మరో మంచిపుస్తకం




"మరల నిదేల రామాయణంబన్నచో.... తలచిన రామునే తలచెద నేనును, నా భక్తి రచనలు నావిగాన" అంటూ ప్రశ్నోత్తరాలు రెండూ విశ్వనాథగారు యిచ్చుకున్నట్లుగా- గాంధీ జీవిత చరిత్రలు ఎన్ని ఉన్నా గాంధీ వైశిష్ట్యం తెలుసుకోటానికి, ఆయన ఆదర్శ ప్రాయమైన జీవన విధానం మరింతగా అవగాహన చేసుకోటానికి డా॥యెనిసెట్టి సాంబశివరావు అనువాద గ్రంథం "మహాత్మా" ఒక కరదీపిక.

గాంధీ తత్వానికి ప్రపంచమంతా నీరాజనం పలుకుతున్నా, అన్నిజాతులు జేజేలు పలుకుతున్నా, మన జాతి గాంధీ విషయంలో నిమ్మకునీరెత్తినట్టుగా నిద్రాణంగా ఉండటం సమంజనం, సమర్థనీయం కాదనే ఉద్దేశ్యంతోను జాతిని మేల్కొలపాలనే ఆలోచనతో సాగించిన ప్రయత్నంలో ఒక పార్శ్వం ఈ 'మహాత్మా' గ్రంథానువాదం. మనలోని విచక్షణాత్మక శక్తినీ సత్యాహింసాత్మక చైతన్య శక్తితో సమ్మిళితం చేసేందుకు ఈ చారిత్రక గంథాన్ని అవలోకించమని రచయిత కోరారు.

దీనానాథ్ గోపాల్ టెండూల్కర్ (1909-1971) ఒక గొప్ప ఛాయాచిత్రకారుడు. డాక్యుమెంటరీ చిత్రాల నిర్మాత, సుప్రసిద్ధ ఆంగ్లరచయిత పైగా గాంధీ అనుచరుడు. ఆయన గాంధీ జీవితాన్ని 8 సంపుటాలుగా రచించాడు. 1951వ సం॥లో నాటి ప్రధానమంత్రి నేహ్రూ పీఠికతో వెలువడిన "మహాత్మా మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ జీవితం" ప్రపంచ ప్రఖ్యాతి పొందింది.

గాంధీపుట్టుక (1869) పేరున మొదటి అధ్యాయం ప్రారంభం అవుతుంది. ఉదయించే భానుబింబం (1920) పేరున లోకమాన్యబాల గంగాధర తిలక్‌కి నివాళులు అర్పించటంతో 47వ అధ్యాయంగా ముగుస్తుంది. 1893 నుండీ 1914 వరకు దక్షిణాఫ్రికాలోని భారతీయులు, ప్రత్యేకించి కార్మికుల విషయంలో గాంధీ చేసిన సేవా సహాయ కార్యక్రమాలు ఆయనను ప్రముఖ న్యాయవాదిగా నాయకునిగా ఎదగటానికి ఏ విధంగా సహకరించాయో చాలా విపులంగా 27 అధ్యాయాలలో వర్ణించారు. 1915 జనవరిలో 'వీరవిప్లవఋషి'గా గాంధీ భారతదేశం తిరిగి రావటం, చంపారణ్ సత్యాగ్రహం, జలియన్‌వాలా బాగ్ ఉదంతం, ఖిలాఫత్ ఆందోళన మొ॥ ఉద్యమాల వివరాలు మిగిలిన ఆధ్యాయాలతో ఉన్నాయి. 'ఏ పుస్తకంలోను లేని విధంగా గాంధీజీకి సంబంధించిన అనేక యథార్థ విషయాలు గల చాలా విలువైన పుస్తకం' అని నెహ్రూజీచే ప్రశంసించబడిన పుస్తకం.

డా॥ యెనిసెట్టి సాంబశివరావు అసాధారణ గాంధీ భక్తులు. అంతర్జాతీయ గాంధీ తత్త్వవిశ్వ విద్యాలయం స్థాపించబడాలని నిరంతరకృషి చేస్తున్న గాంధీయవాది. 'ఆంధ్ర సాహిత్యంపై గాంధీ ప్రభావం' అనే అంశంపై పిహెచ్.డి.ని పొందారు. ఎన్నో కవితలు వ్యాసాలు, కథలు అనువాదాలు, గ్రంథాలు వ్రాసిన సాహితీమూర్తి.

డి.జి.టెండుల్కర్ రచించిన 'మహాత్మా' 8 సంపుటాలలో మొదటి సంపుటాన్ని తెలుగులోకి అనువాదం చేశారు. మహాత్ముని మైక్‌గా పిలవబడే సాంబశివరావు గారి అనువాదం అతి సరళంగాను, సత్యసుందరంగాను చక్కటి నుడికారాలు దీటైన వాక్య నిర్మాణంతోను ఆసక్తి కలిగించి చదివించేలా ఉంది. 343 పేజీలున్న ఈ పుస్తకంలో ఒక్క అచ్చు తప్పు కూడా లేకపోవటం విశేషం.

గాంధీ ప్రాంతానికీ, కాలానికీ అతీతుడైనవాడు. ఆయన జీవితంలోని అన్ని యధార్థ సంఘటనలని తెలుసుకోవటానికి 'మహాత్మా' పుస్తకం తప్పని సరిగా అందరూ చదవాలి.

డి.జి.టెండుల్కర్ రచన - మహాత్మా (మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ జీవితం), అనువాదం 'మహాత్ముని మైక్' యెనిసెట్టి సాంబశివరావు పేజీలు : 343 వెల రు.150/- ప్రతులకు : గ్రంథి కాంతారావు, గుంటూరు-522004 ఫోన్ : 2221065.

**-ఎమ్.వి.శాస్త్రి**, 94413 42999

ఏ రాష్ట్రంలో ఉన్నా, ఏ దేశంలో ఉన్నా తెలుగువాళ్ళంతా ఒక్కటే..
తెలుగులో సంతకం..తెలుగుదనానికి సంకేతం

## ప్రత్యక్ష చర్యలకు పూనుకోవాలి

ఈ ఉత్తరంతోపాటు రెండు దినపత్రిక వార్తా కత్తిరింపులను జత పరుస్తున్నాను. బెంగళూరు మరియు మండ్య ప్రాంతాలలో జయ కర్ణాటక సంఘం కన్నడ కోసం చేస్తున్న ఉద్యమాలకు సంబంధించిన వార్తలివి. కన్నడభాష అభివృద్ధి కోసం నిరంతరం కృషి చేస్తున్న సంఘాలు కర్ణాటక రాష్ట్రమంతటా ఉన్నాయి. అందువల్లనే కన్నడభాష అభివృద్ధిపథంలో వెలుగొందుతోంది.

తెలుగు భాషోద్యమ సమాఖ్య తక్కిన భాషోద్యమకారులు, భాషాభిమానులు తెలుగు భాషాభివృద్ధి కోసం ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేయడంతోపాటు ప్రత్యక్ష చర్యలకు పూనుకొంటేనే సాధ్యపడుతుంది. ఈ క్రింది అంశాలపై కార్యాచరణకు పూనుకోవాలి.

1. ప్రభుత్వ కార్యాలయాలు, దుకాణాలు, రహదారుల ప్రక్కన పేరు పలకలలో తెలుగుభాష అగ్రభాగాన ఉండాలి. తర్వాతే ఆంగ్లం కాని వేరే భాష కాని ఉండేలా చర్యలు తీసుకోవాలి. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల ప్రభుత్వ చిహ్నంలో (లోగో) ఆంగ్లభాష పై భాగాన ఉంది. ఇది తెలుగుజాతికే అవమానం. లోగోలో తెలుగు భాష పై భాగంలో ఉండాలి.
2. ప్రభుత్వ వాహనాలు, బస్సులపై ఏ.పీ.ఎస్.ఆర్‌టీసీ, టి.ఎస్.ఆర్.టి.సి అని కాక ఆం.ప్ర.రా.రో.ర.సం., తె.రా.రో.ర.సం. అని తెలుగులో ఉండాలి. రిజిస్ట్రేషన్ సంఖ్యలను తెలుగు సంఖ్యలలో కూడా వ్రాయాలి. బస్సుల ప్రయాణ చీటీలను (టికెట్స్) తెలుగులో ముద్రించాలి.
3. ప్రభుత్వ పాఠశాలల్లో 1 నుండి 10వ తరగతి వరకు తెలుగు మాధ్యమంలోనే బోధన జరగాలి.
4. ప్రభుత్వ సమావేశాల సందర్భంలో వేదికపై తెలుగులోనే వివరాలు (బేనర్లు) వ్రాయాలి.
5. శాసనసభ మరియు శాసనమండలి సమావేశాల్లో సభ్యులందరూ తెలుగులోనే మాట్లాడేలా ఒత్తిడి తీసుకురావాలి.
6. ఇతర భాషల చలనచిత్రాలను, టి.వి. ధారావాహికలను తెలుగులోకి అనువదించడాన్ని నిషేధించాలి. ఈ నిషేధం కర్ణాటకలో అమలులో వుంది. కాన్ని కన్నడ చలనచిత్రాలు యధేచ్ఛగా తెలుగులోకి అనువాదమవుతున్నాయి.
7. తెలుగు చలనచిత్రాల పేర్లు తెలుగులోనే ఉండాలి. ఆంగ్లతోకలు కూడా ఉండకూడదు. తోకలు కావాలనుకుంటే తెలుగులోనే పెట్టుకోవచ్చు. ప్రచారంలో (పోస్టర్స్) వివరాలు ఆంగ్లంలో కాక తెలుగులోనే ఉండాలి. చలనచిత్రాలలో పేర్లు (టైటిల్స్) ఈమధ్య ఆంగ్లంలోనే వేస్తున్నారు. ఆంగ్లంతోపాటు తెలుగులో కూడా ఉండాలి.
8. టీ.వీలలో యాంకర్లు విచ్చలవిడిగా ఆంగ్లపదాలు వాడకుండా చక్కటి తెలుగులో మాట్లాడేలా చర్యలు తీసుకోవాలి. టీ.వీ షోలకు (ప్రదర్శనలకు) తెలుగులోనే పేర్లుండాలి. టీ.వీలలో కార్యక్రమాలకు సంబంధించిన ప్రకటనలన్నీ తెలుగులోనే ఉండాలి. న్యూస్ అనే మాటను (తెలుగులో) వార్తలుగా ప్రకటించాలి. కార్యక్రమాల పేర్లు తెలుగులో ఉండాలి. 30 మినిట్స్, వీకెండ్ కామెంట్ బై ఆర్.కె., న్యూస్ ఎట్ టెన్ పి.ఎమ్...ఇలా ఆంగ్లంలో పేర్లు ఎందుకు? టీవీలు తెలుగువి. చూసేవాళ్ళు తెలుగువాళ్ళు. కార్యక్రమాలు తెలుగువి. మరి ఆంగ్ల ప్రమేయం ఎందుకు?
9. దిన, వార, పక్ష, మాసపత్రికల్లో విచ్చలవిడిగా ఆంగ్లపదాలు వాడుతూ తెలుగుభాషను కల్తీభాషగా దిగజార్చే దుస్థితి నెల కొంది. ఆంగ్లపదాల వాడకం సాధ్యమైనంత వరకు తగ్గించు కోవాలి.
10. తలిదండ్రులు, కుటుంబ సభ్యులు, గొప్పవాళ్ళనుకొనేవారు ఆంగ్లంలో మాట్లాడ్డం మాని తెలుగులో మాట్లాడ్డం గొప్ప అను కొనే పరిస్థితి నెలకొనాలి.
11. ఏపీటిఎస్ అనే బదులు ఆం.ప్ర., తె.రా. అన్న పొట్టి మాటలను వాడుకలోకి తేవాలి.

ఈ అంశాలపై తెలుగుభాషోద్యమకారులు ఉద్యమిస్తే తెలుగు భాషకు వెలుగు వస్తుంది.

**–ఆర్.శ్రీనివాస్,** సింగసంద్ర, బెంగళూరు–114

## ప్రభుత్వం నడుం బిగించాలి

బోధనా మాధ్యమంపై చెన్నూరి ఆంజనేయరెడ్డి గారి దృక్కోణం చాలా సమంజసంగా వుంది. ఆయన చెప్పిన సంగతులన్నీ వాస్తవాచరణతో కూడుకుని వున్నాయి. బ్రతుకు తెరువు కోసం చదువు అనే చట్రంలో ఇరుక్కుపోయిన సమాజంలో ఏ మాధ్యమం ఉపాధి చూపుతుందో, అటువైపు సమూహాలన్నీ ఒరిగిపోవడం అసహజమేమీ కాదు. ఈ విషయంపై ఎవరు గగ్గోలు పెట్టినా వెనక్కి మళ్ళించడం సాధ్యం కాదు. ఏ మాధ్యమమైనా దాని ప్రాధాన్యతను, అవసరాన్ని పెంపొందించుకోవాలి. ఇందుకు ప్రభుత్వమే నడుం బిగించాలి. మాతృభాషా మాధ్యమంలో చదివిన వారికి ఉద్యోగ, ఉపాధిలో ప్రోత్సాహకాలు అందించాలి. దుష్ట సమాసాలు, తత్సమాలు, ప్రకృతి వికృతిపై ఆయన లేవనెత్తిన అంశాలు న్యాయసమ్మతమైనవి. ఒకవైపు తెలుగు సంస్కృత పదాలను కలిపి మాట్లాడుతూ వ్రాత వద్దకు వచ్చే సరికి దుష్ట సమాస మంటున్నారు. ప్రజలు వాడుతున్న భాషనే ప్రామాణిక భాషగా చేసుకోవాలి.

**–వై.హెచ్.కె.మోహన్‌రావు,** పిడుగురాళ్ళ, 94401 54114

## తెలుగు భాషా ప్రతిన

“నేను తెలుగువాణ్ణి. నా మాతృభాష తెలుగు. తల్లిని ప్రేమించినట్టే, నేను నా అమ్మ భాషను ప్రేమిస్తాను. తెలుగులో రాయటం, చదవటం, మాట్లాడటం నా జన్మతో వచ్చిన అధికారం. నా యీ హక్కును వొదులుకోను. నేను తెలుగువాడినని చెప్పుకోవడానికి ఎక్కడైనా, ఏ స్థాయిలోనూ గర్విస్తాను” అని తెలుగు రాష్ట్రాలలోని బడులలో బాల బాలికల చేత ప్రతిన చేయించేలా ప్రభుత్వం పూనుకోవాలి. అమలు చేయాలి. దీని కోసం రెండు రాష్ట్ర ప్రభుత్వాలూ చర్యగైకొనాలి.

**–మాధవీసనారా,** అనకాపల్లి, 94401 03134

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

